# ఆయన గురించే చేశాను

## -అనీషా ఆంబ్రోస్

'అలియాస్ జానకి'తో టాలీవుడ్‌లో సినీ ప్రయాణం మొదలు పెట్టిన అనీషా ఆంబ్రోస్‌కి ఇప్పటి వరకూ సరైన క్యారెక్టర్ దొరకలేదు. 'రన్', 'మనమంతా' లాంటి సినిమాల్లో నటించినా ప్రయోజనం మాత్రం శూన్యం. అయితే ఇప్పటి వరకూ చేసిన సినిమాలన్నీ ఒక ఎత్తు, తన తాజా సినిమా 'ఫ్యాషన్ డిజైనర్ సన్ ఆఫ్ లేడీస్ టైలర్' సినిమా ఒక ఎత్తు అంటోంది అనీషా. ఈ సినిమాతో తన కెరీర్ మలుపు తిరుగుతుందని గట్టిగా నమ్ముతున్న అనీషాతో....





### ఈ సినిమాలో నా పాత్ర ఎలాంటిదంటే...

విదేశాల నుంచి పల్లెటూరికి వచ్చిన ఎన్నారై అమ్మాయిగా నటించాను. విదేశాల నుంచి వచ్చినా నాకు పల్లెటూళ్ళంటే చాలా ఇష్టం. పెరిగింది అంతా విదేశాల్లో కనుక నాకు చీర కట్టుకోవడం, లంగా ఓణీ లాంటి సంప్రదాయ దుస్తులు ధరించడం రాదు. అయినా కష్టపడి వాటిని కట్టుకోవడం నేర్చుకుంటాను. అంతేకాదు పల్లెటూరి అనుబంధాల గురించి కూడా తెలియదు. కానీ వాటి చుట్టూనే నా పాత్ర తిరుగుతుంది.

### గ్లామరస్‌గా కనిపించానంటే....

నా గత చిత్రాలతో పోల్చుకుంటే ఈ సినిమాలో గ్లామరస్‌గా కనిపించాననే చెప్పుకోవాలి. సంప్రదాయ దుస్తులతో పాటు మోడ్రన్ డ్రస్సులు కూడా ఎక్కువగానే వేసుకున్నాను.

### వంశీగారి గురించి....

ఆయన కోసమే ఈ సినిమా చేశాను. ఈ కథ చెప్పగానే బాగా నచ్చింది. ఆయన తన సినిమాల్లో హీరోయిన్‌ని ఎంత అందంగా చూపిస్తారో తెలుసు. అంతేకాదు. ఆయన సినిమాల్లో హీరోయిన్‌కి చాలా ప్రాముఖ్యం ఇస్తారు. అందుకే ఆయన అడగగానే ఓకే చెప్పేశాను. ఓ పెద్ద డైరెక్టర్‌తో చేయడం వలన చాలా విషయాలు తెలుసుకోగలిగాను.

### 'లేడీస్ టైలర్' సినిమా

గతంలో ఈ సినిమా చూడలేదు. ఇప్పుడు దీని సీక్వెల్‌లో నటించడానికి ఒప్పుకున్న తరువాత ఆ సినిమా చూశాను. బాగా నచ్చింది. అందులోని హాస్యాన్ని బాగా ఎంజాయ్ చేశాను. ఆ సినిమా ఎక్కడా అసభ్యంగా అనిపించదు. ఈ సినిమా కూడా అంతే! అశ్లీలానికి తావు లేకుండా ఉంటుంది. ఆ సినిమాకీ, ఈ సినిమాకీ చాలా తేడా ఉంది. సినిమా చూస్తే ఆ తేడా తప్పకుండా తెలుస్తుంది.

### మిగతా ఇద్దరు హీరోయిన్ల గురించి చెప్పాలంటే....

ఈ సినిమా చేసే సమయంలో చాలా మంది నన్ను ఒక ప్రశ్న అడిగేవారు. మిగతా వారితో క్లాషెస్ రావడం లేదా? అని. మేం ఏమీ చిన్న పిల్లలం కాదు కదా కొట్టుకోవడానికి. ముగ్గురు హీరోయిన్లు ఉన్నా ఎవరి ప్రాధాన్యం, ప్రాముఖ్యం వారికి ఉంది. సెట్‌లో ఎంజాయ్ చేశామే తప్ప ఎప్పుడూ గొడవ పడలేదు.

### మరిచిపోలేని అనుభవం....

గోదావరి జిల్లాలో వర్క్ చేసే సమయంలో అక్కడ సిగ్నల్స్ లేవు. ఫోన్లు, ఇంటర్నెట్ వంటివి పనిచేసేవి కావు. అక్కడ షూటింగ్ జరిగినన్ని రోజులూ మా కుటుంబంతో సంబంధం దాదాపు తెగిపోయిందనే చెప్పాలి. ఫోన్లు పనిచేయకపోయేసరికి మొదటి రోజు కంగారుగా అనిపించినా, ఆ తరువాతి రోజులు హాయిగా గడిచిపోయాయి. ఫోన్లు లేకపోతే జీవితం ఎంత ప్రశాంతంగా ఉంటుందో అప్పుడు అనుభవంలోకి వచ్చింది.

### సుమంత్ అశ్విన్ గురించి చెప్పాలంటే..

ఈ సినిమాకి ముందు తనతో నాకు పరిచయం లేదు. కానీ ఇప్పుడు తను నాకు మంచి స్నేహితుడైపోయాడు. ఓ మంచి స్నేహితుడితో సినిమా చేస్తే ఎంత మంచి అనుభూతి కలుగుతుందో, నాకు తనతో చేస్తున్నప్పుడు అలా అనిపించింది.

### ఎలాంటి సినిమాలు చేయాలని ఉందంటే....

ఇప్పుడిప్పుడే ఈ రంగంలో నిలదొక్కుకోవడానికి ప్రయత్నిస్తున్న నటిని. అప్పుడే నాకు అలాంటి క్యారెక్టర్లు చేయాలని ఉంది, ఇలాంటి సినిమాలు చేస్తానని చెప్పడం అతిగానే అనిపిస్తుంది. ప్రస్తుతానికి నా దగ్గరకు వస్తున్న అవకాశాలలో మంచివి అనుకున్నవి చేస్తున్నాను. కొన్నిరోజులుపోతే ఎలాంటి క్యారెక్టర్లు కావాలని ఉందో చెప్పగలను.

### తరువాతి సినిమాలంటే...

మంచు మనోజ్‌గారితో 'ఒక్కడు మిగిలాడు' చేస్తున్నాను. ఎల్‌టిటిఇ ప్రభాకరన్ బయోపిక్ అది. మరి కొన్ని కథలు వినడం జరిగింది కానీ, ఏవీ ఓకే కాలేదు. ఓకే అయిన తరువాత వాటి వివరాలు చెబుతాను.

–భరత్ కుమార్

## నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



### తురగా జానకీరాణి కథల పోటీ

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. 7,000 |
| 5 విశేష బహుమతులు కథ ఒక్కింటికి | : రూ. 5,000 |



### తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. 7,000 |
| 5 విశేష బహుమతులు కథ ఒక్కింటికి | : రూ. 5,000 |

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'తురగా జానకీరాణి కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద 'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి' అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా


నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033


## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017



## 48 మృత్యుంజయులు

మాతృగర్భంలోంచి బాహ్య ప్రపంచంలోకి వస్తే అది పుట్టుక. మార్చురీ గదిలోని శవ పేటికలోంచి పైకి లేచి వస్తే అది మృత్యువును జయించడం. సాక్షాత్తూ వైద్యులు నిర్ధారించిన విగతజీవులెందరో చితిమంటల ముంగిట్లో శ్వాసపీల్చి మనల్ని అబ్బురపరుస్తున్నారు. ఆ మృత్యుంజయుల గురించి..

| 36 | 70 |
|---|---|
| **విజయ విలాసం–2**<br>(కొత్త శీర్షిక ప్రారంభం)<br>అందరిలోకి ది బెస్ట్ అనిపించుకుని గెలుపుగుర్రంపై స్వారీ చెయ్యాలంటే ఏం చెయ్యాలో తెలుసుకోండి. యువతరానికి ప్రేరణ ఇచ్చే సరికొత్త గైడెన్స్ ఈ వారం నుండే. | **ఇంటర్వ్యూ**<br>ఉత్తర దక్షిణాది సినీ రంగాల్లో విలనిజాన్ని పండించిన దిట్ట ఆశిష్ విద్యార్థి. నేను మంచి విలన్‌ని అంటున్న అయన ఇంటర్వ్యూ |

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: అనీషా ఆంబ్రోస్
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### ఆనందం

టీవీలో గురువుగారొకరు చెప్పారిలా.

లోలోపల శాంతిని సాధించాలంటే...ప్రారంభించి సగంలో నిలిపివేసిన పనులను వెంటనే చక్కబెట్టాలి. అప్పుడు హాయిగా, ఆనందంగా ఉంటుంది.

గురువుగారి మాటలు విన్న దేవదాసు వెంటనే కార్యాచరణలోకి దిగాడు. సగం తాగి వదిలిపెట్టిన ఓడ్కాసీసాను అందుకున్నాడు. అలాగే సగం తాగిన రమ్‌బాటిల్ అందుకున్నాడు. ఆ మధ్య వదిలేసిన రెండు బీరుబాటిల్స్ తీసుకున్నాడు. ఫ్రిజ్‌లో దాచిపెట్టిన సగం క్రీమ్‌కేక్‌నీ, అలాగే అప్పుడెప్పుడో తినగా మిగిలి పోయిన సగం చాక్‌లెట్‌బాక్స్‌నీ అందుకుని అన్నిటినీ ఎంచక్కా ఖాళీ చేశాడు. పరిస్థితి వర్ణనాతీతంగా మారింది అతనికి. లోలోపల శాంతి మేటలు వేసినట్ట నిపించింది. దాంతో అందరికీ ఇలా ఎసెమ్మెస్ పెట్టాడు దేవదాసు.

ఫలానా టీవీలో గురువుగారు చెప్పింది గుర్తు పెట్టుకోండి! ఆనందాన్ని అందుకోండి!

### పార్కింగ్

మేనేజర్ని పిలిచి, కంపెనీ ఛైర్మన్ అడిగాడిలా.

"నీ దగ్గర పని చేసే ఉద్యోగులు టైంకి ఆఫీసుకు రాగలగాలి. ఎలా వారిని మోటివేట్ చేస్తావు?"

"సో సింపుల్ సార్! నా దగ్గర ముప్ఫయిమంది ఉద్యోగులు పని చేస్తున్నారనుకోండి. ఫ్రీ పార్కింగ్ ఇస్తున్నాం అని చెప్పి, ఇరవై తొమ్మిదిమందికే పార్కింగ్ ఎలాట్ చేస్తాను. మిగిలిన ఒకటీ పెయిడ్ పార్కింగ్ అంటాను, అప్పుడిక చూసుకోండి." అన్నాడు మేనేజర్.

### డబ్బు:సంతోషం

* డబ్బుపెట్టి సంతోషాన్ని కొనలేం కాని, డబ్బుంటే బెంజ్‌కారులో ఎంచక్కా ఎవరికీ కనబడకుండా హాయిగా కూర్చుని ఏడవచ్చు. అదే సైకిల్ మీద వెళ్తూ ఏడిస్తే అసహ్యంగా ఉంటుంది.
* శత్రువులను క్షమించేయ్, అయితే వాళ్ళ పేర్లు మాత్రం మరచిపోకు.
* కష్టాల్లో ఉన్నవారిని ఆదుకో! మళ్ళీ వారు కష్టాల్లో ఉన్నప్పుడు నిన్ను తప్పకుండా గుర్తుతెచ్చుకుం టారు.
* చాలామంది ప్రజలు బతికి ఉన్నారంటే కారణం, కాల్చి చంపడం నేరం కాబట్టి.
* మందు తాగినంత మాత్రాన సమస్యలు సమసి పోవు. మజ్జిగ తాగినా అంతే!

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 14

7-6-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# రాయుడుబాబునది

పరుగెత్తేనది, ప్రవహించేనది, ఊసులాడేనది, ఊపిరిపోసే నది ఏది? ఎక్కడ? ఎగువన కబ్జా చేశారు. రాయి రప్పాపోసి బలహీనం చేశారు. దిగువన ఇసుక కోసం తవ్విపోశారు. నూరు మీటర్ల వెడల్పున ఉండే నది, పట్టుమని పదిమీటర్ల వెడల్పు కూడా లేదు. కుంచించుకుపోయింది.. కృశించిపోయింది. గలగలలు కోల్పోయింది. కదలక చెరువైపోయింది. గుర్రపుడెక్క వ్యాపించడంతో కనుమరుగైపోయింది. చూసి కళ్ళు చెమర్చుకున్నాడు రాయుడు. గట్టు మీది రామాలయాన్ని చూశాడు. శిథిలావస్థలో ఉందది. ఆలయానికి తలుపులు కూడా లేవు. గర్భగుడిలోని రాముడు నేరుగా కనిపిస్తున్నాడు. భోరుమన్నాడు రాయుడు. రామనవమినాడు కల్యాణం జరిపించి, సీతారాముల్ని పడవలో, నదిలో ఊరేగించడం ఒకనాటి వైభవం. ఆ ఊరేగింపు ఇప్పుడు లేదట! మానేసి అయిదేళ్ళయిందట! అయిదేళ్ళకిందట సీతారాముల్ని ఊరేగిస్తున్న పడవ, చెరువులో, నాచులో ఇరుక్కుని తిరగబడిందట! ఆ ప్రమాదంలో పూజారిగారు చనిపోయారట! నాటి నుంచీ రామాలయానికి ఏ విభవమూ లేదని తెలిసింది. బాధనిపించింది. బరువుగా కూలబడ్డాడు రాయుడు. అరవై ఏడేళ్ళ రాయుడు కళ్ళముందు ఆరేళ్ళ రాయుడు పరుగుదీస్తూ కనిపించాడు.

తల్లితో రేవుకి వచ్చాడు ఆరేళ్ళ రాయుడు. తన కొంగుపట్టుకుని నదిలోనికి దిగమన్నది తల్లి. అలాగే చేశాడు. తల్లి కొంగుపట్టుకునే నదిలోనికి దిగి, ఈదులాడాడు రాయుడు. మహదానందం అంతా నీరే! నీరు లేకపోతే ఆనందం లేదనిపించింది ఆ క్షణం. అది మొదలు నదితో అనుబంధాన్ని పెంచుకున్నాడు రాయుడు. బాల్య, కౌమార, యౌవనాలంతా నదితోనే గడిపాడు. పిల్లలు రమ్మంటే పట్నం వెళ్ళాడు. మనవలు రమ్మంటే అటు నుంచి అటు విదేశాలు వెళ్ళాడు. వెళ్ళి పదిహేనేళ్ళకి తిరిగి వచ్చాడు. వచ్చి చూస్తే నది లేకుండాపోయింది. గుండెనెవరో దొంగిలించినట్టనిపించింది. ఏం చెయ్యాలిప్పుడు? ఆలోచనలోపడ్డాడు రాయుడు. ఆ రాత్రి ఊరి ప్రముఖుల్నీ, పెద్దల్నీ సమావేశపరిచాడు. నదిలేకపోతే నీరు లేదన్నాడు. నదిలేకపోతే నడత లేదన్నాడు. నాగరికత లేదన్నాడు. నదిని సాధించుకుందాం. నడుం బిగిద్దాం అన్నాడు. సరేనన్నారు కొందరు. ఇంకొందరు డబ్బుగలవాళ్ళతో యుద్ధం అన్నారు. జాగ్రత్త అన్నారు. అయినా పర్వాలేదన్నాడు రాయుడు. మాటను మాటతో కొడతాను. డబ్బును డబ్బుతో కొడతానన్నాడు. మీసం మెలేశాడు. అయిదువేలమంది ఊరిప్రజల్ని అడుగడుగునా బతిమాలి నదికోసం, నదిలో నీటికోసం అనుక్షణం కష్టించాడు. కబ్జాకోరల్ని పెరికేశాడు. రాళ్ళనీ, రప్పల్నీ ఏరేశాడు. చెత్తనీ, చెదారాన్నీ దూరంగా నెట్టేశాడు. తన వంతు ఆస్తి అయిదుకోట్లూ ఖర్చు చేశాడు. అప్పుడు నేల నవ్వింది. నింగి నవ్వింది. నీరుపారింది. నీటిలో చేపలు పారాడాయి. ఊరిబావుల్లో చుక్కనీరు లేదు అంత వరకూ. నదిలో నీరు రావడంతో బావులు కూడా కళకళలాడాయి.



రేవుని జాగ్రత్తగా చూసుకోవాలి. నదిని కాపాడుకోవాలి. నదిగట్టునే నివాసం అనుకున్నాడు రాయుడు. గట్టు మీది రామాలయానికి మరమ్మతులు చేయించి, తలుపులు ఏర్పాటు చేశాడు. రాముడుకి మరుగు ఏర్పరిచాడు. తాను కూడా ఆలయమండపంలోనే మకాం చేశాడు. రామనవమికి  సీతమ్మనీ, స్వామినీ పడవలో ఊరేగించాడు. చూడయ్యా చూడు! నది నిండా నీరే! నీటిలో నీ ఊరేగింపుకి కొరత లేదన్నాడు. నదినీ, రాముణ్ణీ చూసుకుంటూ శేషజీవితం అంతా గడిపేశాడు రాయుడు. ఓ ఏకాదశిరోజు శుభ్రంగా స్నానం చేసి, రాముణ్ణి దర్శించుకుని, గట్టు మీది రావిచెట్టు నీడలో కూర్చుని, పారుతున్న నదినీ, పాడుతున్న పక్షుల్నీ చూస్తూ ఇక ఈ జన్మ చాలనుకున్నాడు రాయుడు. చనిపోయాడు.

రాయుడు చనిపోయి పుష్కరమైంది. నదికి పుష్కరాలు వచ్చాయన్నారు ఊరూవాడా. ఉత్సవాలు ప్రారంభించారు. నదిలో వేదిక ఏర్పాటు చేశారు. ఆ వేదిక మీద రాయుడు విగ్రహం నిలిపారు. నదితోపాటు రాయుడికీ నీరాజనాలు అర్పించారు. పసుపు, కుంకుమ నీళ్ళలో కలిపితే పరవశించిపోయాడు పైలోకంలో ఉన్న రాయుడు. పువ్వులు చల్లితే పులకరించిపోయాడు. ఓ తెల్లారుజామున సప్తఋషులుసహా దేవతలు అనేకమంది సూక్ష్మరూపంలో రేవులో స్నానం చేస్తోంటే చేతులెత్తి వారికి నమస్కరించాడు రాయుడు. దీవించారు దేవతలు. వరం కోరుకో అన్నారు. రాయుడప్పుడు కోరిన వరం ఏమిటో తెలుసా? తాను నీరైపోవాలన్నాడు. నీరై, పుట్టి పెరిగిన నేల మీద ప్రవహించాలన్నాడు. ఏ కాలంలోనూ ఎండిపోక పిన్నలూ, పెద్దలూ, పడవలూ, చేపలూ తనలో పారాడుతోంటే తరించాలన్నాడు. తథాస్తు అన్నారు దేవతలు. నాటి నుంచే ఆ ఊరి నదికి రాయుడిబాబునది అని పేరొచ్చింది. నేటికీ అది నిండుగా ప్రవహిస్తూ ఉంది. నవ్య




## ఆర్గానిక్ విత్తనాలు

మనిషి ఆహారపు అలవాట్లు మారుతున్నాయి. సేంద్రీయ ఉత్పత్తుల మీద జనానికి అవగాహన పెరుగుతోంది. ఈ మార్పు మంచిదే అయినా, బయట మార్కెట్లలో దొరికే ఆర్గానిక్ ప్రోడక్టుల్లో నిజమెంత? అవి పూర్తిగా సేంద్రియ పద్ధతిలో పండించినవే అని గ్యారెంటీ ఏమిటి? అందమైన ప్యాకింగ్, ఆర్గానిక్ అని లేబుల్ వేయగానే అది నాణ్యమైన ప్రోడక్ట్ అవుతుందా? మార్కెట్లో ఆర్గానిక్ వెజిటబుల్స్ కావల్సినవన్నీ దొరుకుతున్నాయి. మరి అవన్నీ సేంద్రియ పద్ధతిలో పండించిన కూరగాయలేనా? ఇలాంటి సందేహమే నవీన్ అనే యువకుడికి వచ్చింది. బాల్కనీలో మనమే ఆకుకూరలు పండించుకుంటే పోలా? అనే ఆలోచనతో నవీన్ షాపులన్నీ తిరిగాడు. ఒక్కటంటే ఒక్క షాపులో కూడా తనకు కావలసిన నాణ్యమైన విత్తనాలు దొరకలేదు. ఆ విసుగులోంచి పుట్టిన ఆలోచనే సీడ్ బాస్కెట్ డాట్ ఇన్.



రెండు నెలలు పరిశోధన చేశాడు. మరో ఆరు నెలలు వెబ్ సైట్ కోసం కష్టపడ్డాడు. మొత్తమ్మీద ఎనిమిది నెలల కష్టం తర్వాత, హోం గార్డెనింగ్ కోసం అన్ని రకాల విత్తనాలు దొరికే ఆన్‌లైన్ స్టోర్‌గా సీడ్ బాస్కెట్ అవతరించింది. ఇందులో ప్రస్తుతానికి వంద రకాల సీడ్స్ అందుబాటులో ఉన్నాయి. పూల విత్తనాలు, పండ్ల విత్తనాలు కూడా ఉన్నాయి.

మొదట్లో అనుకున్నంత రెస్పాన్స్ రాలేదు. అనేక సవాళ్లు ఎదురయ్యాయి. కొరియర్ ప్రాబ్లం, షిప్పింగ్ సమస్య ఉండేది. అయినా పట్టు విడవకుండా, మెల్లగా ఒక్కో సమస్యని పరిష్కరించుకుంటూ పోతున్నారు. మంచి ఇన్వెస్టర్ దొరికితే స్టార్టప్‌ను విస్తరించాలని చూస్తున్నారు. ఫ్రెస్కో సమన్వయంతో బాల్కనీలో నాలుగు రకాల ఆకుకూరల్ని పెంచే హైడ్రోఫోనిక్స్ విధానాన్ని ప్రవేశపెట్టాలని చూస్తున్నారు.

నవీన్ వృత్తిపరంగా సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. వ్యవసాయ నేపథ్యం ఉన్న కుటుంబం. భద్రాద్రి కొత్తగూడెం జిల్లాలోని గుండెపూడి గ్రామం నుంచి వచ్చిన నవీన్.. సాఫ్ట్‌వేర్ ఉద్యోగిగా హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. నవీన్ భార్య చందన ఆర్డర్లకి సంబంధించిన పనులు, కొరియర్ వ్యవహారాలు చూసుకుంటుంది.

'సీడ్ బాస్కెట్ డాట్ ఇన్' ద్వారా విత్తనాలు కొంటున్న కస్టమర్లంతా నవీన్ ఆలోచన బాగుందంటున్నారు. ఇంటింటికీ ఆర్గానిక్ ఫుడ్ అనే సూత్రంతో భవిష్యత్తులో ముందుకు పోతామని నవీన్ నమ్మకంతో చెప్తున్నాడు. ఆర్గానిక్ సీడ్స్ ఐడియా బాగుంది కదూ!

నవ్య

# మెయిల్ బాక్స్

### భార్యామణి సమయస్ఫూర్తి

మే 24వ తేదీ సంచిక మార్నింగ్ కాఫీలో రెండు అంశాలూ భార్యామణి సంయమనాన్ని, సమయస్ఫూర్తిని ప్రతిబింబించాయి. మొదటిపేజీ 'వేణువు' సీతమ్మ స్థైర్యం హృద్యంగా ఉంది. సరసి కార్టూనిస్టే కాక తనలో ఎంతో మహోన్నతమైన కథకుడున్నాడని 'మనిషి-పశువు' కథ ద్వారా నిరూపించుకున్నారు. అద్భుతమైన కథ అందించారు. డాక్టర్ పెరుగు రామకృష్ణగారి 'అమ్మ నీరసించినప్పుడు' కవిత ద్వారా దివంగతులైన మా అమ్మ నేమాన కమల జ్ఞాపకాలతో నా హృదయం బరువెక్కించారు. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్న జీవితసత్యం చెప్పిన నళినిగారితో ఏకీభవించనిదెవరు?

—నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### కళ్ళు చెమర్చాయి

అనుష్క ముఖచిత్రం చక్కగా ఉంది. కలిసి ఉంటే కలదు సుఖం వ్యాసం చదివాక కళ్ళు చెమర్చాయి. ఎందుకంటే ఉమ్మడికుటుంబాలు ఈనాడు లేకపోవడంవల్లనే భార్యాభర్తల అనుబంధం విడాకుల బాట పడుతోంది. విడిపోయిన తల్లిదండ్రులవల్ల పిల్లల బ్రతుకులు దెబ్బతింటాయి. రాజీవ్ కనకాల ఇంటర్వ్యూలో అభిప్రాయాలు బాగున్నాయి. కోటగారి కత బాగుంటోంది. ప్రతివారం నవ్యను నవ్యంగా తీర్చిదిద్దుతున్న ఎడిటర్ జగన్నాథశర్మగారికి అభినందనలు.

—కోలిపాక శ్రీనివాస్, బెల్లంపల్లి

### అనుష్క ముఖచిత్రం ఆకర్షణీయం

అనుష్క ముఖచిత్రంతో వీక్లీ ఎంతో ఆకర్షణీయంగా ఉంది. ముఖ్యంగా కలిసి ఉంటే కలదు సుఖం వ్యాసం విజ్ఞానదాయకంగా ఉంది. ఉమ్మడికుటుంబ వ్యవస్థ ప్రయోజనం చక్కగా వివరించారు.

—ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

### బాలి సీరియల్ బాగుంది

కొత్త సీరియల్ బాలిగారి ప్రయాణం చాలా బాగుంది. ఒక ఆడపిల్ల కథ ఆరంభమే ఆకట్టుకుంది. పెళ్ళి, పిచ్చుక కథలు చాలా బాగున్నాయి. మనమీదే నర్రోయ్ కార్టూన్‌లో రైలులో సంభాషణతో నవ్వించారు. హర్ష ఋతువు కథ చివరివరకు చాలా ఆసక్తికరంగా సాగింది. వెట్టి సీరియల్ వారం వారం సరికొత్త మలుపులు తిరుగుతూ ఆకట్టుకుంటోంది. ఆరోగ్యమే మహాభాగ్యం ఫీచర్‌లో సైకిల్ తొక్కడం వల్ల కలిగే లాభాలు వివరించారు. తీన్మార్ కార్టూన్లు సరికొత్తగా ఉంటున్నాయి.

—చిన్న, ఖమ్మం

### కథలు బాగున్నాయి

కథలన్నీ ఎంతో బాగున్నాయి. మిగిలిన శీర్షికలు కూడా అలరించాయి. కొత్తబంగారులోకం ఘటికాచల రావుగారి కథ ఎంతో బాగుంది. ఊహించని మలుపుతో ఆసక్తికరంగా ఉంది. కోట శ్రీనివాసరావుగారి కథాకథనం చాలా బాగుంటోంది. ఓలేటి శ్రీనివాస భానుగారి అపార్ట్‌మెంట్ లిప్టు కవిత చాలా బాగుంది. మంచి కవితలు, కథలతో పత్రిక అలరిస్తోంది.

—అన్నపూర్ణ, ఓయు కాలనీ, మణికొండ, హైదరాబాద్

### ప్రాణ రక్షణ రహస్యం సూపర్బ్

ప్రాణాలు రక్షించే రహస్యం వ్యాసం ఈ వారం ఆశ్చర్యపరిచింది. మన పూర్వీకుల నుండి వేల సంవత్సరాలుగా లభించిన అనుభవం నరనరాల్లో జీర్ణించుకుపోవడం వల్లనే మనలో ఆ శక్తి యుక్తులు అభివృద్ధి చెంది ప్రాణాంతకమైన సమయాల్లో మనల్ని అప్రమత్తుల్ని చేస్తున్నాయి. ఒక సరికొత్త కోణంలో వ్యాసకర్త గోగుమళ్ళ కవితగారు రాసిన విషయాలు మన విల్ పవర్‌కు చిహ్నాలు. భూకంపంలో మనం కింద ఉండిపోయినా గానీ మన విల్‌పవరే మనల్ని ప్రాణాలు నిలబెట్టుకునేలా చేస్తుంది. మనిషి ధైర్యం, దిటవుగుండె ఇలాంటి సందర్భాల్లోనే బైటపడుతుంది. దీనినే ఛార్లెస్ డార్విన్ ఏనాడో సర్వైవల్ ఆఫ్ ద ఫిట్టెస్ట్ అని చెప్పారు. రచయిత్రికి అభినందనలు.




—పోసి ప్రభాకర్, ఉప్పల్, హైదరాబాద్

### సర్వైవల్ రహస్యం

సక్సెస్‌ఫుల్ సర్వైవల్ టెక్నిక్స్ గురించి వివరించిన 'ప్రాణాలు రక్షించే రహస్యం' వ్యాసం ఆకట్టుకుంది. క్లిష్ట సమయాల్లో మనకు అనుభవం లేకపోయినా మనల్ని మనం రక్షించుకునేందుకు తెలివితేటలతో చేసే ప్రయత్నాలు బహుశా రచయిత్రి చెప్పినట్టు మన పూర్వీకుల నుండి తరతరాలుగా అభివృద్ధి చెంది మనలో దాగి ఉన్నాయి. వీక్లీ ప్రతి వారం విజ్ఞానదాయకమైన ఇలాంటి ఆర్టికల్స్‌తో చదివింపజేస్తోంది.

—ఎం.మల్లిఖార్జునరావు, హైదరాబాద్

### భిన్నమైన ముఖచిత్రం

చక్కని ఆహార్యం, గంభీరాకృతి, ప్రస్ఫుటమైన భావప్రకటనచేసే ముఖంతో మే 17వ తేదీ అనుష్క ముఖచిత్రం రొటీన్‌కు భిన్నంగా ఉంది. పాఠకుల దృష్టిని కొన్ని నిమిషాలపాటు ముఖచిత్రంపై లగ్నం చేయించింది. మార్నింగ్ కాఫీ చక్కని రుచి, కమ్మని వాసన ఇచ్చింది. తరాలనాటి తులసిమొక్క గురించి రసవంతమైన సమాచారం అందించారు. రాజీవ్ కనకాల పరిచయం రంజుగా ఉంది. సుమగారిని కూడా పరిచయం చేస్తే బాగుంటుంది. శివప్రసాద్‌గారు పిచ్చుక కథ రక్తికట్టించారు. ఇవన్నీ నిజాలేలో ఎంతో పరిజ్ఞానం మిళితమై ఉందని గ్రహించాలి. రాశి ఇంటర్వ్యూ, అనామకం కవిత, వాతమోత కథ, కొత్త బంగారులోకం కథ బాగున్నాయి.

—డాక్టర్ శివభూషణం, కర్నూలు

## మామిడి పండు తింటున్నారా? జాగ్రత్త!

పండ్లలో రారాజు...మనసును దోచే రంగు...నోరూరించే రుచి... ఇవీ మామిడి పండు ప్రత్యేకతలు. వేసవిలో మాత్రమే లభించే ఈ పండును ఇష్టపడని వారంటూ ఉండరు అంటే అతిశయోక్తి కాదేమో! ఎంత రుచిగా ఉన్నా, మరెంతగా నోరూరించినా...దీన్ని ఎక్కువగా తింటే దుష్ప్రభావాలు తప్పవు అంటున్నారు నిపుణులు. ఈ పండును ఎక్కువగా తీసుకోవడం వలన కలిగే చెడు గురించి వారు చెబుతున్న వివరాలు....

### బరువు పెరిగే ప్రమాదం!

ఒక మామిడి పండులో 135 క్యాలరీలు ఉంటాయి. ఎన్ని పండ్లు తింటే అన్ని క్యాలరీలు వచ్చి శరీరంలో చేరతాయి. ముఖ్యంగా అధిక బరువుతో బాధపడేవారికి ఈ మామిడి పండు వలన అదనపు క్యాలరీలు వచ్చి చేరే ప్రమాదం ఎక్కువగా ఉంది. అయితే రోజులో ఒకటి కన్నా ఎక్కువ మామిడి పండు తినాలనుకునే వారు రోజూ కన్నా ఓ అరగంట పాటు అదనంగా వ్యాయామం చేస్తే సరిపోతుంది అంటున్నారు నిపుణులు.

### చక్కెర స్థాయిలు పెరుగుతాయి

ముఖ్యంగా షుగర్ పేషెంట్లకు ఈ సమస్య ఎదురవుతుంది. ఈ పండులో సహజంగా లభించే చక్కెర కారణంగా వీరి శరీరంలో చక్కెర స్థాయిలు ఒక్కసారిగా పెరిగిపోతాయి. వీరు ఈ పండును ఎక్కువ తినడానికి వీల్లేదు. అయితే వీరు కూడా రోజుకి ఒక పండు వరకూ తినవచ్చని, అంతకు మించి తినాలంటే మాత్రం వైద్యులను సంప్రదించాలని నిపుణులు చెబుతున్నారు.

### కాళ్ళ తిమ్మిర్లు...

ఈ పండును కృత్రిమంగా మగ్గించడానికి కాల్షియం కార్బైడ్ అనే కెమికల్‌ని ఉపయోగిస్తారు. దీన్ని ఉపయోగించిన పండును తింటే కొన్ని సందర్భాలలో కాళ్ళూ చేతులూ లాగడం, తిమ్మిర్లెక్కడం వంటి సమస్యలు తలెత్తే ప్రమాదం ఉంది. ఆరోగ్యంతో ఉన్నవారు కూడా కొన్ని సార్లు ఈ సమస్యలకు లోనుకావలసి వస్తుంది. మామిడి పండును ఎంచుకునే సమయంలోనే దాన్ని ఎలా పండించారు? అన్న దాని మీద అవగాహన కలిగి ఉండాలని నిపుణులు చెబుతున్నారు. మంచి రంగుతో పాటు మంచి సువాసన వెదజల్లే పండునే ఎంచుకోవాలని వారు సూచిస్తున్నారు. కృత్రిమంగా పండించిన పండులో సువాసన అంతగా ఉండదు.

### ఉదరసంబంధ సమస్యలు

పచ్చివి, సరిగా పండని పండ్లు తినడం వలన ఉదరసంబంధ సమస్యలు వచ్చే అవకాశం ఎక్కువగా ఉంది. కడుపులో నొప్పి, మంట వంటివి తలెత్తవచ్చు. మామిడి పండ్లు తినే సమయంలో ఈ సమస్యలు తలెత్తితే వెంటనే పండును తినడం ఆపేయాలని నిపుణులు సూచిస్తున్నారు.

### నీళ్ళు తాగకూడదు

కొన్నిసార్లు మామిడి పండు తిన్న వెంటనే గొంతులో ఇరిటేషన్, కొద్దిగా మంటగా అనిపించవచ్చు. దీనికి కారణం పండు తిన్న వెంటనే నీరు తాగడమే అంటున్నారు నిపుణులు. పండు తిన్న ఐదు పది నిమిషాల వరకూ నీరు తాగకూడదని వారు సూచిస్తున్నారు.

### పెదవులు పగలడం

సహజంగానే ఎండాకాలం పెదవులు పగులుతుంటాయి. ఈ కాలం పచ్చిమామిడికాయ ఎక్కువగా తింటే పెదవులు పగిలే అవకాశం ఉంది. మామిడికాయను ఆహారపదార్థాలలో కాకుండా విడిగా తినడం అంత మంచిది కాదని వారు సలహా ఇస్తున్నారు.


www.justbornbaby.com

30 సంవత్సరాలుగా

Just born®

మీరు అధికంగా ప్రేమించేందుకు...

మీ శిశువుకు సరిపోయే విధంగా దర్జీతో మేము ప్రత్యేకంగా మీ శిశువుకు అధిక ఉత్పత్తులను తయారుచేస్తున్నాం. మరెక్కడా లేని విధంగా శ్రద్ధ, ప్రేమను ప్రతి జస్ట్‌బార్న్ ఉత్పత్తి అందిస్తుంది. 0–2 సంవత్సరాల వరకు గల మీ శిశువుకు క్యూట్ బేబీ క్లాత్స్, సాఫ్ట్ బేబి బ్లాంకెట్స్, ఫ్లప్పి బెడ్డింగ్స్, సూపర్ ఆబ్‌సార్బెంట్ టవల్స్, బిబ్స్, బోన్నెట్స్, బ్యూటీస్, ఫేస్ నేప్కిన్స్ మరియు మరెన్నో మా అద్వితీయ సేకరణల నుండి ఎంపిక చేసుకొనే బేబీ డైపర్లు, వెట్ వైప్స్, డిటర్జెంట్లు, టాయ్‌లెట్రీస్ వచ్చిఉన్నవి. మా జస్ట్ బార్న్ షోరూమ్‌లలో మాత్రమే లభిస్తాయి. అన్ని మా ఉత్పత్తులు 100% శిశుసంరక్షణ, మృదువుగా అత్యధిక నాణ్యతతో తయారు చేయబడినవి. విచ్చేయండి, జస్ట్‌బార్న్‌లో మీ చిన్నారికి ప్రేమను మరింత పంచండి.



Just born®

● చెన్నై ● హైదరాబాద్ ● వైజాగ్ ●
● బెంగళూరు ● తిరుచ్చి ●

Just born చెన్నై: 99, నుంగంబాక్కం హై రోడ్డు, గన్‌పత్ బిల్డింగ్, నుంగంబాక్కం, చెన్నై - 34, టెలిఫోన్: +91-44-2825 0017 / 2825 4670, నం. AA 120 శాంతి కాలనీ, 4వ అవెన్యూ, అన్నా నగర్ - చెన్నై - 600040. ఫోన్: 26202500, తిరుచ్చి: 43/A2, జుమన్ సెంటర్, ప్రొమెనాడె రోడ్డు, కంటోన్మెంట్ (BSNL ఎదురుగా), తిరుచ్చి - 01, టెలిఫోన్: +91-0431-2412020. హైదరాబాద్: 6-3-1085, రాజ్‌భవన్‌రోడ్డు, సోమాజీ గూడ, హైదరాబాద్ - 82, టెలిఫోన్: +91-40-23397770, బెంగళూరు: 9, మిల్లర్స్ రోడ్డు, కన్నింఘం రోడ్డు, బెంగళూరు - 52, టెలిఫోన్: +91-80-22258294, వైజాగ్: డోర్ నం.46-22-44, కళ్యాణ్ ఎస్టేట్స్, రైల్వే స్టేషన్ రోడ్డు, విశాఖపట్నం - 16, ఫోన్: +91-891-2534500, +91-8916666210

సంప్ర: 09840071000



జూన్ 6న నేషనల్ గార్డెనింగ్ ఎక్సర్‌సైజ్ డే సందర్భంగా

# ఆనందానికీ, ఆహ్లాదానికీ తోటపని

**నగరంలో ఎటుచూసినా పరుగులుపెట్టే జనం, వాహనాల పొగలు. అలసిసొలసి కాస్త నీడపట్టున సేదదీరుదామన్నా పచ్చని చెట్టు కనిపిస్తేనా? కాంక్రీట్ జంగిల్స్‌గా మారిన నగరాల్లో అపార్ట్‌మెంట్ సంస్కృతి పెరిగింది. స్థలాభావంవల్ల ఇంటి పెరడు మాయమైతే నగరజీవి ఇక మొక్కలు, తోటలు పెంచేదెక్కడ? అసలు మొక్కలు పెంచాలనే ఆలోచనే క్రమంగా దూరమవుతుంటే!. ఐతే సామాజిక వనాలు, వృక్షఛాయలేమివల్ల ఎన్నో అనర్థాలున్నాయని హెచ్చరిస్తున్నారు మానసిక నిపుణులు.**

కంటికి ఇంపైన పచ్చదనం కనుమరుగైతే, మనసు అలజడి చెందుతుంది. తద్వారా మానసికంగా శారీరకంగా అనేక ఇబ్బందులు మాత్రమే కాదు, వాతావరణ కాలుష్యంవల్ల కంటినిద్ర కూడా కరువు అవుతుందని అధ్యయనవేత్తలు తేల్చేశారు. పిల్లల నుంచి పెద్దల వరకు మానసికంగా శారీరకంగా ఆరోగ్యంగా, ఆనందంగా, ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉండాలంటే కాసేపు మొక్కల పెంపకంపై దృష్టిసారించాల్సిందే. ఉదయం సాయంత్రం ఓ అరగంట తోటపని చేయమంటున్నారు మానసిక నిపుణులు.

ఎన్నో ఆలోచనలు, పనులవల్ల పదినిమిషాలు ప్రశాంతంగా కూర్చునే తీరికకూడ నాగరికులకు లేకుండాపోయింది. మనసులో సుడులు తిరిగే ఆలోచనలు, భవిష్యత్తుపై ఆరాటం వెరసి మనిషిని ఒత్తిడికి గురిచేస్తున్నాయి. విశ్రాంతి అనే మాటే మరచిపోతున్నారు. అందుకే మనసుకు, మెదడుకు ఆలోచనలనుంచి కాసేపు విశ్రాంతి ఇవ్వాలి. అలా విశ్రాంతిని ఇవ్వాలంటే ప్రకృతితో మమేకమవ్వడం ఒక్కటే మార్గం. పెరటితోటలో కాసేపు చెట్ల మధ్య తిరుగుతూ, పూల సువాసనలు ఆస్వాదిస్తూ, వాటితో ఊసులాడుతూ ఉంటే చుట్టూ పరిసరాలనే మరిచిపోతారు.

పెరటితోట లేకపోతేనేం, కొందరు చక్కగా ఇంటి టెర్రస్‌పైన, బాల్కనీల్లో రూఫ్ గార్డెనింగ్ పెట్టుకుని తమకు అనుకూలమైన, అవసరమైన మొక్కలు పెంచుకుంటున్నారు. ఉత్సాహం నింపుకుంటున్నారు. ఇంకా తోటపనివల్ల ఇతరత్రా చాలా ప్రయోజనాలున్నాయని చెబుతున్నారు నిపుణులు. జూన్ 6న నేషనల్ గార్డెనింగ్ ఎక్సర్‌సైజ్ డే సందర్భంగా ఆ వివరాలు మీకోసం...

### ప్రశాంతత

రోజుకు ఒక అరగంట తోటపని చేయడంవల్ల మనసు ఉల్లాసంగా మారుతుంది. పైగా మానసిక ఒత్తిడి కారణంగా విడుదలయ్యే 'కార్టిసాల్ హార్మోన్ ఉత్పత్తి తగ్గుతుంది. ఊబకాయం నుంచి గుండె జబ్బుల వరకూ అనేక అనారోగ్య సమస్యలకు కార్టిసాల్ ఓ కారణం. దీనిని బట్టి తోటపని ఆనందాన్ని, ఆరోగ్యాన్నేకాక వ్యాధులబారినుంచి కూడా కాపాడుతుంది.





### ఆరోగ్యం మీ సొంతం

కొంతమంది జిమ్‌కెళుతుంటారు. మరికొంత మంది నడకే ఆరోగ్యం అనుకుంటుంటారు. ఇంకొంత మంది సైకిల్‌తొక్కడం, ఈతకొట్టడం చేస్తుంటారు. ఏంచేసినా, ఎంతచేసినా శరీరపటుత్వం పెంచుకోవడం, ఊబకాయం తగ్గించుకోవడం, అనవసరంగా అనారోగ్యంపాలుకాకుండా చూసుకోవడం కోసమే! అయితే వీటన్నిటికన్నా ఎక్కువగా తోట పని ఉపయుక్తంగా ఉంటుందని, అత్యద్భుత ఫలితాలు అందిస్తుందని తెలుసుకుంటే ఇక ఆరోగ్యం మీ సొంతమైనట్టే! ఆనందలోకం మీ ముంగిట నిలిచినట్టే!

తోటపనిలో మట్టిని తవ్విపోయడం, పాదులు కట్టడం, మొక్కలు నాటడం, కలుపు ఏరివేయడం... ఇలా చాలా పనే చేయవలసి ఉంటుంది. దీనివల్ల శరీరానికి కావల్సినంత వ్యాయామం లభిస్తుంది. పైగా ఈ తోటపని చేసే సమయంలో కళ్ళ దగ్గర్నుంచి వేళ్ల వరకూ ప్రతీ అవయవమూ నేర్పుగా పనిచేయాల్సి ఉంటుంది. అంటే శరీరంలోని ప్రతీ భాగానికీ ఇది చురుకుదనం అందిస్తుందన్నమాట!

### విటమిన్-డి

శరీరానికి ప్రకృతిసిద్ధంగా సూర్యరశ్మి నుంచి లభించే పోషకం విటమిన్-డి. కానీ నాలుగుగోడల మధ్యనే ఉండిపోతున్న జీవనశైలివల్ల ఈ డి-విటమిన్ కూడా ఇప్పుడు మనకి దూరమవుతోంది. దీంతో శరీరానికి అవసరమయ్యే కాల్షియంను శోషించే శక్తిని కోల్పోతున్నాం. చర్మవ్యాధుల దగ్గర్నుంచీ చక్కెర వ్యాధివరకూ చాలా సమస్యల్ని అదుపులో ఉంచేందుకు డి-విటమిన్ అత్యవసరం. తరచు తోటపని వల్ల కావల్సినంత డి-విటమిన్ మనకు లభించే అవకాశం ఉంది.

### చురుగ్గా ఉంటారు

తోటపనితో కేవలం శరీరం మాత్రమేకాదు, మెదడుకూడా ఉత్తేజితమవుతుంది. కాబట్టి వృద్ధాప్యంతో వచ్చే అల్జీమర్స్, మతిమరుపు సమస్యలకి తోటపని చాలా ఉపయుక్తం! తోటపని అలవాటు లేనివారితో పోలిస్తే, ఆ అలవాటు ఉన్నవారిలో మతిమరుపు సమస్య దాదాపు 47 శాతం తక్కువగా ఉన్నట్లు ఓ పరిశోధనలో తేలింది.

### ఒత్తిడి మటుమాయం

పచ్చని చెట్లు, విరబూసిన అందమైన పూల మొక్కల మధ్య తిరుగుతూ ఒత్తిడిని క్షణాల్లో మాయం చేసుకోవచ్చునంటున్నారు మానసిక నిపుణులు. చుట్టూ మొక్కలతో అంతటా పచ్చదనం ఆవరించుకుని ఉంటే ఎంతో ఆహ్లాదంగా ఉంటుంది. ఎక్కడో మనసు మూలల్లో ఉన్న కాస్త అలసట కూడా మటుమాయం అయిపోతుంది. మనసు ఆహ్లాదంగా, ఉల్లాసంగా, సంతోషంతో చిందులు వేస్తుంది.

### రోజంతా ఉత్సాహంగా

తోటపని చేయడంవల్ల అదనంగా చేరిన క్యాలరీలు ఖర్చయి, రోజంతా ఉత్సాహంగా ఉంటుంది. ఒక గంటసేపు తోటపని చేస్తే దాదాపు 300 కేలరీలు ఖర్చవుతాయట. ఇక డైట్ ప్లాన్ అంటూ కడుపు మార్చుకోనక్కరలేదు. మీకిష్టమైన పదార్థాలన్నీ తినచ్చు. కాకపోతే రోజూ పొద్దునా సాయంత్రం ఓ అరగంట తోటపని చేస్తే చాలు. తోటపని వల్ల కొలెస్టరాల్ తగ్గుతుంది. బీపీ కంట్రోల్‌లో ఉంటుంది. హృదయస్పందన వేగం పెరిగి, శరీరం ఉత్తేజితమవుతుంది.

తోటపనివల్ల ఇంటి నాలుగ్గోడల మధ్య కూర్చోకుండా, చక్కగా ఆరుబయట గడిపే వీలు చిక్కుతుంది. దాంతో మొనాటనీ ఫీలింగ్, ఒంటరితనం దరిచేరవు. స్వచ్ఛమైన గాలి, వెలుతురు ఆస్వాదించవచ్చు. దీనివల్ల ఆందోళన, ఒత్తిడి, నిద్రలేమి వంటి సమస్యలు దరిచేరవు.

### సృజనాత్మకత

రోజూ లాన్‌లో కొద్దిసేపు గడిపితే చాలు సరికొత్త సృజనాత్మక ఆలోచనలు అంకురిస్తాయి. తద్వారా జీవితంలో పైకి రావడానికి ఆ ఆలోచనలు తోడ్పడవచ్చు. మీరే కాదు మీ పిల్లలను కూడా తోటపనిలో ఇన్వాల్వ్ చేయడంవల్ల వారిలో సృజనాత్మకత, ఆలోచనాశక్తి పెరుగుతాయి. వృద్ధులు తోటపని చేయడంవల్ల బోర్ ఫీలయ్యే ఛాన్సే ఉండదు. ఆరోగ్యంగా కూడా ఉంటారు. మనసు ఏకాగ్రతతో ఉండి, మతిమరుపు జాడ కనిపించదు. తమను ఎవరూ పట్టించుకోవట్లేదనే భావన, ఇతర కాంప్లెక్సులు లాంటివి వృద్ధుల్లో లేకుండా సానుకూల ధోరణి ఏర్పడుతుంది. మనసు, శరీరం ఆహ్లాదంగా ఆనందంగా ఉంటే ఆటోమేటిగ్గా ఆయుఃప్రమాణం పెరిగి తీరుతుంది.





### మూడ్‌ని మార్చేస్తుంది

మూడ్ సరిగ్గా లేదని ఒంటరిగా కూర్చుంటే లాభం లేదు. తోటపని చేసి చూడండి, మీ మూడ్ మారటానికి తోటపని చక్కగా ఉపకరిస్తుంది. మట్టి వేయడం, నీళ్ళు పోయడం, కాసిని పువ్వుల్ని, కాయల్ని చూడటం మనసుకు ఎంతో ఉత్తేజాన్నిస్తుంది. తద్వారా మీ మూడ్ మారి మనసు ఆనందలోకాలలో విహరిస్తుంది.

ఎప్పుడూ మూడ్‌కి సంబంధించిన సమస్యలు ఎదుర్కొనేవారు తోటపని చేస్తే బాగుంటుందంటున్నారు నిపుణులు. అంటే మట్టి తవ్వడం, మొక్కనాటడం, నీళ్ళు పోయడం.. ఇలా వారంలో కుదిరినప్పుడల్లా చేయడం వల్ల మనసు ఆనందంగా ఉంటుందని నార్వే శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ప్రకృతిమధ్య ఎక్కువ సమయం గడిపేవారిలో ఒత్తిడి తగ్గడమే కాదు, మానసిక ఆనందం కూడా సొంతం అవుతుందనీ, అదే సమయంలో మట్టిలో ఉండే కొన్నిరకాల క్రిములు ఉత్సాహం నింపే సెరటోనిన్ రసాయనం విడుదల చేస్తాయనీ బ్రిస్టల్ విశ్వవిద్యాలయ నిపుణులు చెబుతున్నారు.

—ప్రణవ్ తేజ్

## మాది సిస్టమాటిక్ గార్డెన్

నూటికి నూరు శాతం ఫలితాన్నందించే సిస్టమాటిక్ గార్డెన్ మాది అంటూ రూఫ్‌గార్డెన్ గురించి ప్రచారం చేస్తున్నారు తుమ్మేటి రఘోత్తమరెడ్డి. హైదరాబాద్, ఘట్‌కేసర్ మండలం, నారపల్లెలో స్థిరపడిన ఆయన, ఇంటి నిర్మాణ సమయంలోనే బిల్డింగ్ ఇంజనీర్‌ను సంప్రదించి, 163 గజాల తన ఇంటి మేడమీద గార్డెన్ ఏర్పాటుకు ముందస్తు ప్రణాళిక వేశారు. అందుకనుగుణంగానే ఇంటిని నిర్మించుకున్నారు. ఈ రూఫ్ గార్డెన్ వల్ల ప్రయోజనాలేమిటి? అని అడిగిందే తడవుగా మనకు తెలియని ఎన్నో విశేషాలు తెలియజేశారు. ఇల్లు చల్లగా ఉంటుందని, కరంటుబిల్లు ఆదా చేసుకోవచ్చని, ఫ్యాన్లు, ఏసీలు, కూలర్ల వాడకం అస్సలు ఉండదని, మిద్దె తోటవల్ల మానసికంగా ఎంతో ప్రశాంతత లభిస్తుందని, మంచి వ్యాయామం కూడా అవుతుందని తెలియజేశారు. తోటపని అంటే సృజనాత్మకతతో సంబంధం పెట్టుకోవటంతోపాటు ప్రొడక్టివిటీ ప్రాసెస్‌లో మనల్ని మనం ఇన్‌వాల్వ్ చేసుకోవటమేనని విశ్లేషించారు. రసాయనిక ఎరువుల ప్రసక్తి లేకుండా, స్వయంగా ఈ తోట నిర్మించుకున్నారాయన. బాగా ఖర్చవుతుందేమో అన్న ప్రశ్నకు మొదటిసారి రూఫ్‌గార్డెన్ ఏర్పాటుచేసేటప్పుడు తప్ప, ఆ తరువాత మెయిన్‌టెనెన్స్ ఖర్చులేవీ ఉండవని చెప్పారు.

"ఒక అంచనా ప్రకారం, హైదరాబాద్ నగరంలో అంతా కలిపి 40 వేల ఎకరాల రూఫ్ ఉంది. ఇంత పెద్ద విస్తీర్ణంలో పచ్చదనం పరుచుకుంటే, ఈనాడు నగరం ఎదుర్కొంటున్న చాలా సమస్యలకు పరిష్కారం దొరికినట్టే! ఎక్కువగా బయటి నుంచే కూరగాయలు, పండ్లు రవాణా అవుతాయి. అందువల్ల తలెత్తే పర్యావరణ సమస్యలు, ట్రాఫిక్ సమస్యలు, కల్తీ సమస్యలు వంటివాటిని దూరం చేయవచ్చు. నగరాల్లో సొంత ఇల్లు ఉన్నవాళ్ళు, అపార్ట్‌మెంట్లలోని వాళ్ళు సమన్వయంతో రూఫ్ గార్డెన్ ఏర్పాటు చేసుకుంటే, ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయి" అని రఘోత్తమరెడ్డి రూఫ్‌గార్డెన్ గురించి వివరించారు.

అంతేకాదు ఈ రూఫ్‌గార్డెనింగ్ మీద 'ఇంటి పంట' అనే పుస్తకం కూడా రాశారు. వంద వరకు కొటేషన్లు, ఫేస్‌బుక్ ద్వారా, రూఫ్‌గార్డెన్–చీడ పీడలు అనే వాట్సాప్ గ్రూప్ ద్వారా ప్రచారం చేస్తున్నారు. యూట్యూబ్ ఛానల్లో తుమ్మేటి రఘోత్తమరెడ్డి పేరిట వెతికితే ఈ రూఫ్‌గార్డెన్ నిర్మాణం, నిర్వహణ గురించి 30 వరకు వీడియోలు ఉన్నాయి. ముఖ్యంగా ఇంతకుముందే రూఫ్‌గార్డెన్ ఏర్పాటు చేసుకున్నవారు, కొత్తగా రూఫ్‌గార్డెన్ ఏర్పాటుపై ఆసక్తి ఉన్నవారు తమ ఫోన్‌నంబర్‌ని మెసేజ్ చేస్తే, వాళ్ళని వాట్సప్ గ్రూప్‌లో యాడ్ చేసుకుని, వారికి అవసరమైన సూచనలు, సలహాలతోపాటు తెగుళ్ళు, చీడపీడలకు సంబంధించిన సమస్యలకు నివారణా చర్యలు కూడా సూచిస్తారు. వారి వాట్సప్ కమ్ ఫోన్ నంబర్– 9000184107.



తుమ్మేటి రఘోత్తమరెడ్డి

# నిర్గుణుడు

యండమూరి సత్యకమలేంద్రనాథ్

**"ఇప్పటివరకు నేను ఉన్నాను కాబట్టి, నీకు ఏ సమయానికి ఏం కావాలో నువ్వు అడక్కుండానే అన్నీ చేసి పెడుతున్నాను. నేను పోయిన తర్వాత రేపటి నీ పరిస్థితి తలచుకుంటూ ఉంటే.." నోట మాట రాక ఉబికి వస్తున్న దుఃఖంతో గొంతు పొలమారినట్లయింది అన్నపూర్ణకి.**

మంచం పక్కనే కుర్చీలో కూర్చుని ఉన్నాడు బాలు. సుమారు ఇరవై సంవత్సరాలు ఉంటాయి. అతని మొహం భావరహితంగా ఉంది. జరుగుతున్నదేదీ తనకు సంబంధం లేనట్లున్నాడు. మరణం, దుఃఖం, ఆనందం ఏవీ తెలియనట్లున్నాడు.

అన్నపూర్ణ బాలు చేతిని తన చేతిలోకి తీసుకుని "నన్ను క్షమించరా! మా స్వార్థం కోసం చేసిన పని, నిన్ను జీవమున్న శవంలా చేసింది. దానికి భగవంతుడు పై లోకంలో ఏ శిక్ష విధిస్తాడో" కారే కన్నీటిని ఎడమ చెయ్యి ఎత్తి అతికష్టం మీద కొంగుతో తుడుచుకుంది.

తల్లి మాట్లాడే మాటలతో తనకేసంబంధం లేనట్లు బాలు వెర్రిచూపులతో ఆమెనే చూస్తున్నాడు. మనిషి అందంగా ఉంటాడు. వయసు సుమారు ఇరవై సంవత్సరాలుంటాయి కానీ మెదడు ఎదగలేదు. అయిదు సంవత్సరాల బాలుడికి ఉండవలసిన తెలివితేటలు కూడా అనుమానాస్పదమే.

ఆ గదిలో ఆ ఇద్దరే ఉన్నారు. ఆ ఇల్లంతా ఇద్దరే ఉంటారు. అంతుబట్టని జబ్బుతో చిక్కిశల్యమై మంచానికే పరిమితమైపోయింది అన్నపూర్ణ. ఇద్దరి ఆలనా పాలనా చూడటానికి అన్నపూర్ణ తమ్ముడు రాజశేఖర్ ఓ మనిషిని ఏర్పాటుచేశాడు. రాజశేఖర్ కూడా ఆ ఊళ్ళోనే ఉంటాడు. అతనొక వ్యాపారస్థుడు.

గుమ్మం దగ్గర అలికిడి అయింది. అన్నపూర్ణ తలతిప్పి చూసింది. గుమ్మంలో రాజశేఖర్.

"ఎలా ఉందక్కా ఈ రోజు? నెమ్మదిమీద కోలుకోవచ్చు అన్నారుగా డాక్టరుగారు"

"ఒరేయ్ రాజా! ఏ డాక్టరైనా అలానే చెపుతార్రా! నువ్వు చచ్చిపోతావని ఏ డాక్టరూ చెప్పరు. బ్రతుకు మీద ఆశ చూపిస్తారు. కానీ రోజురోజుకీ మనిషిలో పెరిగే శారీరకబాధ ఏం జరగబోతుందో ఆ మనిషికి తెలియజేస్తుంది. మనం కూడా ఆశ చావకో, మొహమాటానికో "బాగుంది డాక్టర్!" అంటాం. రోజురోజుకీ క్షీణిస్తున్నశక్తి జరగబోయేదానికి హెచ్చరికలా ఉంది. నా ఆలోచనలన్నీ బాలు చుట్టూనే తిరుగుతున్నాయి. రేపు వీడి జీవితం గురించే నా బెంగ" అంది.

"చూడక్కా! బావకూడా ఇలానే మాట్లాడేవాడు. తను పోయినతర్వాత నువ్వూ, బాలూ కలిసి ఇంత కాలం గడపలేదా? సమయానుకూలంగా కాలం ఏదో ఒక పరిష్కారం చూపించకపోదు అన్నట్లు మేనల్లుళ్ళు ఇంకా రాలేదా?" అన్నాడు రాజశేఖర్.

అన్నపూర్ణకి ముగ్గురు కొడుకులు. బాలు ఆఖరివాడు.

"ఈ రోజు వస్తారేమో అని ఎదురు చూస్తున్నాను, వాళ్ళకి ఎన్ని పనులు ఉన్నాయో! మనలా ఖాళీగా ఉండరు కదా! ఉద్యోగాలు, పిల్లల చదువులు..."

"కొడుకుల్ని వెనకేసుకురావటంలో ఎవరైనా నీ తర్వాతే అక్కా ఎంతైనా తల్లివి కదా! నాకు కొంచెం పని ఉంది. బాలు విషయంలో దిగులుచెందకు. వాడి విషయం నేను చూస్తాలే. బావకికూడా మాట ఇచ్చాను" అంటూ లేచి నిలబడ్డాడు రాజశేఖర్.

"బయలుదేరారో లేదో ఒకసారి ధర్మకి ఫోన్‌చేసి కనుక్కో" అంది అన్నపూర్ణ. "సరే" అంటూ వెళ్ళిపోయాడు రాజశేఖర్.

ఈ సంభాషణతో తనకేమీ నిమిత్తంలేనట్లు నలుదిక్కులకీ చూస్తున్నాడు బాలు.

***

సాయంత్రం అయిదు గంటలు. ఇంటిముందు కారు ఆగిన శబ్దం విని, పిల్లలు వచ్చి ఉంటారు అని అన్నపూర్ణ అనుకుంటూ ఉండగా "ఎలా ఉందమ్మా!" అంటూ హడావుడిగా గదిలోకి వచ్చాడు ధర్మ. ఆ వెనుకే వచ్చాడు చిన్న కొడుకు భరత్.

లోపలికివచ్చిన ఇద్దరినీ చూసి పరిచయమున్నట్లుగా నవ్వాడు బాలు. "ఏవిటోరా! ఊరు పొమ్మంటోంది. కాడి రమ్మంటోంది అన్నట్టుంది నా పరిస్థితి" అంది అన్నపూర్ణ.

"ఫర్లేదమ్మా! త్వరగానే నయమైపోతుంది. లేచి ఎప్పటిలా తిరుగుతావు. బెంగపడకు" అన్నాడు ధర్మ.

"ఏం లేచి తిరగడమో! గుక్కెడు మంచినీళ్ళు కూడా తృప్తిగా తాగడం కష్టమైపోతోంది. త్వరగా నిష్క్రమిస్తేనే బాగుంటుందనిపిస్తోంది".

"నాతో వచ్చెయ్, అక్కడ డాక్టర్లకి చూపిస్తాను" అన్నాడు ధర్మ.

"అది సరేకానీ, ఎంతోదూరం నుంచి ప్రయాణం చేసి వచ్చారు. కాస్త కాళ్ళు చేతులు కడుక్కుని ఏదైనా తినండి".

"ఇక్కడకు వచ్చి చేసుకోవడం కష్టమని దార్లో అన్నీ పూర్తి చేసుకొని వచ్చాం" అంటూ లేచాడు ధర్మ. భరత్ అన్నపూర్ణ దగ్గరకువచ్చి పక్కనే కుర్చీలో



## నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో విశేష బహుమతి రూ.5,000 పొందిన కథ

కూర్చున్నాడు. మొహం దీనంగా, దుఃఖ భరితంగా ఉంది.

"ఒరేయ్ భరత్! మరీ అంత దిగులు పడకురా. అన్నయ్య తోడుగా ఉన్నాడు. ధీమాగా ఉండు" అంటూ చెయ్యి పట్టుకుంది అన్నపూర్ణ.

భరత్ మనసులో గూడుకట్టుకున్న గుబులంతా ఉబికుబికి పైకి వచ్చింది. వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టాడు. ఏడిస్తే మనసులోబాధ తగ్గిపోతుందనే ఉద్దేశంతో మౌనంగా ఉండిపోయింది అన్నపూర్ణ. భరత్ తేరుకున్న తర్వాత "మీరిద్దరేనా అందరూ వచ్చారా" అని అడిగింది.

"ఇద్దరు కోడళ్ళూ, పిల్లలు కూడా వచ్చారు" అన్నాడు భరత్.

"సరే వెళ్ళి మొహం కడుక్కో" అంది. భరత్ లేచి వెళ్ళాడు.

"లక్ష్మీ!" పిలిచింది అన్నపూర్ణ. రెండు సంవత్సరాలుగా ఆ ఇంట్లో పని చేస్తోంది లక్ష్మి. యాభై సంవత్సరాలు ఉంటాయి. ఉదయాన వచ్చి సాయంత్రం వెళ్ళిపోతుంది. విధవరాలు. కొడుకు కోడలు దగ్గర ఉంటోంది. అన్నపూర్ణ ఆరోగ్యం బాగోక పోయినప్పటినుంచి ఆ ఇంట్లోనే ఉండి పోయింది. అప్పుడప్పుడు కొడుకు దగ్గరకు వెళ్ళి వస్తూ ఉంటుంది.

లక్ష్మి రాగానే "లక్ష్మీ! సాయంత్రానికి పిల్లలకి భోజన ఏర్పాట్లు చెయ్యి" అని బాలుని చూపిస్తూ "వీణ్ణి తీసుకువెళ్ళి ఏదైనా తింటాడేమో పెట్టు" అంది అన్నపూర్ణ. సరేనంటూ వెళ్ళిపోయింది లక్ష్మి.

"అత్తయ్యా ఎలా ఉన్నారు" అంటూ పిల్లల్ని తీసుకుని తోడి కోడళ్ళిద్దరూ లోపలికి వచ్చారు.

"ఏదో కాలం వెళ్ళబుచ్చుతున్నాను. మీ ఆరోగ్యాలు ఎలా ఉన్నాయి" అంటూ మనవల్ని మనవరాళ్ళని దగ్గరకు తీసుకుంది అన్నపూర్ణ.

"బాలులో ఏదైనా మార్పు వస్తోందా అత్తయ్యా" అడిగింది చిన్నకోడలు.

"ఏదో వాడికి కావల్సింది అడుగుతాడు. అయినా స్పష్టంగా చెప్పలేడు. ఏవో చిన్న చిన్న మాటలు... ఆకలి, అన్నం, నొప్పి లాంటివి అంతే. అదృష్టం ఏవిటంటే స్వయంగానే కాలకృత్యాలు తీర్చుకుంటాడు. నా తర్వాత వాడి పరిస్థితి ఏవిటా అని వాడి గురించే నా బెంగ" అంది అన్నపూర్ణ.



కోడళ్ళిద్దరూ మౌనంగా విన్నారు. కొంత సమయం గడిపి పిల్లల్ని తీసుకుని వెళ్ళిపోయారు. మధ్యలో బాలు ప్రస్తావన మళ్ళీ రాకుండా జాగ్రత్త పడ్డారు.

అరగంట తర్వాత ధర్మ వచ్చి "నేనూ, తమ్ముడూ అలా ఊళ్ళోకి వెళ్ళి వస్తాం అమ్మా" అన్నాడు.

"సరే నాయనా! వీలైతే మావయ్యా వాళ్ళింటికి వెళ్ళి రండి" అంది అన్నపూర్ణ.

తలూపి వెళ్ళిపోయాడు.

బాలు చెయ్యి పట్టుకుని నీరసంతో కళ్ళు మూసుకుంది అన్నపూర్ణ. మాగన్నుగా నిద్ర పట్టింది. నిద్రలో ఉండగా లీలగా మాటలు వినపడ్డాయి.

"అత్తగారు బాలు గురించి ప్రస్తావన తీసుకురావడంలో నీ ఉద్దేశం ఏమిటి?" అంది పెద్ద కోడలు.

'నాకూ అర్థం కావడం...' అంది చిన్నకోడలు.

"పిచ్చిమొహమా! తను పోయిన తర్వాత బాలుని మీ ఇంట్లోగానీ, మా ఇంట్లోగానీ ఉంచుకోమని".

"అమ్మో! అలాంటి వాణ్ణి భరించటమే. ఇప్పుడు ఉన్న పనులే చేసుకోలేకపోతున్నాం. మతిమరుపు, మందబుద్ధిగలవాడితో ఎలా వేగగలం? కన్నతల్లి కాబట్టి ఆవిడకు తప్పదు. మనకేం పట్టింది" అంది చిన్నకోడలు.

"అయినా ఇద్దరు మగపిల్లలు ఎదిగిన తర్వాత, పదిహేనుసంవత్సరాల తేడాతో అంత లేటు వయసులో మళ్ళీ కాన్పు కావల్సివచ్చిందా? ఆడపిల్లకోసం తాపత్రయం కాబోలు, సిగ్గు ఉండాలి కదా!" అంది పెద్దకోడలు.

***

ఉదయం పదకొండు గంటలు అవుతోంది. తల్లి పడుకున్న గదిలోకి వచ్చాడు ధర్మ.

"ఏమ్మా! ఫలహారం తినలేదట. తినకపోతే నీరసం రాదా"

"ఏవీ తినాలనిపించలేదురా"

"పోనీ పాలు తాగుతావా?"

"వద్దురా! ఒకసారి భరత్‌ని పిలు. బాలు ఏమన్నా తిన్నాడో లేదో కనుక్కో. తినకపోతే లక్ష్మికి చెప్పు, వాడి సంగతి చూసుకుంటుంది" అంది.

ధర్మ వెళ్ళి భరత్‌ని తీసుకొచ్చాడు. వాళ్ళతోబాటు బాలు కూడా వచ్చాడు. "తలుపు మూసిరండి" మీతో మాట్లాడాలి అంది అన్నపూర్ణ. ఆ తలుపు దగ్గరగా వేసి వచ్చి తల్లి కాళ్ల దగ్గర కూర్చున్నాడు ధర్మ.

తల వైపు భరత్, పక్కనే కుర్చీలో బాలు కూర్చున్నారు.

"ధర్మా, భరత్ ఇప్పుడు నేను చెప్పబోయే విషయం మీ ఇద్దరి మధ్యలోనే ఉంచుకుంటామని మాట ఇవ్వగలరా?" అంది.

"అదేంటమ్మా, అలా అంటావ్, ఎవరికీ తెలియకుండా ఉండేంత రహస్యాలు ఏమున్నాయి? అయినా నువ్వు అడిగిన తర్వాత ఏ రోజైనా నీ మాటకు ఎదురు చెప్పామా?" అన్నాడు భరత్.

**ఏదీ నోరు తెరచి అడగలేడతను. ఏ రుచి, స్పర్శానుభవం తెలియనివాడు. మానసిక ఎదుగుదల లేనివాడు. తల్లి ఉన్నంతవరకు గడిచిపోయింది. ఇప్పుడామె అవసాన దశకు చేరింది. అందుకే అతడి అన్నలకు కబురంపింది. వీడు మన ఇలవేల్పు, వీడు లేకపోతే మీరు లేరు, తర్వాత మీ ఇష్టం అంటూ ఓ రహస్యం వెల్లడించి కన్నుమూసింది. ఇంతకీ ఆ తల్లి చెప్పిన రహస్యమేంటి? అతని అన్నయ్యలు ఏం చేశారు?**

"ఆ విషయం వేరు. ఇప్పుడు చెప్పబోయేది వేరు" అంటూ చెప్పడం మొదలుపెట్టింది.

"ధర్మా.. అప్పుడు నీకు పదిహేడు సంవత్సరాలు. భరత్‌కి పదహారు సంవత్సరాలు. నువ్వు ఇంటర్ రెండవసంవత్సరం, భరత్ మొదటిసంవత్సరం చదువుతున్నారు. నాన్న మీ ఇద్దరి చదువులు చూసి ఎంతో ముచ్చటపడేవారు. ఎలాగైనా పై చదువులు చదివించి వృద్ధిలోకి తీసుకు రావాలనేవారు. ఆయన పగలే కాదు. రాత్రుళ్ళు కూడా పని చేసేవారు. అయినా మీ ఇద్దరికి కనీసం మంచి బట్టలు కూడా ఉండేవి కాదు. మీరిద్దరూ సర్దుకుపోయేవారే కానీ, ఏనాడూ మమ్మల్ని నొప్పించలేదు. ఇతరులతో పోల్చుకుని అది కావాలి, ఇది కావాలి అని పీడించలేదు" అంటూ ఓ క్షణం ఆగింది.

నీ ఇంటర్ పరీక్షల ముందు అర్జంటుగా డబ్బు కావాలని అడిగావు గుర్తుందా! ఆ రోజు రాత్రి నేనూ, నాన్నగారూ అంత డబ్బు ఎలా సర్దాలా అని తర్జనభర్జన పడ్డాం. ఏదైనా తాకట్టు పెట్టడానికి కూడా వంటసామాన్లు, ఒంటిమీద బట్టలుతప్ప మరేమీ లేని పరిస్థితి. మీ ఉన్నతిని చూసి గర్వపడాలని నాన్నగారి కోరిక. ఒకవైపు నిస్సహాయత, మరోవైపు మీ భవిష్యత్తు. ఆ రాత్రంతా కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూనే ఉన్నారు. నాకు నోటమాట రాక ఆయన్ని చూస్తూనే ఉన్నాను. నేనుమాత్రం చేయగలిగేది ఏముంది. "ఏం చేద్దాం అన్నపూర్ణా! మనకు పుత్రులుగా పుట్టి వీళ్ళు పూర్వజన్మలో ఏం పాపం చేసుకున్నారో" అన్నారు. "దిక్కులేని వారికి భగవంతుడే దిక్కు." అన్నాను.

రెండు రోజుల తర్వాత మడతపెట్టిన న్యూస్ పేపర్ చేతికిచ్చి ఈ వాక్యాలు చదువు అన్నారు. "మా దంపతులిద్దరికీ అనుసంధానం చేసిన పిండాన్ని గర్భంలో ధరించి, మోసి కని తిరిగి అప్పజెప్పిన పక్షంలో, మీ సహాయానికి కృతజ్ఞతగా తగిన పారితోషికం యిస్తాం" ఫ్రెంచ్ దంపతుల ప్రకటన అది.

చదివి ఆయన కళ్ళలోకి చూశాను. నా మొహంలోకి చూడలేక తలదించుకున్నారు. "పోనీ యిలా చేద్దామా" అడిగాను.

"ఈ వయస్సులో నీ మీద భారంమోపి తప్పు చేస్తున్నాను అన్నపూర్ణా. క్షమించు" అన్నారు.

"పిల్లల కోసం ఆ మాత్రం చెయ్యలేమా?"

"కానీ ఈ సమాజం..."

"సమాజానికేం తెలుస్తుంది. మనం బిడ్డని కంటాం, వాళ్ళకి దత్తత యిస్తాం అంతేకదా".

డాక్టర్లు చెయ్యవలసిన పరీక్షలు చేసి, కృత్రిమ గర్భధారణ చేశారు. అప్పుడు ఆ భార్యభర్తలు ఖర్చుల కోసం పది లక్షలు ఇచ్చారు. పదిలక్షలు బ్యాంక్‌లో వేసేసరికి మీ చదువుల సమస్య తీరిపోతుందని గుండెమీద భారం తగ్గింది.

ఎప్పుడెప్పుడు కాన్పు అయిపోతుందా... బిడ్డని వాళ్ళకిచ్చేద్దామా అని ఎదురుచూశాం.

నొప్పులు రాగానే ఫ్రెంచ్ దంపతులు చెప్పిన హాస్పిటల్‌లోనే జాయిన్ అయ్యాను. పురుడు సులువుగానే వచ్చింది. కానీ రక్తస్రావం ఎక్కువగా జరిగి స్పృహపోయింది. వయసు పెద్దది కావడం మూలానా అలా జరిగింది అన్నారు డాక్టర్లు. రక్తం కూడా ఎక్కించారు. నాన్నగారు చాలా కంగారు పడ్డారు. ఈ పని చేసి తప్పుచేశామా" అని ఏడ్చారు.

"మనంమాత్రం కలగన్నామా! పిల్లల భవిష్యత్తు కంటే ముఖ్యమైనది ఏముంది" అని సముదాయించాను. బిడ్డని డాక్టర్ల పర్యవేక్షణలో వేరేగదిలో ఉంచారు. అప్పటికే ఫ్రెంచ్ దంపతులు హాస్పిటల్‌లో ఉన్నారు. డాక్టరుగారు రెండురోజుల తర్వాత డిశ్చార్జ్ చేస్తామని చెప్పారు. ఆ రోజు డిశ్చార్జ్ అయిపోవటానికి సిద్ధంగా ఉన్నాను. హాస్పిటల్ డాక్టరుగారు గదిలోకి వచ్చారు, వెనకే నర్సు పొత్తిళ్ళలో బిడ్డని తీసుకొచ్చి నా ఒళ్ళో పడుకోబెట్టింది.

బిడ్డని తీసుకెళ్ళిపోయేముందు ఫ్రెంచ్ దంపతులు తల్లి కాని తల్లిగా నాకు గౌరవం ఇస్తూ ఆఖరి సారి నాకు చూపించి తీసుకెళ్ళిపోతారేమో అనుకున్నాను. వాళ్ళ విశాల హృదయానికి మనస్సులోనే జోహార్లు అర్పించాను. బిడ్డ కొంచెం బరువు తక్కువగా ఉన్నాడుగానీ ఎర్రగా ఉన్నాడు.

"అమ్మా! మీరేమీ అనుకోనంటే ఒకమాట. ఇది



విని మరోలా భావించకండి. ఈ బిడ్డ పుట్టగానే శ్వాస పీల్చలేకపోయాడు. మేం ఎంతో శ్రమించాం. ఆక్సిజన్ అందించటానికి ప్రయత్నం చేశాం కానీ వెంటనే ప్రతిస్పందన రాలేదు. చివరకు ఎలాగైతేనే బిడ్డకు ప్రాణం పోయగలిగాం. పుట్టిన వెంటనే ఆక్సిజన్ అందకపోవటం వలన మెదడులో ఏ మార్పులు వచ్చాయో స్పష్టంగా చెప్పలేం. భవిష్యత్తులో తెలివితేటలు ఎలా ఉంటాయనేది అనుమానం. ఇదే విషయం ఫ్రెంచ్ దంపతులకీ వివరించాం. వారినుంచి ప్రతిస్పందనేమీ లేదు. వెళ్ళిపోతూ బాబును పెంచటానికి అయ్యే ఖర్చు జమకట్టి మరో పదిలక్షలు మీకు ఇమ్మని ఇచ్చి వెళ్ళిపోయారు" అంటూ డబ్బు మీ నాన్నగారి చేతిలోపెట్టి "మీరిక వెళ్ళొచ్చు" అన్నారు.

అది వినేసరికి మేం నిశ్చేష్టులమయ్యాం. నోట మాట రాలేదు. ఏం చెయ్యాలో పాలుపోలేదు. ఆ బిడ్డని అక్కడ వదిలెయ్యడమా? ఇంటికి తీసుకురావడమా? ఒకవైపు మా స్వార్థం, మరోవైపు ఫ్రెంచ్ వాళ్ళ స్వార్థం. కానీ నిస్వార్థమైనది వాడిపుట్టుక. వాడు మమ్మల్నిగానీ ఫ్రెంచ్ వాళ్ళనికానీ తనని భూమిమీదకు తీసుకురమ్మని అడగలేదే! నేనూ, నాన్నగారు వాణ్ణి అనాథగా వదలలేక, కన్నతల్లిగా అనురాగం చంపుకోలేక భగవంతుడిమీద భారం వేసి ఇంటికి తీసుకొచ్చాం" అంటూ బాలు కళ్ళల్లోకి చూసింది అన్నపూర్ణ. తల్లి కళ్ళల్లోకి అమాయకంగా చూస్తున్నాడు బాలు.

ఏడుపు ఆపుకొని బాలుచేతిని తనచేతిలోకి తీసుకొని గట్టిగా పట్టుకొని తిరిగి చెప్పడం మొదలు పెట్టింది. "వాడికి పాకడం, నిలబడటం, అన్నీ చాలా ఆలస్యంగా వచ్చాయి. పదేళ్ళ వయస్సులో 'అమ్మా' అన్నప్పుడు నా మనసు పులకించిపోయింది. కనీసం మరో అయిదు సంవత్సరాలకైనా మామూలుమనిషి అవుతాడనే ఆశ చిగురించింది. కానీ చివరకు ఈరోజుక్కూడా పదిపదాలు తప్పించి రావు. సుఖం అంటే తెలియదు. అనుభవం అంటే తెలియదు. తింటాడే కానీ రుచిగురించి చెప్పలేడు. నొప్పితో 'అమ్మా' అంటాడేగానీ ఎలా ఎదుర్కోవాలో తెలియదు. అంత అమాయకుడురా వాడు. వాడే మనింటికి రాకపోతే, మీ చదువులు, ఈనాటి మీస్థాయి, ఈ ఇల్లు ఏవీ ఉండేవి కాదురా! మనం అధోగతిలో ఉండేవాళ్ళం.

మన కుటుంబానికి ఇదంతా వాడుపెట్టిన భిక్షే. ఆనాడు దేవకి పంట కృష్ణుడైతే, ఈనాడు నా పంట బాలు. ఒకవిధంగా చెప్పాలంటే ఈ ఇంటి ఇలవేల్పురా బాలు. భగవంతుడే వాడి రూపంలో వచ్చి మనకు సహాయం చేశాడా అనిపిస్తూ ఉంటుంది. రాత్రిళ్ళు ఒక్కొక్కసారి లేచి వాడెలా నిద్రపోతున్నాడో అని చూసేదాన్ని. వాడిమొహంలో కనపడే నిర్మలత్వానికి చేతులెత్తి నమస్కరించాలనిపించేది. ఫ్రెంచ్‌వాళ్ళు చేసింది, కొడుకుల భవిష్యత్తుకోసం ఆ ముసలి వయసులో కడుపు అద్దెకిచ్చి నేను చేసింది కూడా వ్యాపారమే. ఎవరిలాభం వాళ్ళు పొందాలనుకున్నాం. వ్యాపారంలో చివరికి నష్టపోయింది వాడు.

ఇన్నిరోజులూ వాణ్ణి చూస్తూ నేను, నన్ను చూస్తూ వాడు బ్రతుకుతున్నాం. రేపు నేను శూన్యమైపోతే వాడెలా బ్రతుకుతాడో, తలచుకుంటే గుండె తరుక్కుపోతోంది. నా తర్వాత వాణ్ణి తమ్ముడిలా ఆదరించి చేరదీస్తారో, అనాథలా వదిలేస్తారో మీఇష్టం. నేను చెప్పగలిగింది ఏవీలేదు".

హృదయం ద్రవిస్తోంది ఆగకుండా. ఎక్కిళ్ళు వస్తున్నాయి. కళ్ళనుండి ఉబికి వస్తున్న కన్నీళ్ళు... ఉన్నట్టుండి ఎక్కిళ్ళు ఆగిపోయాయి. ఆ కన్నతల్లి చెయ్యి బాలుచేతిని వదిలి నిస్తేజంగా జారిపోయింది.

తల్లి కళ్ళలోకే చూస్తున్నాడు పసి 'బాలు'డు.

***

"మావయ్యా! బాలు మాకు తమ్ముడేగానీ. నా భార్యకి, మరదలికి దగ్గర కాదు కదా! వాళ్ళకి వాడి మీద అభిమానం ఉంటుందనుకోవడం భ్రమ. అమ్మ మనశ్శాంతి ముఖ్యం. అమ్మకోసం, బాలుకోసం ఏదైనా చేద్దాం. ఇంట్లో వుంచి చెయ్యమంటే ఇంటి ఇల్లాలు ఒప్పుకోవాలి. బలవంతం చేసి, విసుగు, చిరాకుతో ఇంటి వాతావరణం పాడుచేసుకోవడం కంటే ఇది మంచిదనిపిస్తోంది" ఆగి అన్నాడు.

"నేనొక నిర్ణయానికి వచ్చా. వాణ్ణి ఇక్కడే ఉండనియ్యి. ఇల్లుమొత్తం వాడి పేరుమీద రాసేద్దాం. ఈ ఇంటిని రెండుపోర్షన్లుగా విడదీసి ఒక పోర్షన్ అద్దెకిద్దాం. ఆ అద్దె వాడికోసం ఖర్చు పెడదాం. నువ్వు నలభై, యాభై సంవత్సరాల అనాథ స్త్రీని చూడు. ఈ రోజుల్లో కన్నకొడుకుల ఆదరణలేక అవస్థపడుతున్నవాళ్ళు ఎంతమంది లేరు? అలాంటివాళ్ళని ఒకళ్ళను చూడు. వాణ్ణి సొంతబిడ్డలా చూసుకోమను, వాళ్ళకి అవసరమైనవన్నీ నేను సమకూరుస్తాను. లక్ష్మికి వాడు అలవాటే కదా వీలైతే తననే అడుగుదాం. నువ్వు ఎలానూ ఈ ఊళ్ళోనే ఉంటావు, నేను కానీ తమ్ముడుకానీ ప్రతి రెండునెలలకి వచ్చి వాడి బాగోగులు చూస్తాం. నీమీద ఈ భారం మోపుతున్నందుకు క్షమించు. ఏ ఆరోగ్య సమస్య వచ్చినా నేను చూస్తాను. ప్రతినెలా ఎంత కావాలో చెప్పమను. సర్దుబాటు చేస్తాను. ఇలా సాగినంతకాలం సాగనీ, ఆ తర్వాత విషయం అప్పుడు చూద్దాం, ఏమంటావు?"

తోడికోడళ్ళిద్దరూ పక్కనే నిలబడి ధర్మ చెప్పినదంతా విన్నారు. "చిన్నాన్న గారూ! మాకు తెలియక బాలు గురించి, అత్తయ్య గురించి ఏదేదో మాట్లాడాం. అత్తయ్య ఎంత క్షోభ పడ్డారో! ఏ లోకాల్లో ఉన్నా మమ్మల్ని క్షమించమని అత్తయ్యని చేతులెత్తి ప్రార్థిస్తున్నాం. బావగారు ఎలా చెబితే అలా చేద్దాం" అంది చిన్నకోడలు.

ఆ మాటలు విని రాజశేఖరం ఉపశమనం పొందాడు. బాలు బాధ్యత పాక్షికంగా తనమీద ఉన్నప్పటికీ మేనల్లుడి మాటల్లోని ధీమా, పరిపక్వత, వాళ్ళ నిర్ణయం అబ్బురపరిచాయి. "వాడు నీకు తమ్ముడే, కానీ నాకు మేనల్లుడే కదా. నేను కావాల్సిన ఏర్పాట్లు చూస్తాను. మీరు నిశ్చింతగా ఉండండి. మీకు తెలియని విషయం మరొకటి ఉంది. అప్రస్తుతమైనా చెప్పవలసిన బాధ్యత నా మీద ఉంది. ఈ ఇల్లు బాలు పేరుమీదే రాశాడు బావ. వాడి తదనంతరమే మీకు చెందుతుందని కూడా రాశారు" అన్నాడు.

"రాసినా రాయకపోయినా ఈ ఇల్లు వాడిదే మావయ్యా! వాడి తర్వాత అనుభవించటానికి మేం ఉండకపోవచ్చు. వాడి పేరుమీద ఏ అనాథ శరణాలయానికో ధారాదత్తం చేద్దాం. ఏదైనా వాడి ఋణం మేం తీర్చుకోలేనిది" అంటూ తమ్ముడి చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు.

తడిగా రెండుచుక్కలు చేతిమీద పడేసరికి తల ఎత్తి అన్న కళ్ళల్లోకి అమాయకంగా చూశాడు బాలు. ప్రపంచంలో మరికాస్త మానవత్వం మిగిలున్నందుకు కృతజ్ఞతగా నవ్వుతున్నట్లున్నాయి ఆ కన్నీటి చుక్కలు.

***ఫోన్: 0884–2348526***



## అమాయకుడు కాదట!

**'బా**బు బాగా బిజీ'లో నటించిన మిస్తీ చక్రవర్తి ఆ సినిమాలో హీరోగా చేసిన అవసరాల మీద నమ్మశక్యం కాని కామెంట్స్ చేసింది. అవసరాల శ్రీనివాస్ పైకి అమాయకంగా కనిపిస్తాడు కానీ సెట్‌లో మాత్రం అతని ప్రవర్తన భిన్నంగా ఉంటుందనీ, సీరియస్‌గా ఉంటూనే జోకులు వేయడం అవసరాల స్పెషాల్టీ అంది. సెట్‌లో మొదటి రోజు అవసరాలను చూసి ఎంత అమాయకంగా ఉన్నాడు అనుకుందట! కానీ రోజులు గడుస్తున్న కొద్దీ అవసరాల అంటే ఏమిటో తెలిసి వచ్చిందట! సినిమా నిర్మాణంలో ఆయనకు తెలియని విషయమంటూ లేదని చెప్పుకొచ్చింది. అవసరాల నటుడే కాకుండా మంచి దర్శకుడన్న విషయాన్ని మిస్తీ చక్రవర్తి మరిచినట్టుంది అంటున్నారు సినీ జనాలు.






## ఊబకాయంతో ఉపద్రవం?

పిల్లల్లో కనిపించే ఊబకాయం కారణంగా పలు ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయన్న విషయం తెలిసిందే! వీటితో పాటు మరో ఉపద్రవం పొంచి ఉంది అంటున్నారు పరిశోధకులు. చిన్న తనంలో అధికబరువుతో ఉండే పిల్లలు పెద్దయ్యాక పెద్దపేగు కేన్సర్ బారిన పడే ప్రమాదం ఉందని ఇటీవల డెన్మార్క్ పరిశోధనలో వెల్లడైంది. సుమారు 61వేల మంది మీద అధ్యయనం నిర్వహించారు. వీరందరూ 1990 –2000 సంవత్సరం మధ్య జన్మించిన వారే. వీరు ఏడు సంవత్సరాల వయస్సులో ఎంత బరువు ఉన్నారో స్కూలు రికార్డుల ఆధారంగా సేకరించారు. అనంతరం వీరు 17 నుంచి 25 సంవత్సరాల వయస్సులో ఎంత బరువు, బిఎంఐని కలిగిఉన్నారన్న విషయం పరిశీలించారు. టీనేజీలో కూడా అధికబరువు, అధిక బిఎంఐ కలిగి ఉన్న 700 మంది పెద్దపేగు కేన్సర్‌తో బాధపడుతున్న విషయం వీరు గమనించారు. పెద్దపేగు కేన్సర్‌కు వీరి ఆహారపు అలవాట్లు, ఇతర కారణాలే కాకుండా చిన్నతనం నుంచి వీరిలో అధికబరువు సమస్య కూడా కేన్సర్ రావడానికి కారణమైంది అని వీరు అంచనా వేశారు. కేవలం అధికబరువు కారణంగానే వీరందరూ కేన్సర్ బారిన పడ్డారా? లేక మరేదైనా కారణం ఉందా? అనే విషయం ఇంకా అధ్యయనం చేస్తున్నారు.

## పిల్లల్లో గురక ప్రమాదమే!

చిన్న పిల్లలు నిద్రలో గురక పెడుతుంటారు. వారి గాఢ నిద్రకు సంకేతంగా ఆ గురకను తల్లిదండ్రులు భావిస్తుంటారు. ఈ భావన తప్పు అంటున్నారు పరిశోధకులు. చిన్నపిల్లలు నిద్రలో గురకపెడుతుంటే అది అనారోగ్యానికి సంకేతంగా గుర్తించాలని చెబుతున్నారు. ఆరు నెలల వయస్సు ఉన్న వెయ్యి మంది పిల్లల నిద్రను సుమారు ఆరు సంవత్సరాల పాటు పరిశీలించారు. చిన్నతనంలో నిద్రలో గురకపెట్టే పిల్లలు పెద్దగా అయిన తరువాత వారిలో ఒత్తిడి, ఆందోళనతో పాటు జ్ఞాపకశక్తి తగ్గడమే కాకుండా వారిలో ఆలోచనా శక్తి సన్నగిల్లడం కూడా వీరు గుర్తించారు. చిన్నపిల్లలు నిద్రలో గురకపెడుతుంటే తల్లిదండ్రులు ఆ విషయం తేలికగా తీసుకోకుండా, డాక్టరుకి చూపించాలని సూచిస్తున్నారు.



## నిద్రను దూరం చేసే ఒంటరితనం?

ఒంటరితనం పలురకాల రుగ్మతలకు కేరాఫ్ అడ్రస్. ఇప్పుడు దాని వలన ఇంకొక ప్రమాదం కూడా ఉంది అంటున్నారు అమెరికా అధ్యయనవేత్తలు. ఒంటరితనంతో బాధపడే వారు నిద్రాదేవికి దూరం అవుతారన్న విషయం వీరి అధ్యయనంలో తేలింది. ముఖ్యంగా ఒంటరితనంతో బాధపడే యువత నిద్రకు దూరం అవుతారని వీరు స్పష్టం చేస్తున్నారు. ఒంటరితనంతో బాధపడుతున్న సుమారు రెండువేల మంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో 72 శాతం మంది నిద్రకు దూరం అవుతున్నారన్న విషయాన్ని వీరు గుర్తించారు. వృద్ధుల్లో కన్నా యువతలోనే ఒంటరితనం ఎక్కువగా ఉన్న విషయం వీరి దృష్టికి వచ్చింది. చదువుకు తగిన ఉద్యోగం లభించకపోవడం, మంచి భాగస్వామి లేకపోవడం తదితర కారణాలు వీరి ఒంటరితనానికి కారణం అవుతున్నాయని అంటున్నారు. అయితే వీరిలో నిద్రలేమికి ఒంటరితనమే కారణమా? మరేదైనా కారణం ఉందా? అన్న విషయంలో మరిన్ని అధ్యయనాలు నిర్వహించాలని చెబుతున్నారు.



## అకాల మృత్యువును అడ్డుకునే పరుగు?

సుప్రభాత సమయంలో తీసే పరుగు వలన కలిగే ఆరోగ్య ప్రయోజనాల గురించి అందరికీ తెలిసిందే! అయితే ఈ పరుగు అకాల మృత్యువు నుంచి కాపాడుతుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. సుమారు వెయ్యి మంది వ్యాధిగ్రస్థుల మీద పరిశోధనలు చేశారు. వీరందరూ రకరకాల అనారోగ్య సమస్యలతో మృత్యువుకు దగ్గరగా ఉన్న వారే! వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారి చేత ప్రతిరోజూ ఉదయాన్నే కొద్ది సేపు పరుగు తీయించారు. రెండవ గ్రూపు వారిచేత అలాంటిదేమీ చేయించలేదు. కొన్ని రోజుల అనంతరం వీరి ఆరోగ్యం పరిశీలించారు. పరుగులు తీసిన వారి ఆరోగ్యం మెరుగుపడి అకాల మృత్యువు నుంచి తప్పించుకున్న విషయం గమనించారు. రోజులో గంటసేపు పరుగు తీస్తే ఏడుగంటల జీవితకాలం పెరగడాన్ని గుర్తించారు. మొత్తంమీద వీరి జీవితకాలం మరో మూడు సంవత్సరాలు పెరిగిందని పరిశోధకులు చెబుతున్నారు. అయితే వేగంగా పరిగెత్తినా, నెమ్మదిగా పరిగెత్తినా, ఫలితం మాత్రం ఒకటే అని వారు స్పష్టం చేస్తున్నారు. అనారోగ్యంతో ఉన్నవారు వైద్యుల సలహా మేరకు రన్నింగ్ చేస్తే 40 శాతం అకాల మృత్యువునుంచి తప్పించుకోవచ్చు అంటున్నారు.



–అవినాష్

## సరదాగా....

### అలా ఎలా?

ఆ రోజు సంజయ్, నీహారికల పెళ్ళిరోజు. ఇద్దరూ కలిసి ఆ రాత్రి మూన్‌లైట్ డిన్నర్ చేస్తున్నారు. ఎదురెదురుగా కూర్చుని, ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ, ఊసులాడుకుంటూ డిన్నర్ కానిచ్చేశారు. తినటం అయిపోగానే సంజయ్ లేచి తన ప్లేట్ తీసుకుని సింక్ దగ్గరకు వెళ్ళాడు. తను తిన్న ప్లేటుని చక్కగా కడిగి వెనక్కి తిరిగి చూశాడు. అంతే నీహారిక కోపంతో ఊగిపోతూ కనిపించింది. మెల్లగా ఆమె దగ్గరకు వచ్చి "సారీ! అలవాటులో పొరబాటు" అన్నాడు చుట్టూ చూస్తూ.

అంతే... నీహారిక ఇక కోపం పట్టలేక, సంజయ్ చేతులు పట్టుకుని, " నా పరువు తీస్తున్నావు నువ్వు. మనమున్నది ఇంట్లో కాదు హోటల్లో అన్న సంగతి మర్చిపోయి ప్రవర్తిస్తే ఎలా? అంటూ విసుక్కుంటూ వెళ్ళిపోయింది.

### ఒక ప్రశ్న?

ఒక ఇంజనీర్, ఒక గణిత ప్రొఫెసర్, ఒక భౌతిక శాస్త్రవేత్త ముగ్గురూ ఒకే రైల్లో ఒకే కంపార్ట్‌మెంట్లో ప్రయాణిస్తున్నారు. ముగ్గురివీ వరుస సీట్లు. వారితోపాటు ఓ కాలేజీ కుర్రాడు కూడా ప్రయాణిస్తున్నాడు. పెద్దమనుషులు ముగ్గురూ తమ తమ ల్యాపుల్లో తలలు దూర్చి ఎవరి పని వారు చేసుకుంటున్నారు. కాలేజీ కుర్రాడికి మాట్లాడేవారు లేక విసుగొచ్చింది. నెమ్మదిగా ఆ ముగ్గురి వంకా చూసి ఏదో ఒకటి చేసి వీళ్ళని మాటల్లోకి దించాలి అనుకున్నాడు. మెల్లిగా వారితో మాటలు కలిపి, పరిచయం చేసుకున్నాడు. వారెవరో తెలుసుకున్నాక వారిని సరదాగా ఆట పట్టించాలనిపించింది. కుర్రచేష్టలు కదా! వారినిలా అడిగాడు "సార్ మీరు ముగ్గురూ ఎంతో మేధావులు కదా! నేనో పజిల్ ఇస్తాను. మీ మీ ల్యాపుల్లో డిజైనింగ్ ద్వారా సమాధానం చూపించాలి" అన్నాడు. సరేనన్నారు ముగ్గురూ. "మీరు మీ మీ కంప్యూటర్లలో తక్కువ ఫెన్స్‌ను ఉపయోగించి ఎవరు ఎంత ఎక్కువ ప్రదేశాన్ని ఆక్రమించుకోగలరో డిజైన్ చేయండి" అన్నాడు. ముగ్గురూ తమ తమ ల్యాపుల్లో డిజైన్ చేయసాగారు. ఇంజనీరు ఒక పెద్ద సర్కిల్ గీసి దాని చుట్టూ ఫెన్సింగ్ వేశాడు. ఆ సర్కిల్ లోపలంతా నాదే అన్నాడు. భౌతిక శాస్త్రవేత్త ప్రపంచ పటాన్ని డౌన్‌లోడ్ చేసి, ఓ పెద్ద గీత గీశాడు దానిమీద. ఆ గీతననుసరించి ఫెన్సింగ్ వేశాడు. ఈ ఫెన్సింగ్ అవతలిపక్కంతా నాదే అన్నాడు. ఇక గణిత ప్రొఫెసర్ తన గణిత పరిజ్ఞానంతో తక్కువ ఫెన్సింగ్‌తో ఎక్కువ ప్రదేశాన్ని ఆక్రమించి విన్నర్‌గా నిలిచాడు. అదెలా సాధ్యమైంది? ఇంతకీ అతడేం చేశాడు? మీరూ ఆలోచించి, ప్రయత్నించి చూడండి.

### సమాధానం

ఆ గణిత ప్రొఫెసర్ తన గణిత పరిజ్ఞానాన్ని ఉపయోగించి తన చుట్టూ సర్కిల్ గీసుకుని బయటకు వచ్చి, ఆ గీత వెంబడి ఫెన్సింగ్ వేశాడు. ఫెన్సింగ్ లోపల మినహా బయట ఉన్న ప్రాంతమంతా నాదే! అన్నాడు. దాంతో గెలుపు అతడిని వరించింది.

# తీన్ మార్

బాచి

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**ప్రాణాల మీద ఆశ వదిలేసుకున్నాడు బాబి. ఒక పాము కాటువేస్తే, ఏదో ఒక విధంగా తట్టుకోవచ్చు. ప్రాణాల్ని దక్కించుకోవచ్చు. కానీ అక్కడ ఉన్నవి, అతని మీదికి ఎగబాకినవి వరసపెట్టి పడగలు విసరటం జరిగితే ఆ భగవంతుడు కూడా ఏమీ చేయలేడు.**

**'వద్దు వద్దని నువ్వు ఎంత గట్టిగా హెచ్చరించినా, వినిపించుకోకుండా నీ వెనకాల పడినందుకు తగిన శాస్తి జరిగింది అన్నాయ్. నువ్వుచెప్పిన పని పూర్తిచేయకుండా, దారి మధ్యలోనే తల్లకిందులు అయిపోబోతున్నా, నన్ను క్షమించేయ్..' తనలో తను అనుకుంటూ, ఉన్నట్లుండి అలా అనుకోవటం మానేశాడు.**

మీదికి ఎగబాకి పడగలు విసరవలసిన పాముల్లో ఒక్కటికూడా ఆ పని చేయకపోవడం మొదటి కారణం అయితే, అలుపు ఆయాసాల మూలంగా అడుగు తీసి అడుగు వెయ్యటం కష్టం అనిపించే పరిస్థితి ఒక్కసారిగా మాయం అయిపోవటం రెండవది.

అంతకు ముందువరకు ఎంతో బాధకు గురిచేసిన మోకాళ్ళు, ఇప్పుడు చాలా బలంగా తయారైన అనుభూతి ఆవరించుకున్నది అతన్ని. అది ఒక్కటే కాదు. బరువుగా అనిపించిన అమ్మవారి శిల దూది మూట మాదిరి చాలా తేలికగా తయారై పోయినట్లుగా కూడా తెలిసి వస్తోంది.

'నువ్వు అన్నీ తెలిసిన వాడివని, నువ్వు మాట్లాడే మాటల్లో నిజమే తప్ప వేరే విషయం ఏదీ ఉండదని తెలిసి కూడా కొంచెం తప్పుగా ఆలోచించాను. నన్ను క్షమించు అన్నాయ్... నా వల్ల కాదగిన పనినే నువ్వు నాకు అప్పగిస్తావు. నాకు చేతకాని పనిని పొరపాటున కూడా అప్పచెప్పవు' వెట్టిని గురించి తనలో తను అనుకుంటూ పక్కకు చూశాడు.

వందగజాల దూరం పోయి, అక్కడ ఆగి ఉన్నాడు రవీంద్ర బావమరిది. అతన్ని ఆ పాముల బారినుంచి ఎలా కాపాడుకోవాలో ఆలోచిస్తున్నాడు తీవ్రాతి తీవ్రంగా.

'పిచ్చిపూజారిని కలుసుకోమని అన్నయ్య చెప్పాడు గదా. ఎక్కడ ఉంటాడు అతను?' బిగ్గరగా అరిచాడు బాబీ.

అతను అలా అరిచినప్పుడు తెలిసివచ్చింది రవీంద్ర బావమరిదికి అసలు విషయం. గుండెల్ని పిండేస్తున్న ఆందోళన మటుమాయం అయిపోయింది.

'గుడి దగ్గరికి నడువ్. రేకులషెడ్డు దగ్గర నిలబడు' అంటూ తను రోడ్డు దిగి, పక్కనే ఉన్న పొదలకు అడ్డం పడి పరుగు మొదలుపెట్టాడు.

గుండెలకు ఆనించుకుని పట్టుకున్న అమ్మవారి శిలను అలాగే మరింత గట్టిగా పట్టుకుని కంకర రోడ్డు మీదికి బయలుదేరాడు బాబీ.

రాజకీయనాయకులో, సినిమాస్టార్లో ఎవరో వి.ఐ.పి.లు వస్తున్నప్పుడు ఎదుట నిలబడి ఉన్న జనం రెండుగా చీలి దారి ఇస్తున్నట్టు పక్కలకు జరిగాయి పాములన్నీ.

పడగల్ని ముడవలేదు ఒక్క పాము కూడా. భూమికి జానెడెత్తున ఎత్తిపట్టుకుని వేగంగా కదిలాయి అతనితో సరిసమానంగా.

***

'ఏరా... ఏరిరా లాయర్లు? ఎక్కడ తగలడ్డారు?' అసహనం అధికమై పోతుండగా బిగ్గరగా అరిచి, మీద పడి చెంపలు పగల గొట్టినంత పనిచేశాడు బాజిరెడ్డి, తన వెనుకే నిలబడి ఉన్న అనుచరుల్లో ఒకతన్ని.

'బాజిరెడ్డిసారూ... నేను వచ్చి చాలాసేపు అయింది. అవతల నా కోసం ఇంకా చాలామంది వెయిట్ చేస్తూ ఉండి ఉంటారు' అదే సమయంలో సన్నగా హెచ్చరించాడు, ఒక కుర్చీలో కూర్చున్న పెళ్ళిళ్ళ రిజిస్ట్రార్.

రాబందు మాదిరి రివ్వున అతని దగ్గరికి పోబోయి ఆఖరి క్షణంలో తనను తాను కంట్రోల్ చేసుకున్నాడు బాజిరెడ్డి.

'కాసేపు సారూ... అయిపోవచ్చింది. ఇంకొక్క అరగంట...' అంటూ చెప్పి శివారెడ్డివైపు తిరిగాడు. నుదురు ముడిచి, పెదవులు బిగించి చాలా సీరియస్‌గా చూశాడు.

అటువంటి చూపు అంతకుముందు, ఒక వారం రోజుల క్రితం చూసి ఉంటే, చెమటలు ప్రత్యక్షం అయి ఉండేవి శివారెడ్డి నుదుటి మీద. తెలివి తప్పబోతున్న మనిషి ఎలా తెల్లగా పాలిపోతాడో అలాగే తయారైపోయేవాడు.

అటువంటి లక్షణాల్లో ఒక్కటి కూడా ఇప్పుడు కనిపించలేదు సరికదా, ఏదో కామెడీ సినిమా చూస్తున్నట్టు పకపకా నవ్వాడు.

'పెళ్ళి చూడటానికి పిలిచినా పిలవకపోయినా చాలామంది వచ్చి నిలువుకాళ్ళ మీద నిలబడి ఉన్నారు. భోజనాలు పెట్టకపోయినా, తాగటానికి మంచినీళ్ళయినా ఇవ్వటం బాగుంటుంది. ఆ పని చూడు రాజీ' అంటూ చక్కగా చెప్పాడు తన భార్యకి.

'వెళ్ళండి... అందరూ వెళ్ళి నీళ్ళు తీసుకురండి' అంటూ అప్పటికప్పుడు తమ పనివాళ్ళకి ఆర్డర్ ఇచ్చింది ఆమె.

'అమ్మా.... కూల్‌డ్రింకులు చాలా ఉన్నయ్. బాజిరెడ్డిసారు తెప్పించి, ఇసుగడ్డల్లో పెట్టించి ఉంచారు' అన్నది ఒక పనిమనిషి.

'తీసుకొచ్చేయ్... అందరికీ ఇచ్చేయ్' ఇంకో ఆజ్ఞను జారీ చేసింది ఆమె.

బాజిరెడ్డి చేసిన పనిని గురించి చెప్పటం అయితే చెప్పింది గాని, అక్కడినుంచి కదలటానికి భయపడిందా పనిమనిషి.

'ఏమిటి ఆలోచన? పో, పోయి తీసుకురా' ఖంగుమన్నది శివారెడ్డి కంఠం.

దీపావళి పండుగ సమయంలో పవర్‌ఫుల్ బాంబుపేలితే అదిరిపడినట్లు గతుక్కుమన్నారు అందరూ – శివారెడ్డి భార్యతో సహా.

పూర్తి ఆరోగ్యంతో ఉన్నప్పుడు వినిపించిన కంఠం అది. అస్వస్థతకు గురైన తర్వాత సన్నటి శబ్దం తప్ప గంభీరమైన మాట ఒక్కసారి కూడా బయటికి రాలేదు అతని నోటినుంచి.

అందరికంటే ముందుగా తేరుకున్నది రమణయ్య పంతులుగారు.

'అమ్మా.. ఏదో జరుగుతోంది. మన అబ్బయ్య ఏదో మతలబు చేసేస్తున్నాడు. మీ అబ్బాయి ముఖం చూడండి. క్షణక్షణానికి తేడా కనిపిస్తోంది' కళ్ళవెంట నీళ్ళు కారుతుండగా, గద్గదస్వరంతో అన్నాడు.

కనులు చిట్లించి చూస్తూనే ఉన్నది పిచ్చమ్మి. ఉన్నట్లుండి చేతులు జోడించి ఎవరికో నమస్కారం చేసింది.

కనుబొమలు ముడిచి క్రూరంగా చూస్తున్న బాజిరెడ్డి ఆగ్రహం అవధులు దాటిపోయింది. 'వెర్రి వెంగళప్పను చేసి నాటకాలు ఆడుతున్నారు మీరందరూ. మీ అంతు చూసి తీరతాను' అంటూ గిరుక్కున గుడి దగ్గర్నించి వచ్చిన

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. గ్రానైట్‌మైన్స్ వారినుంచి తప్పించుకుని పిచ్చమ్మి కుటుంబం లోకి అడుగుపెడతాడు. ఆ కుటుంబంలోని సమస్యలన్నిటికి చౌడేశ్వరి ఆత్మశిల స్థానభ్రంశం చెందడమే కారణమని తెలుసుకుంటాడు. అడవిలో ఆత్మశిల కనిపిస్తుందతనికి. ఇంతలో పఠాన్‌కి, ప్రణవికి తెల్లారితే పెళ్ళని అనౌన్స్ చేస్తాడు బాజిరెడ్డి. జరగబోయే పరిణామాలు ఆగాలంటే ఆత్మశిలను యథాస్థానంలో ఉంచాలని భావించి, బాబీతోపాటు అడవిలోకి బయలుదేరతాడు వెట్టి. ఆత్మశిలను బాబీకిచ్చి చౌడేశ్వరి గుడి దగ్గరికి పంపిస్తాడు. హైమారెడ్డి ఎస్టేటుకు వచ్చి పెళ్ళి జరగకుండా రకరకాల ప్రయత్నాలు చేస్తుంటాడు. గుడి దగ్గరికి వచ్చిన బాబీని పాములన్నీ చుట్టుముడతాయి.

ఆ తర్వాత...

వారివైపు తిరిగాడు.

'అందరూ వినండి. బాగా వినండి. చౌడేశ్వరి తల్లికి జరిగిన అవమానం ఏమిటో ఎందుకు జరిగిందో వివరంగా చెపుతాను. కోరిన వెంటనే కోరికలు తీర్చే ఆ దేవత గుడి పాడుబడిపోయినట్లు తయారవటానికి కారణం ఇప్పుడు మీకందరికీ తెలియాలి..' అంటూ ఆగి గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నాడు.

'అన్నయ్యా...' అంటూ హైమారెడ్డి భుజం మీద చేయి వేశాడు తమ్ముడు.

పళ్ళు బిగించి ముందుకు కదలబోయాడు సబ్బిరెడ్డి. తల అడ్డం తిప్పింది పిచ్చమ్మి.

'పిచ్చిపూజారికి పిచ్చి ఎక్కకముందు బంగారు బొమ్మలాంటి కూతురు ఉండేది. తెలుసు కదా మీ అందరికీ..' అన్నాడు బాజిరెడ్డి.

తలలు ఊపారు ధర్మకర్తలు. తెలియకపోయినా తెలిసినట్టు ముఖాలు పెట్టారు మరికొందరు.

వణకటం మొదలుపెట్టాయి శివారెడ్డి భార్య చేతులు. శివారెడ్డి కూర్చున్న కుర్చీని గట్టిగా పట్టుకుని నిలబడింది.

'వాడి నోటిని మూయించేద్దాం అన్నయ్యా..' అన్నాడు హైమారెడ్డి తమ్ముడు.

'పెళ్ళిని ఆపటం వరకే మనకు అప్పగించబడిన పని. ఆ పని సరిగ్గా కాకపోయినా కొంతవరకూ బాగానే చేశాం. ఇప్పుడు జరగబోతున్నది పెళ్ళి కాదు. ఏదో కుటుంబ వ్యవహారం. మనం కల్పించుకోకూడదు' అన్నాడు హైమారెడ్డి.

'పిచ్చిపూజారి కూతుర్ని చూసి లొట్టలు వేసే వాడు ఈ శివారెడ్డి తండ్రి. తప్పని చెప్పినా వినేవాడు కాదు. రానురానని చెప్పినా వినిపించుకోకుండా నన్ను బలవంతంగా గుడి దగ్గరికి తీసుకుపోయి..' తన మాటలు అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నట్టు అర్థమై, మరింత ఉత్సాహంగా చెప్పటం మొదలుపెట్టి... సడన్‌గా మాటల్ని ఆపేశాడు బాజిరెడ్డి.

'పాము.... అయ్యబాబోయ్ పాము.. పాము వచ్చింది సారూ..' అని అరుస్తూ సంపంగి ఆ ప్రదేశంలోకి పరిగెత్తుకుంటూ రావటం అందుకు కారణం.

గోడకు తగిలిన మట్టికుండ ముక్కలుముక్కలై చెల్లాచెదురై పోయినట్టు తలా ఒక పక్కకు జంప్ చేశారు అక్కడి వారందరూ.

'ఏదీ? ఎక్కడ?' అంటూ కదిలారు వారిలో కొందరు.

***

నూట పది, నూట ఇరవైకి మించదు బుల్లెట్ బండి స్పీడు. అంతకుమించి నడిచే సామర్థ్యం ఉన్నా నడపటం మాత్రం చాలా కష్టం. ఆ రోజు మరో పదిని యాడ్ చేశాడు వెట్టి.

అడవి దారి. పది గజాలకు ఒక పల్లం. వంద గజాలకు ఒక మెలిక. పట్టు తప్పటం జరిగితే గింగిరాలు తిరుగుతూ పోయి ఏదో ఒక బండకో, చెట్టుకో కొట్టుకోవడం, తలలు పగిలి అప్పటికప్పుడు ప్రాణాలు వదలటం తప్పనిసరి.

'ఆ దొంగనాయాళ్ళ దగ్గర బళ్ళు లేవు. పరిగెత్తుకుంటూ వచ్చినా, మనల్ని పట్టుకోలేరు. కొంచెం నెమ్మదిగా పోనీ అన్నయ్య' మొండి మనుషుల్లో మొదటి రకానికి చెందినవాడైనా, చెవి దగ్గర నోరు పెట్టి గట్టిగా బతిమాలుకున్నాడు.

'వాళ్ళు వస్తారని కాదు తమ్ముడు. మనకు అట్టే టైము లేదు. గుడి దగ్గర ఎటువంటి గోల జరుగుతోందో తలుచుకుంటేనే కంపరం ఎత్తుతోంది' తను కూడా అరిచాడు వెట్టి. అంత స్పీడులో ఉన్నప్పుడు చిన్నగా మాట్లాడితే శబ్దం గాలికి చెదిరిపోతుంది కాబట్టి.

'అమ్మ చూసుకుంటుంది అన్నయ్య. తను దగ్గర లేకపోయినా మనల్ని కాపాడింది మర్చిపోయావా?' మళ్ళీ అరిచాడు బండోడు.

నవ్వాడు వెట్టి. స్పీడుని కొంచెం తగ్గించాడు.

గుండెల మీది బరువు దిగిపోయి



నట్లు తేలికగా నిట్టూర్చబోయి, మళ్ళీ అదిరిపడ్డాడు బండోడు.

అడవిదారి అంతం అయిపోయింది. ఎదురుగా ప్రత్యక్షం అయింది గుడికి తీసుకుపోయే మెయిన్ రోడ్డు.

ఎగుడు దిగుళ్ళ డొంక మార్గంలోనే నూరు అంకెను దాటిన ఆ బండి, నున్నగా ఉన్న ఆ రోడ్డు మీద నెమ్మదిగా నడుస్తుందా?

ప్రాణాల మీద ఆశను వదిలేసుకున్నట్టు బయటికి కనిపించకుండా ఉండేందుకు కళ్ళను గట్టిగా మూసుకుని, వెట్టి నడుమును మరింత గట్టిగా చేతులతో చుట్టి పట్టుకున్నాడు అతను.

***

అడ్డం వచ్చిన ముళ్ళపొదల మీది నుంచి హైజంప్ చేసి అవతల పడ్డాడు రవీంద్ర బావమరిది. నిలువెత్తున ఉన్న పుట్టల్ని తప్పించుకున్నాడు. 'పూజారయ్యా... ఓయ్ పూజారయ్యా..' అని పిలుస్తూ గుడి వెనుక ఉన్న పాడుపడిన ఇంటి దగ్గరికి పోయాడు.

ఇంటి ముందు గాని, వెనుకభాగంలో గాని, ఇంటి లోపల గాని ఎక్కడా కనిపించలేదు పిచ్చి పూజారి.

'ఈ పిచ్చాయనతో చచ్చే చావు వచ్చిపడింది. అవసరం వచ్చినప్పుడు కనిపించడు. అవసరం లేనప్పుడు పళ్ళు ఇకిలించుకుంటూ ఎదురుగా వచ్చి పనులన్నిటినీ చెడగొడతాడు' అనుకుంటూ, తిరిగి గుడి ముందుకు బయలుదేరబోతుండగా—

పాతిక అడుగుల దూరంలో ఉన్న పుట్టల మధ్య కనిపించాడు అతనికి. ఎత్తుగా కట్టబడి ఉన్న వేదిక వంటి అరుగు దగ్గర సగం మోడుబారినట్టు కనిపిస్తున్న ఒక చెట్టు. ఆ చెట్టు కింద పెద్ద బండ రాయి. ఆ రాయిమీద కూర్చుని అరమూసిన కనులతో, పెదవుల కదలిక కనిపించీ, కనిపించకుండా ఏవేవో మంత్రాలు పఠిస్తున్నాడు.

'చాలు పూజారయ్యా... చదివిన మంత్రాలు చాలు. ముందు అక్కడినుంచి లేచి ఇవతలికి రావాలి' పుట్టల మధ్యకు పోయే ధైర్యం లేకపోవడం వల్ల బిగ్గరగా అరిచాడు దూరం నుంచే.

**ఒకపక్క పెళ్ళిళ్ళ రిజిస్ట్రార్ తొందర పెడుతున్నాడు. ఇంకోపక్క హైమారెడ్డి అడుగు కదపనివ్వటం లేదు. మరోపక్క శివారెడ్డి ముఖంలో, కంఠంలో క్షణక్షణానికి తేడా కనబడుతోంది. ఇక ఉద్రేకం ఆపుకోలేకపోయాడు బాజిరెడ్డి. అక్కడున్నవారికి జరిగినదంతా చెప్పడానికి నోరుతెరిచాడు. మరి బాజిరెడ్డి జరిగింది చెప్పాడా?**

భుజం మీద తట్టినట్టు ఉలికిపడి కనులు పూర్తిగా తెరిచాడు పూజారయ్య. నడుము మీద చేతులు వేసుకుని, ఎగసుకు వస్తున్న ఆయాసాన్ని అణచుకోవటానికన్నట్టు కొంచెంగా ముందుకు వంగి నిలబడిన యువకుడిని గుర్తు పట్టాడు.

'ఏమిట్రా నీ ఆగడం? నన్ను ప్రశాంతంగా బతకనీయరా మీరు? నా మాటల్ని వినిపించుకోని మూర్ఖులతో నేను ఎందుకు మాట్లాడాలి? వెళ్ళిపో..' గుడ్లు ఉరుముతూ అరిచాడు.

'ఓరి నాయనో.. నడుము వంగిపోయినా నీ గొంతు మాత్రం వంగలేదు. ఇవతలికి రా. నీకు ఒకటి చెప్పాలి' తాను కూడా అరిచాడు రవీంద్ర బావమరిది.

'పోరా.. పోపో... నేను రాను' సర్దుకు కూర్చుంటూ సమాధానం ఇచ్చాడు పిచ్చిపూజారి.

'అమ్మవారు గుడి దగ్గరకు వచ్చేశారని చెప్పినా కూడా రావా?' అడిగాడు యువకుడు.

గబుక్కున బండమీది నుంచి లేచి, సాధ్యమైనంత వేగంగా అతని దగ్గరికి వచ్చాడు పిచ్చిపూజారి.

'ముసలివాడిని చేసి పరాచికాలు అడితే నీ కళ్ళు పేలిపోతాయ్? అమ్మవారు గుడి దగ్గరికి రావటం...' అంటూ అదిరిపడి మాటల్ని ఆపి, అలాగే రాతి బొమ్మలా బిగుసుకుపోయాడు.

సుశిక్షితులైన సైనికుల మాదిరి రెండు వరుసల్లో పాములన్నీ అటుగా వస్తూ ఉండటమే అందుకు కారణం.

వాటి మధ్యలో అమ్మవారి శిలను పట్టుకున్న బాబీ...అతన్ని పెనవేసుకుని ఉన్న కాలనాగులు..'

జలజలా బుగ్గల మీదికి వచ్చేయడం మొదలు పెట్టిన కన్నీటిని తుడుచుకోను కూడా తుడుచుకోకుండా ఎదురు పరిగెత్తాడు.

'పిచ్చి పూజారయ్య అంటే తమరేనా స్వామీ?' అడిగాడు బాబీ అతను తన దగ్గరికి రాగానే.

మాటలు రావటం మానేశాయి పూజారయ్య నోటి వెంట. మూగగా తల ఊపాడు.

'మా అన్నయ్య ఈ రాయిని మీకు అప్పగించమని చెప్పాడు. దాన్ని మీరు తీసుకుంటే తప్ప ఈ పాములు నన్ను వదిలిపెట్టేటట్టు కనిపించడం లేదు' అన్నాడు బాబీ.

'రాయి కాదురా భడవకానా. తల్లిరా... చౌడేశ్వరి తల్లి. చెంపలు వేసుకో' అన్నాడు పూజారయ్య.

అంత టెన్షన్‌లోను నవ్వకుండా ఉండలేకపోయాడు బాబీ...

'ఆ పని నాకు చేతకాదు. మీరే వెయ్యండి రెండు దెబ్బలు..' అంటూ ముఖాన్ని ముందుకు వంచాడు.

చేతులు జాచాడు పూజారయ్య. అతని చెంపల మీద కొట్టటానికి కాదు. అతని చేతుల్లో ఉన్న అమ్మవారిని తను తీసుకోవటానికి.

భయంకరంగా బుసకొడుతూ వేగంగా పడగల్ని విసిరాయి బాబీ ఒంటిని చుట్టుకుని ఉన్న కాలనాగులన్నీ.

అదిరిపడి వెనక్కి దూకాడు పూజారయ్య.

'పడేయ్.. మీద పడేసేయ్...' తనతో సరిగ్గా మాట్లాడలేదన్న కచ్చతో కాబోలు, బిగ్గరగా హెచ్చరించాడు రవీంద్ర బావమరిది.

వినిపించుకోలేదు బాబీ...'ఏం చేయమంటారో చెప్పండి స్వామీ' అని రిక్వెస్ట్ చేశాడు పూజారయ్యని.

ఇంకోసారి తన చేతులు జాచటానికి జరిగాడు పూజారయ్య. 'ఏదో ఉంది తల్లి మనసులో. అదేమిటో తెలుసుకోవాలి' అంటూ ఆలోచించడం మొదలు పెట్టాడు.

'ఈయన వరస చూస్తుంటే ఇవాళ సాయంత్రం దాకా బొమ్మలా నిలబడి ఆలోచిస్తూ ఉంటాడని



## దిశాపటానీకి పొగరెక్కువేనట!

దిశాపటాని పేరున్న హీరోయిన్ కాదు. తెలుగులోనూ, బాలీవుడ్‌లోనూ చేసిన సినిమాలు రెండూ ఫట్ అన్నాయి. 'సాహో' దర్శక నిర్మాతలు మాత్రం దిశాపటానీని పట్టించుకుని ప్రభాస్ పక్కన నటించే ఛాన్స్ ఇచ్చారు. వచ్చిన అవకాశాన్ని కళ్ళకద్దుకుని అందుకోకుండా దిశాపటాని తన పొగరుతో పోగొట్టుకుందని సినీ జనాలు అంటున్నారు. ఈ సినిమాలో నటించడానికి దిశా ఐదు కోట్లు అడిగిందట! ఏమాత్రం పేరు లేని ఈ హీరోయిన్‌కి ఐదు కోట్లు ఇవ్వడం దండగనీ, అందులో సగమిస్తే ప్రస్తుతం టాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్లుగా పేరు తెచ్చుకున్నవారు సంతోషంగా చేస్తారని దర్శకనిర్మాతలు భావించారట! 'బాహుబలి 2'తో ప్రభాస్ పేరు ప్రపంచవ్యాప్తంగా మారు మోగిపోతోంది. అలాంటి హీరోతో చేయడం అంటే ఎగిరి గంతేయాలి కాని పొగరు చూపించడం ఏమిటని అంటున్నారు.

పిస్తోంది. గుళ్ళోకి పోయి అక్కడ దింపేస్తే బాగుంటుంది' అన్నాడు రవీంద్ర బావమరిది.

'నోరు ముయ్యరా! నోరు మూసేసుకోరా భడవ కానా! నోటికి వచ్చింది మాట్లాడడం నీకు బాగా అలవాటు అయిపోయినట్లుంది' కసురుకున్నాడు పూజారయ్య.

రవీంద్ర బావమరిది చెప్పినట్లు చేయటానికే డిసైడ్ అయిపోయాడు బాబీ. వెనుదిరిగాడు కానీ అడుగు కదిలించలేదు.

డబడబమని మైలు దూరం సునాయాసంగా వినిపించేటట్లు మోతలు చేస్తూ దూసుకు వచ్చింది బుల్లెట్ బండి.

సైనికుల మాదిరి పడగలు ఎత్తి ఉన్న పాములన్నీ తమకు పక్కనే ఉన్న పొదలలోకి, పుట్టల మీదికి పరుగులు తీసినయ్.

***

'వట్టిచేతులతో వెళ్ళి ఏం చేస్తారు? తీసుకోండి కర్రల్ని' గంగాళం మాదిరి నోరు తెరిచి అరిచాడు బాజిరెడ్డి.

తలా ఒక పక్కకు పరిగెత్తారు అతని అనుచరులు. అయితే ఆ ప్రదేశాన్ని వదిలి బయటికి గాని, పక్క గదుల్లోకి గాని పోకముందే, చివ్వున కుర్చీలో నుంచి లేచాడు శివారెడ్డి.

'పాము మాకు తల్లితో సమానం. మా ఇంట కనిపించటం మాకు శుభప్రదం. కదలద్దు ఎవరూ... కర్రల కోసం చూడొద్దు' కరుకుగా అన్నాడు.

తెల్లబోయి చూస్తూ నిలబడిన అనుచరులను గమనించి, మరింతగా ఆవేశ పడిపోయాడు బాజిరెడ్డి.

'శివారెడ్డి తండ్రి పూజారయ్య కూతుర్ని చెడగొట్టాడు. అందుకే ఆమె ఆత్మహత్య చేసుకుంది. అందుకే పూజారయ్యకి పిచ్చి పట్టింది' బిగ్గరగా అరిచాడు.

తెల్లబోయారు గుడి దగ్గర్నించి వచ్చిన జనం. ధర్మకర్తల ముఖాలు విపరీతమైన కోపంతో ఎర్రబడి పోయాయి.

'ఈ మాటను ఎప్పటినుండో నా గుండెల్లో పెట్టి దాచుకుంటూ వచ్చాను. బయట పెట్టకుండా ఉండటానికి ఒట్టు వేయించుకున్నాడు శివారెడ్డి. తన చెల్లెల్ని నాకు కోడలుగా చేస్తానని తనే వాగ్దానం చేశాడు' వారి భావాలు గమనించి మరింత ఉత్సాహంగా చెప్పాడు బాజిరెడ్డి.

'అరేయ్... ఊరి పెద్దల్ని, పోలీసుల్ని, ముఖ్యంగా చింతలపల్లి వాళ్ళని, రాయుడుపల్లి రవీంద్రని అందరినీ పిలుచుకురండి. పెద్దమనుషులని మర్యాద ఇచ్చాం. ఇంత పెద్ద తప్పును దాచిపెట్టుకున్న కుటుంబం అనుకోలేదు. వాళ్ళని ఈ ఊరి నుంచి తరిమేయవలసిందే' రౌద్రంగా అన్నాడు ఒక ధర్మకర్త.

'ఆగండి.. తొందరపడకండి. శివారెడ్డి చెప్పేది కూడా విన్న తర్వాత ఏం చేయాలో ఆలోచించుకోవచ్చు' గబుక్కున కొందరు ధర్మకర్తలకు అడ్డంగా నిలబడుతూ అన్నాడు సబ్బిరెడ్డి.

'ఏంటయ్యా వినేది? చెప్పేది ఏమైనా ఉంటే ఇప్పటికే చెప్పేసి ఉండేవాడు. ఆ తల్లికి ద్రోహం చేయటం వల్లనే అసలు ఈయనగారికి ఇన్ని రోగాలు' అంటూ అతన్ని అవతలకు నెట్టి బయటకి పరిగెత్తారు వాళ్ళు.

నలిగిపోయినట్లు తయారైన తన భుజం మీది కండువా ముడతలు సరిచేసుకుంటూ, పెద్ద నవ్వు ఒకటి నవ్వాడు బాజిరెడ్డి.

'నీ బండారం బద్దలయింది. నీ బతుకు బండలపాలయింది' అని వెక్కిరించాడు.

దగ్గరే ఉన్నాడు అతని అనుచరుడు ఒకడు. ఉన్నట్లుండి చేతిని జాచి అతన్ని, బొమ్మలా నిలబడి ఉన్న పఠాన్‌ని అవతలకు నెట్టాడు.

తూలి కింద పడిపోబోయి, దగ్గర్లో ఉన్న కుర్చీలను ఆసరాగా చేసుకుని పడిపోకుండా తమాయించుకున్నారు వారిద్దరూ.

జరజరాపాకుతూ కనిపించింది అందరికీ ఒక పెద్ద పాము. అంతమంది మనుషుల్ని చూసి కొంచెం కూడా చెదరకుండా శివారెడ్డి పక్కనుంచి, పిచ్చమ్మి కుర్చీ వెనుకనుంచి, అవతలి గదిలోకి పోయింది.

'చూడండి... అందరూ చూడండి. జరిగిన దారుణం నలుగురికీ తెలుస్తోందన్న సంతోషంతో తనే స్వయంగా వచ్చింది ఆ తల్లి. అవునా కాదా?' అంతకు ముందు తను ఆ పామునే చంపిపారేయమని తన అనుచరులకు చెప్పిన మాటను తిరగవేసి భక్తిని ప్రదర్శించాడు బాజిరెడ్డి.

తలలు ఊపుతున్న జనాన్ని చూసి, 'అన్నయ్యా... ఈ గోల ఏమిటి? అసలు ఇక్కడ జరుగుతున్నదేమిటి?' చిన్నగా అన్నను అడిగాడు హైమారెడ్డి తమ్ముడు.

'ఇది మనకి సంబంధించింది కాదు. వాళ్ళు వీళ్ళు తేల్చుకోవాల్సింది. మనం వచ్చిన పని పూర్తి అయింది. అబ్బయ్య మాటని నిలబెట్టాం. ఇక పోయి హోటల్లో కూర్చుందాం' అన్నాడు హైమారెడ్డి.

అర్థం కాలేదు తమ్ముడికి. అయోమయంగా చూశాడు.




అతను
ముక్కలు ముక్కలై పోతున్నాడు,
దుమ్మూ ధూళై పోతున్నాడు-
అతని కళ్ళముందే ఇదంతా జరిగిపోతుంది;
ఎక్కడనుంచో ఒక శబ్దం

## ఒక పాత్రని నింపాలి

పోగుచేసుకో, పోగుచేసుకో
దుమ్మునీ, ధూళినీ, ముక్కల్నీ
అన్నింటినీ, రెండు చేతుల్తో
రెండు చేతుల్నుంచీ జన్మించిన
వేలవేల చేతుల్తో పోగుచేసుకో
పోగుచేసి పరిమళం పోసి
యింతముద్ద చేయ్
పోగు చేయటం తప్ప
ఏమీ మిగల్లేదిక్కడ
తిరిగి, తిరిగి ఇక్కడికే వచ్చి
పాలు పితికినట్టు, సర్వాన్నీ పితికి
ఒక పాత్రని నింపాలి.
పోగుచేసిన మట్టి నుంచి, మట్టిముద్ద నుంచి
ఒక పాత్రను నిర్మించు
తత్తిమ్మా అన్నింటినీ నిషేధించు
నీ రెండు చేతులే ఒక పాత్రనుకో
నువ్వే ఒక పాత్రనుకో
రాగులు, కొర్రలు, వడ్లు నింపే
పగిలిపోని, పగలగొట్టలేని ఒక పాత్రనుకో
తన్ను తాను నిర్మించుకునే
తన్ను తాను బతికించుకునే
విద్య నెవడు నేర్పగలడు
రెండు కొండల మధ్య ప్రవహిస్తున్న సెలయేరు
రెండు కొమ్మలమధ్య మొలుస్తున్న మరో కొమ్మ
శివుని శిరసునుండి గంగ దూకుతుంది
జన సమూహాల కాళ్ళు కడుగుతూ
ముందుకే నడుస్తుంది.
తిరుగుతున్న దారి నుంచి
ఇంత మట్టీ, ఇంత ఇసుక
ఇంత వాసన మూటకట్టు
వంశధార, నాగావళీ కలిసిన
సంగమ స్థలంలో ప్రతిష్ఠించు



ఎర్ర నీరు, నీలి నీరూ కలగలిసి ప్రవహించే
ప్రాణాల్లో మునిగి తేలితే
కలలు వలలు గారు
కన్నీరు జాలంలో ఎవరూ ఇరుక్కోరు
ముక్కలు ముక్కలుగా ఏవీ ఉండదు
ముక్క ముక్కలో మూర్తీభవిస్తున్న
మనిషి ఇంత దుమ్ము, ఇంత ధూళి
దోసెడు జలంలో ఈదులాడుతున్న
విశ్వం ఎన్ని ముక్కల్నుంచి జన్మించింది
అతను
ముక్కలు ముక్కలవ్వటమూ చూస్తున్నాడు
ముక్కలు
మనుషులవ్వటమూ చూస్తున్నాడు
క్షతిలేని సత్యమేదో
కొండమీంచి దూకుతుంది జలపాతంలా

—కె.శివారెడ్డి
ఫోన్: 040–24064195

'అరేయ్ పిచ్చోడా... తను వచ్చేదాకా పెళ్ళి జరగ కూడదని అనుకున్నాడు ఆ అబ్బాయ్య. తను వచ్చినా రాకపోయినా ఇంక బాజిరెడ్డి ఆ పిల్లను కోడలుగా తీసుకుపోవటం జరగదు' అన్నాడు హైమారెడ్డి.

అతను ఆ మాట తన తమ్ముడికి చెపుతూ ఉండగానే, పక్కకు తిరిగి తన భార్య భుజం మీద చేయి వేశాడు శివారెడ్డి.

'చెల్లెమ్మను లోపలికి తీసుకుపో. మీరందరూ కూడా వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. ఈ పంచాయితీ వ్యవహారం ఏమిటో నేను చూసుకుంటాను' గంభీ రంగా చెప్పాడు.

'బొమ్మలా కూర్చున్న ప్రణవిని కుర్చీలోనుంచి లేపి, ప్రత్యూష పక్కనే నడుస్తూ ఉండగా లోపలికి తీసుకుపోయింది అతని భార్య.

'అమ్మా.... నువ్వు కూడా వెళ్ళు' పిచ్చమ్మికి చెప్పాడు శివారెడ్డి.

తటపటాయిస్తున్న పిచ్చమ్మికి నమస్కారం చేశాడు రమణయ్యపంతులు. 'అవసరం అయితే వచ్చి మాట్లాడవచ్చు. పదండి తల్లీ' అన్నాడు.

బాజిరెడ్డి వైపు కోరగా చూస్తూ తను కూడా లోపలికి వెళ్ళిపోయింది ఆమె.

'నా పేరు మీద బాజిరెడ్డి చేసిన అప్పులు తీర్చ వలసిన బాధ్యత నా మీద ఉంది. నాకు కొంచెం వ్యవధి ఇవ్వండి. తీర్చేస్తాను. దయచేసి ఇప్పుడున్న పరిస్థితిని అర్థం చేసుకోండి' అన్నాడు శివారెడ్డి – హైమారెడ్డితో.

'తొందర ఏమీలేదు శివారెడ్డి! ఇప్పుడు మేము వచ్చింది వేరే పనిమీద. అప్పుల్ని గురించి మాట్లాడ టానికి మాత్రం కాదు. నువ్వు నిబ్బరంగా నిలబడు. మా అబ్బయ్య వచ్చిన తర్వాత నీకు అన్ని విషయాలు తెలుస్తాయి' అన్నాడు హైమారెడ్డి.

'అబ్బయ్యా? ఎవరు ఆ అబ్బయ్యా?' ఆశ్చర్యంగా అడిగాడు శివారెడ్డి.

'మా అబ్బయ్య. విఠల్‌రెడ్డి. మీ దగ్గరికి వచ్చాడు మీ అమ్మగారితో కలిసి' వెంటనే అన్నాడు దూరంగా నిలబడి ఉన్న అమెరికా పెద్దమనిషి.

బాజిరెడ్డి బెదిరించడాన్ని కూడా తట్టుకోగలిగిన శివారెడ్డి ఆ మాటల్ని వినేసరికి, పాదాల్లో ఓపిక నశించిపోయినట్టు కుర్చీలో చేరగిలబడిపోయాడు.

అతని గది ముందే నిలబడి ఉన్న డాక్టరు, నర్సు ఇద్దరూ వేగంగా వచ్చేశారు అతని దగ్గరికి.

'నాకేమీ కాలేదు. నేను బాగానే ఉన్నాను. విఠల్ రెడ్డి అంటే..' అంటూ పంతులుగారి వైపు చూసి 'వెట్టే గదూ?' అని అడిగాడు అతను.

నవ్వుతూ తల ఊపాడు రమణయ్యపంతులుగారు.

'అందరినీ హాలు ఖాళీ చేయించు. ఇంత జరిగిన తర్వాత ఇంకా ఈ అవసరం లేని మంద మనకి ఎదురుగా దేనికి?' కోపంగా అన్నాడు శంకరయ్య.

'పంతులుగారూ..' అన్నాడు శివారెడ్డి.

'అయ్యా బాజిరెడ్డిగారూ... ఇక మీరు దయ చేయండి. మీరు మీ కుమార రత్నంతో గేటు బయ టికి పోయి నిలబడండి' అన్నాడు పంతులుగారు.

'మాటలు జాగ్రత్తగా రానీ పంతులూ... నీ కథ ఇక్కడితో అయిపోలేదు' కోపంగా అన్నాడు బాజిరెడ్డి.

మాటలు దేనికి పంతులుగారు... మెడ పట్టుకుని బయటికి గెంటండి' చిరాకుగా అన్నాడు శివారెడ్డి.

'తేలుతుంది. ఎవరు ఎవరిని గెంటుతారో ఇంకా స్సేపటికి తేలుతుంది. ఎక్కడి నుంచి వచ్చాడో, అసలు ఎటువంటివాడో తెలియని ఒక అనాకారి–' అంటూ ఉండగా, స్పీడ్‌గా ముందుకు వచ్చాడు అమెరికా పెద్ద మనిషి పక్కన మౌనంగా నిలబడి ఉన్న యువకుడు.

మొట్టమొదటిసారిగా అతన్ని గమనించాడు బాజిరెడ్డి. 'ఒరేయ్... నువ్వు ఇక్కడే ఉన్నావా? ఇక్కడే ఉండి వింత చూస్తున్నావా?' అంటూ అతని షర్టు పట్టుకోబోయాడు.

రెండో పక్కనుంచి పఠాన్ కూడా కదలబోతుండగా, వెనక్కిదూకి తప్పించుకున్నాడు ఆ యువకుడు.

'ఇతను మీరు అనుకుంటున్న మనిషి కాదు. అతనికి అన్న. పేరు తిరుమలరెడ్డి. నేను మీకు కావ ల్సిన అబ్బయ్యకి తండ్రిని' అంటూ తన కొడుకును పరిచయం చేశాడు అమెరికా పెద్దమనిషి.

పళ్ళు బిగపట్టి ఇంకోసారి ఎటాక్ చేయాలని అనుకుంటున్న బాజిరెడ్డి ఆగ్రహానికి వెంటనే పడింది బ్రేకు.

'నడవండి. అందరూ బయటికి నడవండి. మా పనివాళ్ళతో చెప్పించుకునే పరిస్థితిని తెచ్చుకోకండి' ఇంకోసారి హెచ్చరించాడు పంతులుగారు.

విసవిసా బయటికి వెళ్ళిపోయాడు బాజిరెడ్డి తన వారందరితో. వెనుకే కదలబోయిన హైమా రెడ్డిని వెంటనే ఆపాడు శివారెడ్డి.

'భోజనం చేసి వెళ్ళవచ్చు. కూర్చోండి' అంటూ రమణయ్యపంతులుకి సైగ చేశాడు.

బాజిరెడ్డి తెప్పించి ఐసుగడ్డల్లో పెట్టించి ఉంచిన కూల్‌డ్రింకు బాటిల్స్‌ని తనే స్వయంగా తీసుకు వచ్చాడు పంతులుగారు.

సబ్బిరెడ్డి తీసుకున్నాడు. సబ్బిరెడ్డి గార్డులు తీసుకున్నారు. హైమారెడ్డి, అతని తమ్ముడు, వారితో వచ్చిన వాళ్ళు మాత్రం పొరపాటున కూడా ఆ బాటిల్స్ ముట్టుకోలేదు.

'తీసుకోండి సారూ' రిక్వెస్ట్ చేశాడు శివారెడ్డి మరోసారి.

'క్షమించాలి శివారెడ్డీ... కతికితే అతకదు. మమ్మల్ని బలవంతం చేయవద్దు' ఈసారి తను చెప్పాడు హైమారెడ్డి తమ్ముడు.

***

హాయిగా కుర్చీలో చేరగిలబడి కూర్చుంది ప్రణవి. పిచ్చమ్మి కూడా అదే మాదిరి రిలాక్స్ అయిపోయింది. ఒక్క శివారెడ్డి భార్యకు మాత్రం క్షణక్షణానికి అధికం అయిపోవడం మొదలు పెట్టింది ఆత్రుత.

ఉండబట్టలేక హాల్లోకి తొంగిచూసి కరెంట్ షాక్ కొట్టినట్టు అదిరిపడి, 'ప్రత్యూషా..' అని పిలిచింది.

ఒక్కగంతులో వెళ్ళి తను కూడా తొంగి చూసింది ప్రత్యూష. ఒకే ఒక క్షణం పాటు ఆత్రుతకి గురై అంతలోనే తనను తాను కంట్రోల్ చేసుకుంది.

'అతను మన విఠల్‌బాబు కాదు. పోలికలు అలాగే ఉన్నాయ్. కాని మనిషి వేరే' అని తేల్చి చెప్పింది.

'ఆ హైమారెడ్డి అదే పనిగా కతికితే అతకదు అంటున్నాడేమిటి?' ఇంకో అనుమానాన్ని బయట పెట్టింది శివారెడ్డి భార్య.

'పెళ్ళి ఈడున్న కొడుకో, బంధువో ఎవడో ఉండి ఉంటాడు. బాజిరెడ్డి పీడ వదిలిపోతే ప్రణవిని అడుగు దామని అనుకుంటూ ఉండి ఉంటాడు' తేలికగా చెప్పింది ప్రత్యూష.

పెదవుల మీదికి రాబోతున్న చిరునవ్వును ఆమె బలవంతంగా అదుముకుంటూ ఉందని కనిపెట్టే సింది శివారెడ్డి భార్య. చటుక్కున చేతిని జాచి ఆ పిల్ల చెవిని గట్టిగా పట్టుకుంది.

'నీకు తెలిసింది, మాకు తెలియంది ఏమిటో ఉంది. మర్యాదగా చెపుతావా రెండు తగిలించ మంటావా?' చిరుకోపాన్ని నటిస్తూ అడిగింది.

'అయ్యో వదినమ్మా... నువ్వు లేనిపోని టెన్షన్లతో అనవసరంగా భయపడిపోతున్నావు. రాత్రి విఠల్ బాబు చూపించిన ఫోటో గుర్తుందా?' అడిగింది ప్రత్యూష.

తల ఊపింది శివారెడ్డి భార్య.

'ఆ హైమారెడ్డి ముఖం కేసి గట్టిగా చూడు' ఇంకో మాట చెప్పింది ఆమె.

కనులు చిట్లించి తదేకంగా చూసి, గుండెల మీద చెయ్యి వేసుకుంది శివారెడ్డి భార్య.

'నిజం ఏమిటో విఠల్‌బాబు వచ్చి చెపితేగాని మనకి కరెక్టుగా తెలియదు. మనకి తను చూపిం చిన ఫోటో అచ్చం హైమారెడ్డి మాదిరిగానే ఉంది' అసలు విషయాన్ని క్లారిఫై చేసింది ప్రత్యూష.

**(ముగింపు వచ్చేవారం)**



# హెపటైటిస్ వైరస్ ఇలా తగ్గింది

**చాలా** చోట్ల చికిత్స తీసుకుని ఫలితం కనిపించకపోతే చివరి ప్రయత్నంగా హోమియో వైద్యుని దగ్గరకు వస్తుంటారు. కానీ అప్పటికే వ్యాధి బాగా ముదిరిపోయి ఉంటుంది. నిజానికి వ్యాధి లక్షణాలు కనిపించిన వెంటనే హోమియో వైద్యం తీసుకుంటే మంచి ఫలితాలుంటాయి. అలాంటి కేసే ఇది. రాజమండ్రిని వచ్చిన ప్రభాకర్‌ను విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్ల వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. పరీక్షలు చేయించమని సూచించా. రిపోర్టుల్లో హెపటైటిస్ ఉన్నట్లు తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

**చికిత్స తరువాత :** హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో ఉంది. వైరల్ లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంత మైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయ సమస్యలకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని , ఆరోగ్యంగా ఉన్నానని చెప్పుకొచ్చాడు.

# హెర్పిస్ బాధ మళ్లీ రాలేదు

**మా ఊరు** జగిత్యాల. నా పేరు ప్రదీప్. నా సమస్య ఏంటంటే ఒకరోజు అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తరువాత కొద్ది నెలలకు పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు వచ్చాయి. విపరీతంగా దురద పెట్టేది. ఆ నీటి పొక్కులు పగిలి పుండు మాదిరిగా అయ్యేవి. డాక్టర్‌ను కలిస్తే కొన్ని పరీక్షలు చేసారు. ఆ పరీక్షలో హెర్పిస్ అని తేలింది. ఆ రోజు ఎంత ఏడ్చానో చెప్పలేను. ఆ సమయంలోనే డాక్టర్‌గారి ఆర్టికల్స్‌ను ఆంధ్రజ్యోతిలో చదివాను. ఆలస్యం చేయకుండా డాక్టర్‌గారిని కలిసాను. నా పరిస్థితి మొత్తం వివరిస్తే భయపడాల్సిన అవసరం లేదని, వ్యాధి గురించిన వివరాలన్నీ చెప్పారు. దాంతో నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆరు నెలల పాటు మందులు వాడితే హెర్పిస్ జాడలేకుండా పోతుందన్నారు. డాక్టర్‌గారుచెప్పినట్లుగా మందులు వాడాను. మూడు నెలలో హెర్పిస్ పూర్తిగా పోయింది. నాకు పునర్జన్మను ప్రసాదించిన డాక్టర్‌గారికి జీవితాంతం రుణపడి ఉంటాను.

**హోమియో చికిత్స**

హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. తొలిసారి లక్షణాలు కనిపించినపుడు సరియైన చికిత్స తీసుకుంటే సత్వర నివారణ జరుగుతుంది. కానీ చాలా మందిలో వైరస్ ఉండిపోవడం వల్ల నిదానంగా ఉంటూ తిరిగి బయటపడుతూ ఉంటుంది. దీన్ని హెర్పిస్ రికరెంట్ అటాక్ అని అంటారు. దీన్ని హోమియో పూర్తిగా తొలగిస్తుంది. వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# హోమియోతో సంతాన సమస్య దూరం

**నా పేరు సుధాకర్**. నా పెళ్లయి నాలుగేళ్ళవుతోంది. కానీ సంతానం కలగలేదు. మంచి మంచి ఆసుపత్రులన్నీ తిరిగాం. కానీ ఫలితం లేదు. పరీక్షలన్నీ చేసి వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉందని అన్నారు. మందులు వాడితే సరిపోతుందన్నారు. ఏడాది పాటు మందులు వాడాను. కానీ పిల్లలు మాత్రం కలగలేదు. వీర్యకణాల సంఖ్య పెరగలేదు. ఆ సమయంలోనే హోమియో చికిత్స గురించి తెలిసింది. వెంటనే డాక్టర్ దగ్గరకు వెళ్లాను. ముందుగా సెమన్ అనాలసిస్ పరీక్ష చేయించమని చెప్పారు. రిపోర్టు వచ్చాక దానిపై అవగాహన కల్పించారు. వీర్య (సెమన్ అనాలసిస్) పరీక్ష ద్వారా వీర్యంలో ఉన్న లోపాలను గుర్తించవచ్చని అన్నారు. 'వీర్యంలో ప్రతి ఎంఎల్‌లో 60 నుంచి 120 మిలియన్ల వీర్యకణాలుండాలి. అందులో 80 శాతం కణాలు బాగుండాలి. వాటి కదలికలు బాగుండాలి. కానీ నా వీర్యంలో కణాలు తక్కువ సంఖ్యలోని ఉన్నాయి. ఉన్న కొన్ని కణాలు బాగాలేవు. అందువల్లే సంతానం కలగడం లేదు' అని డాక్టర్ చెప్పారు. హోమియో మందులతో సమస్య పోతుందని భరోసా ఇచ్చారు.

**చికిత్స తరువాత**

హోమియో మందులు వాడటంతో వీర్యపుష్టి కలుగుతుందని చెబితే నమ్మలేదు. కానీ నా విషయంలో మందులు వాడిన తరువాతే అర్థమయింది. హోమియో మందులు ఎంత అద్భుతంగా పనిచేస్తాయో. హోమియో చికిత్స తరువాత వీర్యకణాల కదలికలు పెరిగాయి. డాక్టర్ గారు నా శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులు ఇచ్చారు. దీనివల్ల మంచి ఫలితం లభించింది. హోమియో చికిత్స నా జీవితంలో వెలుగులు నింపింది. ఇప్పుడు నాకు ఒక బాబు. వాడు పుట్టాక నా జీవితం మొత్తం మారిపోయింది. డాక్టర్ గారికి ఎప్పటికీ రుణపడి ఉంటాను.

# మేస్త్రీ భుజం నొప్పి మటుమాయం

**అమీర్‌పేట్** క్లినిక్‌లో పేషెంట్స్‌తో బిజీగా ఉన్నాను. సుమారు నలభై ఏళ్ల వ్యక్తి నా ఛాంబర్‌లోకి వచ్చాడు. 'ఏంటీ ప్రాబ్లం' అని అడిగితే భుజం నొప్పి భరించలేకుండా ఉన్నాను. నేను తాపీమేస్త్రిని. ఈ నొప్పి మూలంగా పనికి కూడా దూరమయ్యాను. పని పక్కన పెడితే చేయి లేపలేని పరిస్థితిలో ఉన్నాను. నేను పనికెళితేనే ఇల్లు గడిచేది. పెయిన్‌కిల్లర్స్ వేసుకుంటే కొద్దిసేపు బాగుంటుంది. ఆ తరువాత మళ్లీ మామూలే అని చెప్పుకొచ్చాడు. ఆందోళన పడాల్సిన అవసరం లేదని హోమియో మందులతో నెమ్మదిగా తగ్గిపోతుందని చెప్పా. భుజంనొప్పితో బాధపడే వారి పరిస్థితి దయనీయంగా ఉంటుంది. సాధారణంగా గాయాల బారినపడినపుడు భుజం ఎముక దగ్గర ఉండే లిగమెంట్ చిరిగిపోతుంది. ఫలితంగా షోల్డర్ జాయింట్ డిస్ లోకేట్ అవుతుంది. ఈ సమస్యను అలాగే వదిలిస్తే జాయింటు మొత్తం అరిగిపోతుంది. ఆర్థరైటిస్ డెవలప్ అవుతుంది. కొందరిలో రెండు ఎముకల మధ్య గ్యాప్ తగ్గిపోతుంది. ఫలితంగా ఎముక రాపిడికి గురై తీవ్రమైన నొప్పి ఏర్పడుతుంది. భుజం పైన నొప్పి ఉండటంతో పాటు చేతివైపు కూడా నొప్పి ఉంటుంది. చేయిపైకి లేపాలని చూసినపుడు నొప్పి వస్తుంటుంది. ఆ వైపు పడుకోవాలని చూసినా నొప్పి వస్తుంటుంది. ఈ సమస్యను రొటేట్ కఫ్ టేర్ అంటారు. రిపీటెడ్ మూవ్‌మెంట్స్ చేసే వారిలో టెన్నిస్ ఎల్బో సమస్య కనిపిస్తుంది.

**చికిత్స :** ఏ కారణం చేత మెడ, భుజం నొప్పి వస్తున్నా హోమియో మందులు పరిష్కారాన్ని చూపుతాయి. ఇదే విషయాన్ని తనకు చెప్పి మందులు వాడమని చెప్పా. మూడు నెలల తరువాత మళ్లీ కనిపించాడు. నొప్పి బాగా తగ్గిందని అన్నాడు. మరో మూడు నెలలు వాడమని సూచించా. ఇప్పుడతని భుజం నొప్పి పూర్తిగా దూరమయింది. యథావిధిగా మేస్త్రీ పనికి వెళుతున్నాడు.

ADVT




# చిన్నికృష్ణుని చిలిపి చేష్టలు:యశోద ఆనందాలు

**చిన్నికృష్ణుని అల్లరిచేష్టలు చెబుతూ ఆనందమో, విషాదమో కళ్ళు చెమర్చుకున్నారు గోపికలు. ఆందోళన చెందింది యశోద. నోట కుక్కుకున్న చీరకొంగు తొలగించి, అయ్యయ్యో అన్నది. జాలి చెందింది. ఒకరి తర్వాత ఒకరుగా వరుసగా కృష్ణుని చిలిపిచేష్టలు చెబుతున్నారు. తన వంతు వచ్చిందేమో! ఓ గోపిక చెప్పసాగిందిలా. మీ కృష్ణుని అల్లరి తట్టుకోలేక, మీ వాడితో మావాడు స్నేహం మానుకున్నాడమ్మా! మానుకుని, వాడి మానాన వాడు, వేరే పిల్లలతో అవతలి వీధిలో ఆడుకుంటుంటే పిలిచి మరీ వాడికి గొంతు వరకూ వెన్న తినిపించాట్ట కృష్ణుడు. తినకపోతే తంతానని హెచ్చరించాట్ట! దాంతో మావాడు గొంతువరకూ వెన్న తిని, ఊపిరి ఆడక ఇంట్లో ఆపసోపాలు పడుతున్నాడు. కావాలంటే నువ్వే వచ్చి చూడుతల్లీ!**

ఆ పిల్లాడిసంగతి సరే, ఈ సంగతి చూడమ్మా! మీ కృష్ణుడు ఇళ్ళల్లోకి జొరబడకుండా తలుపులు మూసి తాళాలు పెట్టాం. పెట్టిన తాళాలు పెట్టినట్టే ఉన్నాయి. కృష్ణుడు ఇళ్ళల్లోకి ఎలా జొరబడ్డాడో అంతు చిక్కట్లేదు. ఉట్టి మీద పాలూ పెరుగూ ఎప్పటి లాగానే లేకుండాపోయాయి. ఇక్కడ ఈ ఇంట్లో జొరబడి అందరినీ ఆటపట్టించి, అక్కడ ఆ ఇంట్లో ప్రత్యక్షమవుతాడు. అక్కడ దొంగచాటుగా దాగుని, రకరకాల క్రూరజంతువులు అరచినట్టుగా అరచి, బెంబేలెత్తిస్తాడు. అంతటితో ఊరుకోడు. కడవలన్నీ పగలగొట్టి మరీ పారిపోతున్నాడు. తల్లీ యశోదా! డబ్బుంటే అనుభవించు! అంతేకాని, మాకు డబ్బుంది, మమ్మల్ని ఎవరూ ఏమీ అనరనుకోకు. బాధపడితే ఎవరైనా ఎంత మాటైనా అంటారు. అల్లరికి ముచ్చట పడితే, నీ ఇంట్లో చేయించుకో! అంతేగాని మా ఇంట్లో కృష్ణుడు అల్లరి చేస్తే మేము ఊరుకోము అన్నది ఓ గోపిక. ఆ గోపికను వెనక్కి నెట్టి, ముందుకు వచ్చింది ఇంకో గోపిక. అన్నదిలా.

ఇంతటి గారాబాలకొడుకు నీకే కాదమ్మా! మాకూ ఉన్నారు. కాని, మా పిల్లలు ఇంత అల్లరి ఎరుగరు. మీరు గొప్పవారే! డబ్బున్నవారే! అయినంత మాత్రాన పిల్లాణ్ణి ఊరిమీద వదిలేస్తే ఎలా? కృష్ణుడు పసిపిల్లాడని అనుకుంటున్నావేమో! ఏం కాడు. ఆ పిల్లాడు పిల్లల్లో పిల్లాడు. పెద్దల్లో పెద్దాడు. మహాగడుగ్గాయి.

తల్లీ నా కష్టం ఏం చెప్పుకోను? మా ఇంట్లో కడవల్లో ఉన్న పాలూ పెరుగూ వెన్నా తాగినంత తాగి, తిన్నంత తిని, కడవలన్నీ పగులగొట్టి పోయాడమ్మా నీ కృష్ణుడు. కడవలు కొనేందుకు కూడా డబ్బులేనివాళ్ళం. పేదవాళ్ళం. మమ్మల్ని ఇలా హింసించడం నీ పిల్లాడికి తగునా చెప్పు? ఇలాగే పదేపదే నీ కృష్ణుడు అల్లరి చేస్తే మేమిక ఈ పల్లెలో ఉండలేం తల్లీ! ఎక్కడికో అక్కడికి పోవాలి అన్నది మరో గోపిక. ఆమెను పక్కకు తోసి ఇంకో గోపిక అన్నదిలా. కంటనీరు పెట్టుకున్నది.

మొన్ననేం అయిందో తెలుసా తల్లీ? మా ఆవుల్నీ, లేగల్నీ ఒకచోటకి చేర్చి, పులి అరచినట్టుగా గట్టిగా అరిచాట్ట! అంతే! ఆ అరుపునకు భయపడి, మా ఆవులూ, లేగలూ పరుగుదీశాయి. అడవిబాటపట్టాయి. ఎంత వెదికినా ఒక్కటీ దొరకలేదు. ఎలా బతకాలమ్మా మేము?

ఇన్ని బాధలు పడుతూ ఇక ఈ పల్లెలో ఒక్క క్షణం కూడా ఉండలేం. ఈ పల్లె విడచి వెళ్ళిపోతాం. అప్పుడు నువ్వూ, నీ కృష్ణుడూ ఇక్కడే ఉండి, ఉట్టి కట్టుకుని ఊరేగండి అన్నది ఓ గోపిక. ధైర్యం చేసి యశోద ముఖమ్మీద చేతులాడించింది.

ముందు చిన్నారికృష్ణుని చిలిపిచేష్టలు వినేందుకు సరదాగా ఉన్నా, ఉత్సాహంగా ఉన్నా తర్వాత తర్వాత ఆ రెండూ అంతరించాయి. వాటి స్థానంలో దుఃఖమూ, బాధా చోటు చేసుకున్నాయి. విన్నవన్నీ నిజమని నమ్మలేకపోయింది యశోద. అలాగని గోపికల మాటలు కల్లలని కొట్టివేయలేకపోయింది. ఏం మాట్లాడాలో, వారికి ఎలా నచ్చజెప్పాలో తెలియక క్షణంసేపు మౌనం వహించింది. తర్వాత అన్నదిలా.

**కృష్ణుడికోసం ఇల్లిల్లూ వెదికింది యశోద. చివరకు ఓ ఇంట్లో కనిపించాడు. ఎలా కనిపించాడంటే రోలు తిరగేసి ఎక్కి ఉట్టిలోని కడవదించి అందులోని వెన్నను తనుజేరదీసిన కోతిపిల్లకు తినిపిస్తున్నాడు. ఆ దృశ్యంచూసి ఆశ్చర్యపోయింది యశోద. తల్లి పిలుపు విని పరుగందుకున్నాడు కృష్ణుడు. సందుగొందుల్లో యశోద కృష్ణుణ్ణి వెంబడిస్తున్న దృశ్యం పల్లెలో అందరికీ ఆశ్చర్యానందాలు కలగజేసింది.**

కృష్ణుడు పసివాడమ్మా! తెలిసీ తెలియక తప్పులు చేసి ఉంటాడు. క్షమించండమ్మా! వెళ్ళిరండి.

చేతులు జోడించి నమస్కరించింది.

ఇంత అల్లరి అంత అల్లరి అంటూ కృష్ణుడు గురించి మీరు వింతవింతలు చెబుతున్నారు. నాకైతే ఏదీ నమ్మబుద్ధికావట్లేదు. పొరుగింటికే పోడువాడు. అదిగో అక్కడే కూర్చుని, వాడితో వాడే మాట్లాడుకుంటూ, ఆడుకుంటూ కూర్చుంటాడు. వాణ్ణి పట్టుకుని అనరాని మాటలంటున్నారు. సరే! ఇక నుంచి వాడు మీ గుమ్మంలో కనిపిస్తే చెప్పండి. కనిపించడు గాక కనిపించడు. నాదీ పూచీ అన్నది యశోద.

ఆ ముచ్చటా చూస్తాం అన్నట్టుగా మూతులు విరచి గోపికలంతా అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు. వారటు వెళ్ళగానే ఇటు పెరట్లోనికి పరుగున వచ్చి చూసింది యశోద. చెట్టుకింద లేగదూడలకి గడ్డిపెడుతూ, వాటితో గెంతులేస్తూ ఆడుకుంటూ కనిపించాడు కృష్ణుడు. జాలివేసింది. పాపం అనిపించింది. తమాయించుకుంది. లేని కోపం తెచ్చిపెట్టుకుంది. కృష్ణా అంటూ కృష్ణుణ్ణి సమీపించింది.

ఏంటయ్యా ఇదంతా? పాలూ పెరుగూ వెన్నా నెయ్యీ ఇంట్లో లేకనా నీ అల్లరి. ఉన్నాయి కదయ్యా, తిన్నంత తిని, తాగినంత తాగు. కాదంటే కోపగించు. అంతేగాని, అందరినోళ్ళలోనూ పడకయ్యా! బాధగా ఉంది అన్నది. దిష్టితీసింది కృష్ణునికి. కడుపునిండా పాలు తాగించి, పడుకోబెట్టింది. నిద్రపోతున్న కృష్ణుని చూసి, నోటి మాటా, కంటి చూపూ ఎరుగని వాడు, ఇన్ని నిందలు పడుతున్నాడు. ఎలా బతుకుతాడో ఏమో అనుకున్నది యశోద.

కొద్దిరోజులు గడిచాయి. ఒకరోజు బలరాముడూ, కొందరు గోపబాలకులూ కలసి పరుగున వచ్చారు. పని చేసుకుంటున్న యశోదకు చెప్పారిలా.

అమ్మా! కృష్ణుడు మన్ను తింటున్నాడు. ఎంత వారించినా వినడం లేదు. అమ్మకు చెబుతాం అంటే చెప్పుకో అన్నాడు.

అవునా? ఆశ్చర్యపోయింది యశోద. పదండంటూ బయల్దేరింది. కృష్ణుణ్ణి సమీపించింది. అటు తిరిగి కూర్చున్న కృష్ణుణ్ణి ఇటు తిప్పింది.

మన్ను తింటున్నావా? బుద్ధి ఉందా? అరిచింది.

నీ అల్లరికి అంతూ పొంతూ లేదా? ఏం కావాలంటే అది తినేందుకు ఇంట్లో అన్నీ ఉంటే నీకు ఇక్కడి మన్నే కావాల్సి వచ్చిందా? ఎందుకిలా నన్ను క్షోభపెడుతున్నావు? మాట్లాడవేం? ప్రశ్నించింది. సమాధానంగా ముందు ఏడుపు మొహంతో చూశాడు కృష్ణుడు. తర్వాత అన్నాడిలా.

నా మీద వీళ్ళంతా నీకు చాడీలు చెబుతున్నారమ్మా! నేను మన్ను తిన్నానంటే నువ్వు నమ్ముతున్నావా? మన్ను తినడానికి నేనేమీ పసివాడినీ, వెర్రివాణ్ణీ కాదుకదమ్మా? ఎందుకు తింటాను చెప్పు? కావాలనే, నీ చేత నన్ను కొట్టించడానికే అన్నయ్యా వాళ్ళంతా నా మీద నీకు లేనిపోనివన్నీ చెబుతు

న్నారు. కావాలంటే నా చేతులు చూడు. మట్టి అంటుకుని ఉన్నాయా?

కృష్ణుని చేతులు చూసింది యశోద. ఆ చేతులకి మట్టి అన్నదే లేదు.

నోరు తెరచి చూపించమన్నా చూపిస్తాను. మట్టి తింటే తెలిసిపోతుందిగా. చెప్పు, నోరు తెరచి చూపించనా? ఏడుపుగొంతుతో అడిగాడు కృష్ణుడు. ఆసరికే బలరామాదులు అక్కణ్ణుంచి జారుకున్నారు. తలచుకుంటే కృష్ణుడు తిమ్మినిబమ్మినీ, బమ్మిని తిమ్మినీ చేయగలడు. మనకెందుకు మధ్యలో రొష్టు అని భయపడ్డారు.

చూపించు! నోరు తెరచి చూపించు గద్దించింది యశోద. సరేనన్నట్టుగా తలూపి, నోరు తెరిచాడు కృష్ణుడు. తెరిచిన కృష్ణుని నోటిలోకి చూసింది యశోద. ఎక్కడా మన్ను తిన్న జాడలేదు. కాని, సూర్యచంద్ర తారకలతో, గ్రహాలతో, సప్తసముద్రాలతో, కులపర్వతాలతో కళకళలాడుతున్న విశాలవిశ్వం సమస్తం సాక్షాత్కరించింది ఆ నోటిలో. వాటిని చూసి ఆశ్చర్యాందోళనలు చెందింది యశోద. ఇది కలా? విష్ణుమాయా? అనుకున్నది. పరిపరివిధాల మధనచెందింది. మొన్న ముఖంలో విశ్వం సాక్షాత్కరిస్తే, నేడు నోటిలో సాక్షాత్కరించింది. ఏమిటిదంతా? అసలు వీడు కృష్ణుడేనా? నా కృష్ణుడేనా? అని అనుమానించింది యశోద. కాదు కాదు అనుకున్నది. కృష్ణుడు కాదు విష్ణువితడు. అనుమానం లేదనుకున్నది. విశ్వరూపాన్ని సాక్షాత్కరింపజేసిన శ్రీమహావిష్ణూ నీకిదే నా నమోవాకాలు అన్నది. కృష్ణుని ముందు మోకరిల్లింది. అంతా క్షణకాలమే! అంతలోనే దేవాధిదేవుడు యశోదను మాయామోహితురాలను చేశాడు. కృష్ణుడు లోకేశ్వరుడు అన్న భావన తొలగిపోయిందామెలో. తన కొడుకే అన్న అభిప్రాయం, అభిమానం కలిగాయి. కృష్ణుణ్ణి ఒక్క ఉదుటన ఒడిలోనికి తీసుకున్నది యశోద. నా కన్నా! నా చిట్టీ అని లాలించింది. గుండెలకు గట్టిగా హత్తుకుంది. ముద్దు చేసింది.

ఒకనాడు యశోద పెరుగు చిలకనారంభించింది. పెద్దకుండలో పెరుగు చిలుకుతూ, అలసటపోయేందుకు పాడుకోసాగింది. ఆ వేళప్పుడు రానే వచ్చాడు కృష్ణుడు. కాలిగజ్జెలు ఘల్లుఘల్లున వచ్చి, ఆకలేస్తోందమ్మా అన్నాడు. వినిపించుకోని యశోదను వినిపించుకునేట్టు చేసేందుకు, చిలుకుతున్న కవ్వాన్ని పట్టుకున్నాడు. ఎంతగట్టిగా పట్టుకున్నాడంటే చిలికేందుకు ప్రయత్నించిన యశోద బలం చాలలేదు. నివ్వెరపోయింది ఆ తల్లి. కోపాన్ని నటిస్తూ కృష్ణుణ్ణి ఒడిలోనికి తీసుకున్నది యశోద. కడుపునిండా పాలు పట్టింది. అంతలో వంటింట్లో పొయ్యి మీద పాలు పెట్టినట్టు గుర్తురావడంతో, ఒడిలో నుంచి కృష్ణుణ్ణి దించి, పరుగుదీసిందటు. తల్లి అలా తనని ఒడిలో నుంచి వేరు చెయ్యడం కృష్ణునికి నచ్చలేదు. కోపం వచ్చింది. ఆ కోపంతో పెరుగుకుండను పెద్దరాయి విసిరి పగలగొట్టాడు. ఒలికిన వెన్నను తిన్నంత తిని, అక్కణ్ణుంచి పరుగందుకున్నాడు. వేరే ఇంటికి పారిపోయాడు.

వంటింట్లో పని చక్కబెట్టుకుని, వచ్చి చూసేసరికి, పెరుగుకుండ పగిలి ఉండడం, ముద్దముద్దలుగా వెన్న పడి ఉండడాన్ని గమనించింది యశోద. ఇదంతా కృష్ణుని పనే అని పసిగట్టింది. కృష్ణునికోసం



ఇల్లంతా వెదికింది. ఎక్కడా కనిపించలేదు. ఇరుగిల్లూ పొరుగిల్లూ వెదకజూసింది. ఒక ఇంట్లో కృష్ణుడు కనిపించాడు. ఎలా కనిపించాడయ్యా అంటే....

ఆ ఇంటి ఉట్టి అందలేదేమో! అక్కడి రోలు తిరగవేసి ఎక్కాడు. ఎక్కి.. ఉట్టిలోని కడవను దించి, అందులోని వెన్నను చేరదీసిన కోతిపిల్లకు తినిపిస్తూ కనిపించాడు. ఆ దృశ్యానికి నివ్వెరపోయింది యశోద. కోపం కూడా తెచ్చుకుంది. గట్టిగా కేకేసిందిలా.

కృష్ణా!

ఆ పిలుపునకు తల్లివైపు చూశాడు కృష్ణుడు. కోపంగా ఉన్న తల్లిని చూసి భయపడ్డాడు. అంతే! కోతిసహా అక్కణ్ణుంచి పరుగు అందుకున్నాడు. వెంటపడింది యశోద. అందుతున్నట్టే అంది అందడే కృష్ణుడు. ముందు కృష్ణుడు, వెనుక యశోద పరుగెడుతూ పల్లెలో అందరికీ ఆశ్చర్యానందాలు పంచారు.

ఈ చెట్టుచాటున, ఆ స్తంభం మాటున ఎక్కడ పడితే అక్కడే దాగున్నట్టు ఉండేవాడు కృష్ణుడు. చిక్కుతాడనుకుంటే చిక్కడే! వెదుకుతున్న తల్లిని కేకేసి మరీ అమ్మా! ఇక్కడ ఉన్నాను, పట్టుకో అనేవాడు. అక్కడికి యశోదవస్తే ఇంకోచోట ఉండి, పిలిచేవాడు. దొంగ దొరికేడనుకునేవేళ చేతులు జోడించి తల్లికి నమస్కరించి అనేవాడిలా కృష్ణుడు.

అమ్మా! తప్పయిపోయిందే! ఇంకెప్పుడూ అలా చెయ్యనే! ఈసారికి వదిలేయవే! నీ కృష్ణుణ్ణే! నీ చిన్ని కృష్ణుణ్ణే! కనికరించవే!

కనికరిద్దామనుకునేంతలో వెవ్వెవ్వె అని వెక్కిరించి నవ్వుతూ అందకుండా పారిపోయేవాడు. ఆ చేష్టలకు యశోదకు నవ్వు వచ్చేది. అయినా ఆ నవ్వును అదిమిపెట్టి, ఆగ్రహిస్తున్నట్టుగా నటించేది.

దొరికిపోయాడు కృష్ణుడు. చేతికి చిక్కిపోయాడు. ఎక్కడకి వెళ్తావిప్పుడు? అంది యశోద. దొరికిన దొంగను బంధించేందుకు తాడుకోసం చూస్తే దొరకదే! దానిని దొరకబుచ్చుకునేంతలో కృష్ణుడు మళ్ళీ మామూలే! దొరక్కుండా పరుగందుకునేవాడు. ఏ సాయంత్రమో ఇంటికి చేరేవాడు. అలసిపోయి ఉన్నాడేమో! ఇంటి అరుగుమీద నిద్రపోతూ కనిపించేవాడు. అప్పుడు చిన్నారిని సమీపించి విస్తుపోయి అనేదిలా యశోద.

ఎవరయ్యా అనాథపిల్లాడిలా ఈ అరుగు మీద బజ్జున్నది. మా నల్లనయ్యేనా? అరరే! మా నల్లనయ్యే! ఇల్లిల్లూ తిరిగి తిరిగి, పాలూ వెన్నా పెరుగూ జుర్రి జుర్రి అలసిసొలసి నిద్రపోయాడా? ఏ పాపం ఎరుగని పిల్లాడిలా ఎంత అమాయకంగా నిద్రపోతున్నాడో? పొద్దుపొడిచిందంటే పక్కలో ఉండవు. ఆ ఇల్లూ ఈ ఇల్లూ అంటూ పరిగెడతావు. ఆ ఇంటా ఈ ఇంటా దొంగతనం చేస్తావు. తిట్లు తింటావు. ఇదేం ఆనందంవయ్యా నీకు? ఒక్క చోట కుదురుగా ఉండవు. మంచివాడవనిపించుకోవు. ఎందుకిలా తయారయ్యావో అర్థం కాదు.

కొండలెక్కుతావు. కోనల్లో ఉంటావు. క్రూరజంతువులకు భయపడవు. కోతుల్ని చేరదీస్తావు. చెరువులన్నిటా నువ్వే! దొరువులన్నిటా నువ్వే! ప్రాణాల మీదికి తెచ్చుకుంటావేమోనని భయంగా ఉందయ్యా అని కళ్ళొత్తుకునేది యశోద. తల్లి కంటతడిపెడితే తట్టుకోలేకపోయేవాడు కృష్ణుడు. అమ్మా అంటూ ఆమెను అల్లుకుపోయేవాడు. అల్లుకుపోయిన కృష్ణుణ్ణి ఎత్తుకుని, ఇంట్లోనికి నడిచేది యశోద. కృష్ణుడు ఇంట అడుగిడితే చాలు! వెలుగులు నిండేవి. వెన్నెల కురిసేది.

—అరణి



# అడకత్తెరలో భారత్



## రివ్యూ

- రాజశుక

**హేగ్ కోర్టు తీర్పునకు పాకిస్థాన్ కట్టుబడి ఉంటుందా? కట్టుబడి ఉండకపోతే ఏం చేయాలి? జాదవ్‌ను సురక్షితంగా భారత్‌కు చేర్చడం ఎలా?**

న్యాయపరంగా చూస్తే హేగ్ తీర్పు భారత దేశానికి గొప్ప విజయం. రాజకీయంగా, దౌత్యపరంగా ప్రధాని నరేంద్ర మోదీకి కూడా ఇది విజయమే. పాకిస్థాన్ సైనిక న్యాయస్థానం మరణ శిక్ష వేసిన భారతీయుడు కుల్‌భూషణ్ జాదవ్‌కు శిక్షను ప్రస్తుతానికి ఆపుతూ అంతర్జాతీయ న్యాయస్థానం గత వారం తీర్పునివ్వడం సంతోషించదగ్గ పరిణామమే. అయితే, భారత్ దీని మీద ఎంత కాలం సంబరాలు జరుపుకుంటుందన్నది ఆలోచించాల్సిన విషయం. సాధారణంగా భారత్ ఏ ద్వైపాక్షిక సమస్యనూ అంతర్జాతీయ న్యాయస్థానం వరకూ తీసుకువెళ్లదు. ముఖ్యంగా పాకిస్థాన్‌తో ఉన్న ద్వైపాక్షిక సమస్యను అంతర్జాతీయ వేదికల మీద ప్రస్తావించడం కూడా అరుదే. ఒక్క కశ్మీర్ సమస్య మాత్రం దీనికి మినహాయింపు. కానీ, కుల్‌భూషణ్ జాదవ్ కేసును మాత్రం నరేంద్ర మోదీ ప్రభుత్వం హేగ్‌లోని అంతర్జాతీయ న్యాయస్థానానికి తీసుకువెళ్లింది. జాదవ్ కేసును భారత్ అంత తేలికగా తీసుకోలేకపోయింది.

మే 8న సీనియర్ న్యాయవాది హరీశ్ సాల్వే హుటాహుటిన హేగ్ వెళ్లినప్పుడు అంతర్జాతీయ న్యాయస్థానం సమావేశంలో లేదు. అయినప్పటికీ సాల్వే దీన్నొక అత్యవసర సమస్యగా పరిగణించి, భారత్ తరఫున కోర్టు రిజిస్ట్రార్‌కు దరఖాస్తు సమర్పించడమే కాకుండా, సుమారు 20 నిమిషాలసేపు ఈ కేసు గురించి రిజిస్ట్రార్‌కు వివరించి చివరికి కేసు స్వీకరణకు ఒప్పించారు. నిజానికి ఇందులో ఓ రిస్కు కూడా ఉంది. భారత్ దరఖాస్తును న్యాయస్థానం తిరస్కరించి ఉంటే ఏమయ్యేదో తెలియదు. ఒకవేళ అది ఈ దరఖాస్తును విచారణకు స్వీకరించినా భారత్‌కు అనుకూలమైన తీర్పు వస్తుందనే నమ్మకం లేదు. ఐక్యరాజ్య సమితికి న్యాయవిభాగంగా ఉన్న అంతర్జాతీయ న్యాయస్థానం ముందు తమ కేసు ఉంచాలన్న భారత్ నిర్ణయంపై రకరకాల సందేహాలు, సంశయాలు వ్యక్తమయ్యాయి. రెండు దేశాల సమస్యను అంతర్జాతీయ సమస్యగా మార్చడానికి భారత్ ప్రయత్నిస్తోందని కొందరు సందేహం వ్యక్తం చేశారు.

పాకిస్థాన్ కూడా దీన్ని ఓ రాజకీయ అవకాశంగా తీసుకునే ఆలోచన చేస్తోందనడంలో సందేహం లేదు. కశ్మీర్ సమస్యను మరోసారి అంతర్జాతీయ స్థాయికి తీసుకు వెళ్లడానికి పాకిస్థాన్ ఈ అవకాశం ఉపయోగించుకుంటుంది. “అంతర్జాతీయ న్యాయస్థానం తీర్పు ఇవ్వగలదు కానీ, దాన్ని అమలు చేయలేదు. అందువల్ల, భారత్‌కు ఈ నిర్ణయం వల్ల ఒరిగేదేమీ లేదు. పైగా తనకు తానుగా తమ ద్వైపాక్షిక సమస్యను అంతర్జాతీయస్థాయికి తీసుకు వెళ్లినట్టయింది” అని పాకిస్థాన్ భావిస్తోంది. హేగ్ కోర్టుకు ఈ కోర్టుకు తీసుకు వెళతామని భారత్ బెదిరించి ఉంటే ఫలితం వేరుగా ఉండేదని, భారత్ ఎంతగానో లబ్ధి పొందేదని పాక్ రాజకీయ నిపుణులు అభిప్రాయపడుతున్నారు. పాకిస్థాన్ నిపుణుల అభిప్రాయాలు ఎలా ఉన్నప్పటికీ, భారత్ మాత్రం తన నిర్ణయం వల్ల బాగానే లబ్ధి పొందింది. హేగ్ కోర్టు ఇచ్చిన మధ్యంతర తీర్పు మోదీ దౌత్యస్థాయిని పెంచింది. మోదీకి రాజకీయంగా బలం చేకూరింది. జాదవ్ నిర్బంధం విషయంలో కొన్ని తాత్కాలిక చర్యలు తీసుకోవాలని, పాక్ అభ్యర్థనలను తిరస్కరించాలని సాల్వే చేసిన అభ్యర్థనలను కోర్టు మన్నించడం మోదీ ప్రభుత్వానికి ఒక విధంగా శుభ పరిణామమే.

### మారిన విదేశాంగ విధానం

ఏది ఏమైనా, కొంత కాలంగా స్తబ్ధుగా ఉన్న భారతదేశ విదేశీ విధానానికి ఒక కొత్త ఊపు వచ్చింది. ఈ కొత్త ఊపు అవసరమని గుర్తించిన మోదీ ఎంతో ధైర్యంతో, తెగువతో ‘హేగ్’కు వెళ్లాలనే నిర్ణయం తీసుకున్నారు. తాము ఈ ప్రపంచంలో పాకిస్థాన్ లాంటి ‘అచ్చోసిన ఆంబోతు’ దేశం కాదని, ప్రజాస్వామ్య పద్ధతులు పాటించే దేశమని ఇతర దేశాలకు నమ్మకం కలగడానికి మోదీ చర్య నిస్సందేహంగా తోడ్పడుతుంది. అది ద్వైపాక్షిక సమస్య అయినా, బహుపక్ష సమస్య అయినా అంతర్జాతీయ న్యాయసూత్రాలకు భారత్ కట్టుబడి ఉంటుందని కూడా భారత్ తేల్చి చెప్పగలిగింది. భారత్ తీరు నచ్చే హేగ్ కోర్టులోని న్యాయమూర్తులందరూ ఏకపక్షంగా భారత్‌కు అనుకూలమైన తీర్పు వెలువరించారు. నిజానికి పాకిస్థాన్ లాంటి బలహీనమైన ప్రజాస్వామ్య వ్యవస్థలు అగ్రరాజ్యాలకు భయపడి, అంతర్జాతీయ నియమాలు, సంప్రదాయాలకు కట్టుబడి ఉంటాయి. ఈ అభిప్రాయానికి భిన్నంగా భారత్ వ్యవహరించి, భారత్ తన ప్రతిష్ఠ పెంచుకుంది. హేగ్ కోర్టుకు జాదవ్ కేసును తీసుకెళ్లడం భారత విదేశీ విధానంలో ఓ పెద్ద మలుపు.



హేగ్ కోర్టు ఇచ్చిన తీర్పు పాకిస్థాన్‌కు ఏమాత్రం అనుకూలంగా లేదు. పైగా పాకిస్థాన్ విషయంలో కోర్టు ఉపయోగించిన భాష కూడా కాస్తంత మోటుగా, కఠినంగా ఉంది. ఈ కేసును 'అత్యవసరంగా' పరిశీలించాల్సిన అవసరం లేదంటూ పాక్ చేసిన వాదనతో కోర్టు ఏకీభవించలేదు. తుది తీర్పు వెలువరించే వరకూ పాకిస్థాన్ జాదవ్‌ను ఉరితీయకుండా అన్ని చర్యలూ తీసుకోవాలని, అది తీసుకున్న చర్యలను కోర్టుకు ఎప్పటికప్పుడు నివేదించాలని కూడా ఆదేశించింది. తుది తీర్పు వెలువడే వరకూ జాదవ్ వ్యవహారమంతా కోర్టు పర్యవేక్షణలో ఉంటుందని కూడా కోర్టు స్పష్టం చేసింది. తన తీర్పును అమలు చేయడం కోర్టుకు సాధ్యమైనా, కాకపోయినా ఈ మాత్రం ఆదేశాలను జారీ చేయడం వల్ల, ఇక నుంచీ పాకిస్థాన్ తీరుతెన్నుల్ని ప్రపంచ దేశాలన్నీ గమనిస్తూ ఉంటాయనేది మాత్రం నిజం.

కోర్టు ఆదేశాలకు పాకిస్థాన్ కట్టుబడి ఉండక తప్పని పరిస్థితి ఏర్పడింది. కోర్టు ఆదేశాలను ఉల్లంఘిస్తే, అనేక దేశాలు పాకిస్థాన్ మీద ఆంక్షలు విధించడానికి అవకాశం కలుగుతుంది. అయినప్పటికీ పాకిస్థాన్ హేగ్ తీర్పును కాదని, జాదవ్‌ను ఉరి తీసే పక్షంలో ఇది ఓ అచ్చోసిన ఆంబోతు దేశమనే అపఖ్యాతి సార్థకమైపోయి, ప్రస్తుతం ఉన్న కొద్దిపాటి విశ్వసనీయత కూడా కోల్పోతుంది. ఇది దౌత్యపరంగా పాకిస్థాన్‌కు ముస్ముందు పెద్ద దెబ్బే అవుతుంది. భారత్ స్వయంగా ఒత్తిడి తీసుకు రావాల్సిన అవసరం లేకుండానే కోర్టు ద్వారా లక్ష్యాన్ని సాధించడం భారత్‌కు దౌత్యపరమైన విజయం. జాదవ్ ఓ గూఢచారి అనే తప్పుడు ఆరోపణతో పాకిస్థాన్ అతనికి ఉరి శిక్ష విధించింది. ఒకవేళ అతను గూఢచారే అయినా భారత్ హేగ్ కోర్టుకు వెళ్లడం తప్పేమీ కాదు. సాధారణంగా ఓ గూఢచారి పట్టుబడినప్పుడు, సంబంధిత దేశం అతను తమ దేశ పౌరుడు కాదని బుకాయిస్తుంది. మోదీ ప్రభుత్వం జాదవ్‌ను కాపాడడానికి ప్రయత్నించడం నైతిక విజయమవుతుంది.

ఇబ్బందికరమైన ప్రశ్నలేవీ తలెత్తకుండా భారత్ ఈ జాదవ్ ఎవరో తమకు తెలియదని చెప్పేయొచ్చు. కానీ అలా చేయలేదు. జాదవ్ గూఢచారి కాదని గట్టిగా వాదించింది కానీ, ఈ రిటైర్డ్ నౌకా దళాధికారి నిజంగానే సొంత పని మీద చాబహార్ పోర్టుకు వెళ్లాడా అన్నదానికి భారత్ సరైన సమాధానం చెప్పలేకపోతోంది. అతనెవరైనప్పటికీ భారత్ మాత్రం అతన్ని వదులుకోవడానికి సిద్ధంగా లేదన్న మాట మాత్రం నిజం. అతని పట్ల భారత్ సైనిక నిబద్ధతను ప్రదర్శించింది. జాదవ్‌ను కాపాడుకోవడానికి భారత్ చివరికి తన విదేశాంగ విధానాన్ని సైతం మార్చుకుంది. తనకు భారత్ పౌరుడే తప్ప ఇతర రాజకీయ వ్యూహాలు పట్టవని మోదీ తేటతెల్లం చేసుకోగలిగారు. ప్రతిపక్షాలు తన మీద నిందలు వేసే అవకాశాన్ని ఆయన ఇవ్వలేదు.

## పాకిస్థాన్‌పై తీవ్ర ఒత్తిడి

భారత్, పాకిస్థాన్ దేశాల మధ్య పచ్చగడ్డి వేస్తే మండిపోతున్న దశలో, మోదీ తన ధైర్యాన్ని నిరూపించుకున్నారు. పాకిస్థాన్ వంటి 'ఇష్టారాజ్య' దేశానికి తాను తల వంచేది లేదని స్పష్టం చేశారు. జాదవ్ విషయంలో కూడా పాకిస్థాన్ మూర్ఖంగానే వ్యవహరిస్తుందనడంలో సందేహం లేదు. కానీ కోర్టు తీర్పుకు వ్యతిరేకంగా ఆ దేశం సాహసం చేయకపోవచ్చనే అనుకోవాలి. కోర్టు తీర్పునకు సంబంధించినంత వరకూ పాకిస్థాన్ పరిస్థితి బలహీనమైపోయింది. తన పరిస్థితి ఏమిటో ఆ దేశానికి అర్థమైపోయింది. అక్కడి మీడియా, ప్రతిపక్షాలు ఈ కేసుతో వ్యవహరించడంలో పాకిస్థాన్ విదేశాంగ శాఖ




అధికారుల తీరు అధ్వానంగా ఉందని వ్యాఖ్యానించాయి. విదేశాంగ శాఖను పూర్తిగా ప్రక్షాళన చేయాల్సిన అవసరం ఉందని, అధికారులు సరైన సలహాలు, సూచనలు ఇవ్వడంలో విఫలమయ్యారని అవి విమర్శించాయి.

విదేశాంగ శాఖకు చెందిన ఓ సీనియర్ అధికారి మరో విధంగా తన అక్కసు వెళ్లబోసుకున్నారు. అంతర్జాతీయ న్యాయస్థానానికి చెందిన రిజిస్ట్రార్ కార్యాలయాన్ని భారత్ తెలివిగా తన వైపునకు తిప్పుకోగలిగిందని, కొన్ని దేశాలు కోర్టుకు వెళ్లే ముందే రిజిస్ట్రార్ కార్యాలయాన్ని 'మేనేజ్' చేసుకుంటుంటాయని ఆయన వ్యాఖ్యానించారు. ఇంత త్వరగా ఓ కేసును పరిష్కరించడం అంతర్జాతీయ న్యాయస్థానం చరిత్రలో అరుదని కూడా ఆయన అన్నారు. జాదవ్ గూఢచర్యం గురించి కోర్టు ఒక్క మాట కూడా మాట్లాడకపోవడం విచిత్రంగా ఉందని మరో అధికారి అన్నారు. స్టే ఇవ్వడం అనేది చాలా తేలికైన విషయమని, అంత మాత్రాన కేసు పరిష్కారమైనట్టు కాదని, తుది దఫా వాదనలు కోర్టు ముందుకు వచ్చినప్పుడు పాకిస్థాన్ దూకుడుగా వ్యవహరించడం, తన వాదనలు వినిపించడం ఖాయమని ఆయన తెలిపారు.

హేగ్ కోర్టు తీర్పులో ఓ లోపం కూడా కొట్టొచ్చినట్టు కనిపించింది. ఈ 11 మంది సభ్యుల బెంచి 'గడువు' కాలాన్ని లేదా కాల వ్యవధిని నిర్దేశించకపోవడం సమస్యే. ఫలానా రోజున ఈ రెండు దేశాల న్యాయ ప్రతినిధులూ కోర్టు ముందు హాజరు కావాలని కోర్టేమీ చెప్పలేదు. పాకిస్థాన్ కూడా తాము అంతర్జాతీయ కోర్టు సిఫారసులన్నిటికీ కట్టుబడి ఉంటానని చెప్పలేదు. తదుపరి సమావేశానికి తేదీని నిర్ణయించడం, ఉరి శిక్ష ఉండదనే హామీని పొందడం వంటి విషయాల్లో కోర్టు ఒక పక్కాగా వ్యవహరించి ఉంటే భారత్‌కు కాస్తంత తృప్తయినా మిగిలేది. ఉరి శిక్ష వేయమనే హామీని ఇవ్వాల్సిందిగా కోర్టు ఆదేశించింది కానీ, పాకిస్థాన్ ప్రతినిధి వర్గం అందుకు ఏమాత్రం స్పందించలేదు. గతంలో రెండు కేసుల్లో (జర్మనీ, పరాగ్వే) అమెరికా అంతర్జాతీయ న్యాయస్థాన తీర్పులను బేఖాతర్ చేసింది. పాకిస్థాన్ కూడా ఇదే విధంగా వ్యవహరిస్తుందా అన్నది ప్రశ్న. ముస్ముందు పాకిస్థాన్ ఎలా వ్యవహరించబోతోందో అంతుబట్టడం లేదు.

భారత్ మాత్రం ఆచితూచి వ్యవహరించాల్సి ఉంది. జాదవ్ ఇంకా పాకిస్థాన్ నిర్బంధంలోనే ఉన్నందువల్ల, భారతదేశం చాలా జాగ్రత్తగా నడుచుకోవాల్సి ఉంటుంది. భారత్ తన పౌరుడిని కాపాడుకోదలచుకున్న పక్షంలో ప్రతి మాటనూ ఆచితూచి ఉపయోగించాల్సి ఉంటుంది. సంబరాలు జరుపుకోవడానికి ఇంకా సమయం రాలేదు. ఇదివరకు భారత్ కూడా అంతర్జాతీయ న్యాయస్థానాన్ని అంతగా లెక్క చేయని సందర్భాలు ఉన్నాయి. ఇంతకూ, అంతర్జాతీయ న్యాయస్థాన ఆదేశాల ప్రకారం పాకిస్థాన్ జాదవ్ ఉరి శిక్షపై స్టే విధించిందా? లేదనే చెప్పాలి. కనీసం ఆగస్టు వరకైనా ఉరి శిక్ష ఆపాలని తాము పాకిస్థాన్‌ను ఆదేశించామని కోర్టు తెలిపింది. పాకిస్థాన్ అందుకు సంసిద్ధత వ్యక్తం చేయలేదన్నది అందరికీ తెలిసిన విషయమే. పాకిస్థాన్ సైనిక న్యాయస్థానం తీర్పు సరైన తీర్పు కాదని భారత్ విమర్శించడం తప్ప అంతకు మించి ఏమీ చేయగలిగిన స్థితిలో లేదు. జాదవ్‌ను అతని కుటుంబ సభ్యులతో చేర్చేవరకూ పాకిస్థాన్‌దే పైచేయి అన్నది అర్థం చేసుకోవాలి. జాదవ్‌ను విడిపించుకోవడానికి అంతర్జాతీయ స్థాయిలో ఎటువంటి చర్యలు తీసుకోవాలన్నది భారత్ నిర్ణయించుకోవాలి.

# స్కూలు వద్దు తాతా

-రావులపాటి సీతారాంరావు

**సువర్ణ వణుకుతున్నది! ఆ పిల్ల ధైర్యస్థురాలే! మాటకుమాట చెప్పే నేర్పరి. వయసు ఎనిమి దేళ్ళకు మించవుకానీ మా కాలనీలో సువర్ణ 'బస్తీ మే సవాల్' అంటే చాలు! ఆ ఈడు పిల్లలే కాదు కొంచెం పెద్దవారైనా వెనక్కి తగ్గాల్సిందే! అలాంటి పిల్ల ఎందుకో ఆ పరిసరాలు చూడ గానే బెదిరిపోయి వణుకుతున్నది!**

సువర్ణ ఎవరో కాదు, నా మనవరాలే! బాగా పేరున్న ఆ స్కూల్లో సువర్ణను చేర్పించటానికి తీసు కొచ్చాను. సువర్ణ అమ్మా నాన్నా అంటే నా కోడలూ కొడుకూ క్షణం కూడా తీరికలేని వృత్తుల్లో



ఉన్నారు. బాగా సంపాదిస్తున్నారు. కూతురైనా కొడుకైనా వాళ్ళకి సువర్ణ ఒక్కత్తే. ఇంట్లో దాని మాటే ఫైనల్! ఆ స్కూల్లో చేరాలని ముచ్చట పడు తున్నది! సువర్ణ ఆ స్కూల్లో చేరేందుకు మావాడు అతికష్టంమీద అప్లికేషన్ అయితే సంపాదించగలి గాడుగానీ అడ్మిషన్ సంగతి నాకు వదిలేశాడు. ఏదో గవర్నమెంటు ఉద్యోగం చేసి రిటైరైనవాణ్ణి. పుట్టినప్పటినుంచీ సువర్ణను ముద్దుచేస్తున్న వాణ్ణి, అందుకే ఆ పిల్ల నేనంటే ప్రాణం పెడ్తుంది. 'తాతా! నువ్వు వస్తేనే నేను స్కూల్లో జేరతా!' అంటే నేను ఎంతో గర్వంగా ఫీలయ్యాను. ఉద్యోగం వదిలిన తర్వాత నేను చేపట్టబోయే మొదటి అర్థవంతమైన కార్యక్రమం ఇదే కాబట్టి నాకు కూడా ఉత్సాహంగా ఉంది. అందుకే 'మీ పనులు మీరు చూసుకోండి. సువర్ణ స్కూలు సంగతి నాకు వదిలేయండి' అని ఎంతో ధైర్యంగా వాళ్ళకు చెప్పాను.

"నాన్నా! డొనేషన్, ఫీజ్ విషయంలో ఏం ఫర్వా లేదు. ఎంతైనా నో ప్రాబ్లెం! అడ్మిషన్ ముఖ్యం" మావాడు కొత్తగా సంపాదిస్తున్నవాడు. జీవితంలో డబ్బు ఏదైనా చేసి పెడ్తుందని నాకంటే ముందు గానే గ్రహించినవాడు! అందుకే ఆ భరోసా ఇచ్చాడు.

స్కూలు పరిసరాల్లోకి వచ్చిన తరువాత నాకు క్రమేపీ అర్థం కావటం మొదలైంది! స్కూల్లో పిల్ల లను చేర్చటం అంత సులువైన పని కాదని!

ఆదిలోనే హంసపాదు అన్నట్లు స్కూలు కాంపౌండులోకి అడుగుపెట్టటానికే నానా తంటాలు పడాల్సి వచ్చింది. ఆ ప్రహరీ జైలు గోడల్ని తలపి స్తుంది. పెద్దపెద్ద గేట్లున్నాయి కానీ అన్నీ మూసే ఉన్నాయి. లోపలికి పోవటానికి ఓ చిన్నగేటు! అదీ ఎవరైనా క్యూలో వెళ్ళాల్సిందే! క్యూ చాంతాడంత ఉంది. క్షణక్షణానికి పెరుగుతూనే ఉంది. దేశ సరిహ ద్దులను మించిన సెక్యూరిటీ ఉంది. చిన్నపిల్లలతో సహా అందరూ కేవలం ప్రమాదకరమైన నేరాలు చేయటానికే లోపలికి వెళ్తున్నారన్నట్లుగా అక్కడి సెక్యూరిటీ సిబ్బంది మిర్రిమిర్రి చూస్తూ అతి జాగ్ర త్తగా పంపిస్తున్నారు. నాకు ఒక్కక్షణం ఏమీ అర్థం కాలేదు. నేను చదువుకున్న స్కూళ్ళలోని వాతా వరణం ఇందుకు పూర్తి భిన్నంగా ఉండేది!

స్కూల్లోకి వెళ్ళటం అంటే మా ఇష్టారాజ్యమే! నేను మొదట్లో స్కూలుకు లేటుగా వెళ్తుండే వాణ్ణి! మా క్లాసు టీచర్ శర్మగారు 'అరేయ్ చూడండి! మనవాడు రాజువెడలె మాదిరి తీరిగ్గా వచ్చాడు!

వీడు క్లాసులోకి అడుగు పెట్టాడంటే చాలు! మొదటిగంట మోగినట్లే!' అని అనగానే పిల్లలంతా ఫక్కున నవ్వేవారు. ఆ తర్వాత శర్మగారే కొన్నాళ్ళకి 'స్కూలుకు లేటుగా రాకూడదు! నీకు జీవితంలో ప్రతిదీ లేటు అవుతుంది!' అని తీరిగ్గా మామూలుగా చెప్పాడు. ఆ క్షణంలో నాకు ఆ మాటలు పెద్దగా అర్థంకాలేదు కానీ తర్వాత్తర్వాత ఆయన మాటలే అనుభవంలో ఎంతో అర్థాన్ని చెప్పాయి!

లోపలికి వెళ్తే చాలు. సీటు దొరికింది అనే భావన ఈ స్కూలు వాతావరణం మాకు మొదట్లోనే కలిగించింది.

తాత స్థానంలో ఉన్నవాణ్ణి! అందులో ఒక హోదాతో రిటైరైన ఉద్యోగిని! క్యూలో, నన్ను గొప్పగా భావించే నా మనవరాలితో నిల్చొని లోపలికి వెళ్ళాలంటే మనసొప్పలేదు! కానీ పని ముఖ్యం కదా! అందుకే సువర్ణను క్యూలోపెట్టి నేను క్యూలో ఉన్నట్టు లేనట్టు యాక్ట్‌చేస్తూ ఓ రెండుగంటలు కాలక్షేపం చేశానుగానీ అడ్మిషన్ సంగతి దేవుడెరుగు మాకు లోపలికి వెళ్ళటానికే అంత శ్రమ పడినా అవకాశం లభించలేదు.

అతికష్టం మీద, నాకు తెల్సిన ఓ పోలీసాఫీసర్ సహాయంతో క్యూ రూల్స్ అతిక్రమించి స్కూలు లోపలికి అయితే చేరగలిగాం. ఆ పోలీసాయన కూడా వాళ్ళ బాస్ పిల్ల అడ్మిషన్ కోసం వచ్చినవాడే! అంతవరకే నాకు ఆయన అక్కరకు వచ్చాడుగానీ హెడ్ గదిలోకి వెళ్ళేందుకు ఆయన పరపతి పనిచేయలేదు. ఏం చేస్తాం! నేను, సువర్ణ బిక్కుబిక్కు మంటూ మమ్మల్ని ఎప్పుడు పిలుస్తారా అని ఎదురు చూస్తున్నప్పుడు సువర్ణ ఏడుపుమొహంతో 'నాకు ఈ స్కూలు వద్దు తాతా' అన్నది!

'తప్పు తల్లీ! అట్లా అనొద్దు. మొదటి రోజుల్లో పిల్లలందరికీ అలాగే అనిపిస్తుంది! అంత మాత్రం చేత స్కూలు వద్దనుకుంటే ఎలా? స్కూల్లో చేరినతర్వాత స్కూలు విలువ నీకు తెలుస్తుంది! క్రమేపీ చదువు ఒంటబట్టిన తర్వాత బళ్ళు మనకు గుళ్ళులాగా అనిపిస్తాయి తల్లీ!"

సువర్ణకు స్కూలుమీద వచ్చిన అయిష్టత పోగొట్టటానికి నేను ఆ విధంగా చెప్పాను గానీ నా మాటలు నాకే నమ్మకం కలిగించలేదు.

పక్కనే కూర్చున్నాయన మమ్మల్ని పలకరిస్తున్నట్లుగా, 'మీ మనవరాలా? క్యూట్‌గా ఉంది. మా పిల్లలు కూడా ఇక్కడే చదువుతున్నారు. పరీక్షల్లో మార్కులు తక్కువ వచ్చాయని పిల్లలతో పాటు మమ్మల్ని కూడా రమ్మన్నారు, మేమేదో పిల్లలతోపాటు పరీక్షలు రాసినట్లు! ఇప్పుడు మీ అమ్మాయికోసం ఇంతగా కష్టపడుతున్నారుగా! అడ్మిషన్ తర్వాత అసలుకథ మొదలవుతుంది' అన్నారు. నడి వయసులో ఉన్న ఆయన ముఖం స్కూల్‌మీదున్న కోపంతో కందగడ్డలా మారింది. సువర్ణ మరింతగా బిక్క మొహం వేసింది. నేను ఆ ఇబ్బందిని కనపడనీయకుండా 'అదేమిటి? పదో తరగతి దాకా పాస్, ఫెయిల్ ఉండవని విన్నానే' అన్నాను.

"మనం వినటంవరకేనండీ, పిల్లలకు ఫీజులు మనమే కట్టాలి! డొనేషన్లు మనమే ఇవ్వాలి! చదువులు మనమే చెప్పాలి. హోంవర్క్ మనమే చేయించాలి! పిల్లలు చేయకపోతే మనమే చేయాలి! చివరకు పరీక్షలు (నెలనెలా పెట్టేవిగాక) అయినతర్వాత మీ పిల్లకు ఇందులో మార్కులు తక్కువ వచ్చాయి! అందులో ఇంప్రూవ్‌మెంట్ అవసరం!

**ఓ రిటైర్డ్ తాతయ్యకు ఒకేఒక ముద్దుల మనవరాలు. ఆ స్కూల్లోనే జేరతానంటూ ఎంతో ముచ్చటపడింది. కొడుకూ కోడలూ బాగా సంపాదించే వృత్తిలో బిజీగా ఉంటారాయె. మనవరాల్ని ఆ స్కూల్లో జేర్చే బాధ్యత తీసుకోక తప్పలేదా తాతగారికి. తీరా వెళితే అతడి నలభైఏళ్ళ అనుభవం ఎందుకూ కొరగాకుండా పోయింది. ఇంతకీ స్కూల్లో ఏం జరిగింది? అతని మనవరాలికి సీటు దొరికిందా లేదా?**

— బి.పి.యస్

# అతగాడితో చేస్తుందట!

నయన విషయంలో కోలీవుడ్ తమ్ముళ్ళు మల్ల గుల్లాలు పడుతున్న విషయం ఇది. ఇంతకీ అసలు సంగతేమిటంటే....కోలీవుడ్‌లో తాజాగా ఓ వార్త హల్ చల్ చేస్తోంది. మాజీ లవర్ ప్రభుదేవాతో నయన ఓ సినిమా చేయబోతోందట! ఇంతకు ముందు మరొక మాజీ లవర్ శింబుతో సినిమా చేసింది, ఇప్పుడు కూడా ప్రభుదేవాతో సినిమా చేయబోతోంది అంటున్నారు. ప్రభుదేవాతో విడిపోయిన సందర్భంలో నయన ఓ మాట చెప్పింది. ఈ రంగంలో ఎవరితోనైనా నటిస్తాను కానీ అతగాడితో (ప్రభు దేవా) మాత్రం నటించను అని స్పష్టం చేసింది. ఇంతకాలం ఆ మాట మీదే నిలబడింది కూడా! కాక పోతే వీరిద్దరితో సినిమా చేయడానికి దర్శకనిర్మాతలు ఉత్సాహం చూపారట! వారి ఉత్సాహం చూసి నయన కూడా ఏ విషయం తేల్చలేకపోతోందట! మౌనం అర్ధాంగీకారం కనుక నయన ఆ సినిమా చేస్తుందనే అంటున్నారు.

లాభంలేదు ఫలానా చోట ఐ.క్యూ. టెస్ట్ పెట్టాం. ఫీజుకట్టి వాళ్ళ రిపోర్టు తీసుకురండి! పైక్లాసులో పడేసేదీ లేనిదీ అప్పుడు చూస్తాం! అంటారు. స్కూల్లో పిల్లల్ని చేర్చినప్పుడే మనం బొక్కబోర్లాపడ్డ సంగతి అనుభవంమీద మనకు తెలిసి వస్తుంది" ఆ మాటలు చెప్తున్నప్పుడు ఆయన కోపం క్రమేపీ నిర్వేదంగా మారింది. ఏం మాట్లాడాలో తెలియక "మరి టీచర్లు, హెడ్ ఏం చేస్తారు? ఇవన్నీ మనం చేస్తే" అన్నాను.

"వాళ్ళు ఎంచక్కా క్రమం తప్పకుండా పేరెంట్స్ మీటింగ్స్ పెడతారు. మనకు ఏం చెయ్యాలో, ఏం చెయ్యకూడదో చెబుతారు. ఆ సమావేశానికి మనం హాజరుకాకపోతే మెమోలు ఇస్తారు. మన ఉద్యో గాల్లో కూడా ఇంత బాసిజం ఉండదు" చెప్పటం ఆపుచేసి ఎవరో టీచర్ అతన్ని చూసి సైగచేస్తే పిల్ల లతో సహా అటు పరుగెత్తినంత పనిచేశాడు.

ఇంతలోనే 'సువర్ణా' అంటూ మెయిన్ రూం లోంచి పిలుపు వచ్చింది.

సువర్ణను ఎత్తుకొని తీసుకుని పోవాల్సి నంత పరిస్థితి ఏర్పడింది. నాలో కూడా సడెన్‌గా వచ్చిన ముసలితనం ఫీలింగ్‌ను అణిచిపెట్టి ఆ సింహం బోనులోకి అడు గుపెట్టా. కూర్చున్న ఆవిడ నిండుగా ఉంది. మమ్మల్ని చూడకుండానే 'సీటు కష్టం! అడ్మిషన్ కచ్చితంగా వస్తుందని చెప్పలేను' అధికార స్వరంతో చెప్పింది.

నేను కూర్చోవాలో లేదో అర్థంకా లేదు. మావైపు చూడమన్నట్లుగా ఆమెను ప్రాధేయ పడుతూ 'మేడం! సువర్ణ తెలివిగల పిల్ల! మీ అంచనాల మేర చదువుకుంటుంది' అన్నాను. అప్పుడు తలెత్తి నన్నూ, సువర్ణనూ నిశి తంగా చూసింది. ఆ చూపులకు సువర్ణ బెంబేలె త్తింది.

'పక్కగదిలో పరీక్ష పెడతారు. ఆ పరీక్షపాసైతే బిల్డింగ్‌ఫీజ్ చెల్లించడానికి అభ్యంతరం లేకపోతే సీటు సంగతి తెలియపరుస్తాం' పొదుపుగా మాట్లా డటం ఆమె నైజం అని తెలిసిపోయింది. మేమి ద్దరం ఆ గదిలోంచి బయటపడ్డాం. నా నలభైఏళ్ళ అనుభవం ఆమె ముందు ఎందుకూ పనికి రాకుండా పోయింది. చదువుకు విలువకట్టటం ఆమెకు తెలుసు! మాకు స్కూళ్ళల్లో నేర్పింది చదువు విలువ మాత్రమే!

పరీక్షకోసం పక్కగదిలోకి వెళ్ళాం. ఆ గదిలో సువర్ణకు ఇచ్చిన ప్రశ్నాపత్రాలుచూసి అవాక్క య్యాను. ఎనిమిదేళ్ళ పిల్లకు ఇచ్చే ప్రశ్నాపత్రం. సివిల్ పరీక్షల్లోనే పదవతరగతి బేస్‌గా తీసుకుంటు న్నారు. ఇక్కడ మాత్రం ప్రైమరీక్లాసుకే పదవతర గతి కంటే ఎక్కువ స్టాండర్డ్ ఉన్న పరీక్ష పెడుతు న్నారు. ఆ క్షణంలో నన్ను ఆ పరీక్ష రాయమంటే గ్యారంటీగా ఫెయిల్ కావటం ఖాయం!

ఇద్దరం ఆ గదిలోనుంచి బ్రతుకుజీవుడా అను కుంటూ బయటపడ్డాం. సువర్ణ పరీక్ష ఏ విధంగా రాసిందో నేను అడగలేదు. ఎందుకంటే, ఆ స్కూల్లోంచి బయటపడటమే మాకు పెద్ద పరీక్షగా మారినందువల్ల!

ఆ రాత్రి సువర్ణ ప్రశాంతంగా నా పక్కన పడు కుని 'తాతా! రామాయణం, భారతం ఇంకా ఎన్నో కథలు చెప్పావుకదా! చదువంటే నేను కథలాంటిద నుకున్నాను. స్కూలు పిల్లలందరితో ఆడుకోటం, పాడుకోటం, చదువుకోటం అనుకున్నాను. నాకు ఆ స్కూల్లో చదువు వద్దు తాతా! నువ్వే నాకు చదువు చెప్పు! ఎంతకష్టమైనా హాయిగా చదువుకుంటాను' అంది. గోడమీద రవీంద్రనాథ్ ఠాగూర్ ఫొటో వెలు గులుచిమ్ముతూ ప్రస్తుత విద్యావిధానాన్ని వెక్కిరి స్తున్నట్లుగా కనపడింది.

**సెల్:98480 33150**



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'గౌట్' వ్యాధి నివారణ సులభం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మానవ శరీరంలోని ఏ కదలికలోనైనా కీళ్ళు అత్యంత ప్రధానమైన పాత్ర పోషిస్తుంటాయి. ఇంతటి ప్రాధాన్యం సంతరించుకున్న కీళ్ళలో ఎటువంటి చిన్న సమస్య ఏర్పడినా అది ఆయా కదలికలను కష్టతరంగా మార్చడమే కాకుండా రోజువారీ దినచర్యల నిర్వహణలో సైతం తీవ్ర ఇబ్బందులను కలుగజేస్తుంది. అలాంటి వాటిలో గౌట్ వ్యాధి కూడా ఒకటి. ఇది ముఖ్యంగా కాలి బొటనవ్రేలు ప్రాంతంలో ఎక్కువగా ఏర్పడుతుంది. దీని వలన ఏర్పడే తీవ్రమైన నొప్పి, సలపరం, మంటతో పాటుగా వాపు తలెత్తటం వలన ఆ కీళ్ళకు సంబంధించిన ఏ కదలికైనా భరించలేనంత నొప్పితో కూడుకుని ఉంటుంది. ఈ వ్యాధి తరచూ ఏర్పడేదిగా ఉండటమే కాకుండా, దీనికి సరైన చికిత్సను అందించకుండా నిర్లక్ష్యం వహించినట్లయితే ఇది కీళ్ళను పూర్తిగా దెబ్బ తీసే ప్రమాదం ఉంటుంది.




**'గౌట్' లేదా 'గౌటీ ఆర్థరైటిస్' అనగా:-** సాధారణంగా మన రక్తంలో 'యూరిక్ ఆమ్లం' అనే రసాయనం ఉంటుంది. ఇది ఉండవలసిన మోతాదు కంటే ఎక్కువగా ఉన్నప్పుడు, స్ఫటికాల రూపంలో కీళ్ళలోకి వచ్చి చేరుతుంది. ఈ విధంగా యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు కీళ్ళలో ఎక్కువగా పేరుకుపోయినప్పుడు కీళ్ళ సంబంధిత కదలికలన్నీ కష్టతరంగా మారుతాయి. దీనినే మనం 'గౌట్' లేదా 'గౌటీ ఆర్థరైటిస్' అని అంటాము.

**కారణాలు:** ఈ వ్యాధి ముఖ్యంగా ప్యూరిన్స్ ఎక్కువగా ఉండే ఆహారం – లివర్, మాంసము, పుట్ట గొడుగులు, స్వీట్ బ్రెడ్ మరియు మద్యం వంటివి అధికంగా తీసుకున్నప్పుడు యూరిక్ ఆమ్లం స్థాయిలు పెరగటంతో, అలాంటి పరిస్థితి గౌట్ వ్యాధికి దారితీస్తుంది. • అధిక బరువు, మధుమేహం, అధిక రక్తపోటు మరియు కొలెస్ట్రాల్ అధికంగా ఉండటం వంటివి ఈ వ్యాధి రావడానికి కారణాలు కావచ్చు.

**లక్షణాలు:** తీవ్రతను బట్టి గౌట్ లక్షణాలు చాలా ప్రస్ఫుటంగానే కనిపిస్తాయి. ఈ సమస్య ఎక్కువగా కాలి బొటన వ్రేలులో కనిపిస్తుంది. ఉదయాన్నే నిద్ర లేచినప్పుడు గానీ లేదా అర్థరాత్రి సమయంలో గానీ బొటన వ్రేలులో విపరీతమైన నొప్పి, సలపరం, మంటగా ఉండటంతో పాటు వాపు కనిపిస్తుంది, మరియు ఆ ప్రాంతమంతా ఎర్రగా కందిపోయి ఉంటుంది. ఇలాంటివన్నీ గౌట్ వ్యాధిలో కనిపించే ప్రధాన లక్షణాలు. • మొదట్లో ఈ వ్యాధి ఒకటి లేదా రెండు కీళ్ళకు మాత్రమే పరిమితమైనప్పటికీ – దీన్ని నిర్లక్ష్యం చేస్తే ఇది దీర్ఘకాలికంగా మారి ఇతర కీళ్ళకు కూడా వ్యాపించి, వాటిని కూడా తీవ్రంగా దెబ్బ తీసేందుకు అవకాశముంటుంది. కాబట్టి తగిన జాగ్రత్తలతో పాటు సరైన చికిత్స తీసుకోవడం ద్వారా ఈ సమస్య నుండి కీళ్ళను కాపాడుకోవచ్చు.

**రోగ నిర్ధారణ పరీక్షలు:** రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉన్నంత మాత్రాన గౌట్ ఉన్నట్లుగా నిర్ధారించరాదు. యూరిక్ ఆమ్లం రక్తంలో అధికంగా ఉండటంతో పాటు, కీళ్ళలో ఆర్థరైటిస్ లక్షణాలు కూడా ఉన్నట్లయితే దానిని తప్పనిసరిగా 'గౌట్'గా నిర్ధారించుకోవాలి. అలాగే మరికొన్ని ఇతరత్రా సందర్భాలలో కూడా రక్తంలో యూరిక్ ఆమ్లపు శాతం ఎక్కువగా ఉండవచ్చు. ఉదాహరణకు సోరియాటిక్ ఆర్థరైటిస్, కిడ్నీ ఫెయిల్యూర్, లుకేమియా వంటి సమస్యలు తలెత్తినప్పుడు కూడా రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉంటుంది. • **రక్తపరీక్ష** (రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉండటం, ఈయస్ఆర్ స్థాయిలు పెరగడం), ఎక్సరే (మృదు కణజాలంలో వాపు కనిపిస్తుంది) • కీళ్ళలోని ద్రవం తీసి పరీక్షించడం మొదలైన పరీక్షల ద్వారా వ్యాధి నిర్ధారణ చేయబడుతుంది. **ఆహార నియమాలు:** గౌట్ వ్యాధి బాధితులు మాంసకృత్తులు తినటం బాగా తగ్గించాలి. ముఖ్యంగా హైప్యూరిన్ డైట్ తీసుకోకూడదు. **మాంసకృత్తులు (ప్రోటీన్లు) 2 రకాలు.** అవి (1) **ప్యూరిన్స్**, (2) పిరమిడైన్స్. గౌట్ బాధితులు ప్యూరిన్స్ రకం ప్రోటీన్లు ఎక్కువగా తీసుకోరాదు. **మాంసాహారాలు:** మేక, గొర్రె, బీఫ్ వంటివి తినరాదు. **జంతు అవయవాలు:** లివర్, కిడ్నీ, ఎముకల మూలుగు, పేగులు మొ॥వి తినరాదు. **శాకాహారాలు:** పాలకూర, క్యాబేజీ, క్యాలీఫ్లవర్, చిక్కుళ్ళు, వివిధ రకాల బీన్స్, పుట్ట గొడుగులు మొ॥వి తగ్గించాలి. ఆల్కహాల్ తదితరాలకు దూరంగా ఉండాలి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్య విధానంలో గౌట్ వ్యాధి నివారణ నిమిత్తం ఉత్తమ చికిత్స అందుబాటులో ఉంది. ఈ చికిత్సా ప్రక్రియ ద్వారా రోగి యొక్క శారీరక మరియు మానసిక స్థితిగతులను క్షుణ్ణంగా విచారించి, వాటికి అనువైన చికిత్స ఇవ్వడం జరుగుతుంది. అంతేకాకుండా, కీళ్ళలో యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు ఏర్పడకుండా చూసి, రక్తప్రసరణలోని వివిధ రసాయనాల సమతుల్యతను కాపాడటం ద్వారా గౌట్ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in



# మనసుగతి ఇంతే! 7

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**సోమవారం సాయంత్రం ఆరుగంటలైంది. వినయ్ డాక్టర్ జలజ కన్సల్టింగ్ రూంలో, ఆమె ఎదురుగా కూర్చున్నాడు. జలజ వినయ్ వైపు చిరునవ్వుతో చూసింది.**

**'మిస్టర్ వినయ్, మీరు సప్లై చేసిన విషయాల్నీ, సంధ్య నుంచి సేకరించిన ఇన్‌ఫర్మేషన్‌నీ ఆధారంగా చేసుకుని డాక్టర్ జాన్‌డేవిడ్‌గారూ, నేనూ ఒక అభిప్రాయానికి వచ్చాం. మా అనాలిసిస్ ఫలితాన్ని మీకు వివరించమని డాక్టర్ గారు నాకు చెప్పారు.."**

**వినయ్ చెప్పమన్నట్టు చూశాడు.**

డాక్టర్ జలజ తన ముందున్న ఫోల్డర్ని ఒకసారి చూసి, వినయ్ వైపు తల ఎత్తింది. "సమస్య మీ తొలిరాత్రితో ప్రారంభమైంది. అక్కడ ప్రారంభించి ఒకటి తర్వాత ఒకటిగా అన్ని అంశాలూ డిస్కస్ చేశాం. మీ తొలిరాత్రి సంధ్య గదిలోకి వస్తూ స్పృహతప్పి పడిపోయింది. డాక్టర్లు దాన్ని టెంపరరీ ఫెయింటింగ్ అన్నారు. బీపీ నార్మల్‌గా ఉందనీ, బ్రెయిన్‌కు బ్లడ్ సప్లయ్ సవ్యంగా ఉందనీ చెప్పారు.."

"ఔను" వినయ్ గుర్తు చేసుకుంటూ అన్నాడు.

"సాధారణంగా అలా స్పృహ కోల్పోయిన సందర్భాలలో బీపీ పడిపోతుంది. నార్మల్‌గా ఉండదు."

"అయితే.." వినయ్ ఏదో అడగబోయాడు.

"అది ఫెయింటింగే అయితే బీపీ కచ్చితంగా పడిపోవాలి. బీపీ పడిపోలేదంటే అది రియల్ ఫెయింటింగ్ కాదు.."

"డాక్టర్.."

"ప్లీజ్ మిస్టర్ వినయ్, అడ్డురాకండి. జాగ్రత్తగా ఏకాగ్రతతో వినండి!" డాక్టర్ జలజ అంది. "ఆ రోజు సంధ్యకు స్పృహ తప్పలేదు. తప్పినట్టు నటించింది అని మా నమ్మకం.

'ఇంక మీ సెకండ్ ఫస్ట్‌నైట్ సందర్భంలో సంధ్య కణతలు నొక్కుకుంటూ బాత్‌రూంలోకి పరుగెట్టింది. మీరు వెళ్ళేసరికి వాంతి చేసుకుంటోంది. అవునా?"

"ఔను.."

"వాంతి ఏ రంగులో ఉంది?"

"నేను చూడలేదు."

"ఎందుకు చూడలేదు?"

"సింక్ ముందు వంగి సంధ్య వాంతి చేసుకుని కుళాయి తిప్పి ఫ్లష్ చేస్తోంది. ఆమె శరీరం నాకు అడ్డుగా ఉంది. అందువల్ల చూడలేకపోయాను."

"సరే. రంగు గురించి మరిచిపోండి. ఆమె వాంతి చేసుకోవడం మీరు చూశారా?"

"లేద"ని చెప్పాడు.

"ఆమె వాంతి చేసుకోలేదు; చేసుకున్నట్టు నటించింది."

"డాక్టర్!" వినయ్ కళ్ళు ఆశ్చర్యంతో గిన్నెల్లా అయ్యాయి.

'అలా అనుమానించడానికి కారణం ఉంది. తరువాత చెప్తాను" డాక్టర్ జలజ అంది. "ఇప్పుడు అమెరికాలో మీ ఫ్రెండింటికి వెళ్దాం. ఆ రాత్రి కూడా సంధ్య వాంతి చేసుకుంది. వాళ్ళ ఇంట్లో ఉన్నన్ని రోజులూ తనని ఒంటరిగా వదిలేయమంది, అవునా?"

"ఔను."

"ఆ రాత్రి కూడా ఆమె వాంతి చేసుకున్నట్టు నటించింది. డాక్టర్ దగ్గరకు వెళ్ళడానిక్కూడా ఒప్పుకోలేదు. అందుకే! మిగిలిన రాత్రులూ వాంతుల నాటకం ఆడటం ఇష్టం లేక అక్కడున్నన్ని రోజులూ ఒంటరిగా వదలమంది! వాంతుల నాటకం ఆడటం ఆమెకు ఎందుకు ఇష్టం లేదో తెలుసా, మిస్టర్ వినయ్?"

"తెలీదు.." వినయ్ ఆశ్చర్యాన్ని అణచుకుంటూ అన్నాడు.

"మళ్ళీ వాంతులయితే మీరు ఊరుకోరు! బలవంతంగా డాక్టర్ వద్దకు తీసుకెళ్తారు. అది సంధ్యకు ఇష్టం లేదు. తన నటన బైటపడుతుందన్న భయం!" డాక్టర్ జలజ ఫోల్డర్ పేజీ తిరగేస్తూ అంది. "ఇక మీ చేత శానిటరీ న్యాప్‌కిన్స్ తెప్పించడం, పీరియడ్స్ సిగ్నల్, మరో మూడు రోజులు మిమ్మల్ని దూరంగా ఉంచడానికి ఆడిన నాటకం! ఆమె పీరియడ్స్ సైకిల్



ఋతుచక్రం ఆమె ఆడింది నాటకమని రుజువు చేస్తున్నాయి.

"ఇప్పుడు మీ అపార్ట్‌మెంట్ బెడ్‌రూం ఎపిసోడ్. మిమ్మల్ని చూసి కెవ్వుమంటూ మంచం మీంచీ దూకి, గది మూలకి పరిగెత్తి, వణికిపోతూ కూచుని, దగ్గరగా రావద్దనీ, ముట్టుకోవద్దనీ గోల చేసింది.."

"ఎస్..."

"సంధ్య ఆ రాత్రి నిద్ర నటించింది. భయాన్ని నటించింది. హిస్టీరియాను నటించింది. ఆ నటనని మీరు చూడాలన్న ముందుచూపుతోనే గది తలుపు లోపల్నుండీ లాక్ చేయలేదామె.."

"నమ్మశక్యంగా లేదు!" వినయ్ వణికే కంఠంతో అన్నాడు.

"ఇలాంటి కేసులు అలాగే ఉంటాయి. మా ప్రశ్నలకి సంధ్య చెప్పిన సమాధానాల ఆధారంగా కొన్ని విషయాలు తెలుసుకున్నాం. సైకో అనాలిసిస్ ఫలితం. నేను చేసిన ఫిజికల్ ఎగ్జామినేషన్ కూడా మా అభిప్రాయాన్ని బలపరుస్తోంది.." డాక్టర్ జలజ మరో పేజీ తిప్పింది. వినయ్ ఆత్రుతగా చూస్తున్నాడు.

"సంధ్యకు పెళ్ళికి ముందు ఏ పురుషుడితోనూ సంబంధం లేదు. ప్రేమ వ్యవహారం ఉన్నట్టు కూడా మేం అనుమానించడం లేదు. తల్లిదండ్రులు వేసిన బాటలో ప్రయాణించే తత్వం ఆమెది.."

"డాక్టర్.. అడ్డొస్తున్నా, క్షమించండి" వినయ్ కుర్చీలో ముందుకు వాలుతూ అన్నాడు. "ఆమె వాంతులు చేసుకున్నది నిజమే అనీ, అవి మామూలు వాంతులు కావనీ, వేవిళ్ళు కావచ్చునీ..." డాక్టర్ జలజ తల అడ్డంగా ఊపుతూ, వినయ్‌ని ఆపింది. "ఇంపాజిబుల్. ఆ అవకాశం లేదు. ఎందుకంటే సంధ్య ఇంకా కన్యే. ఆమె శరీరాన్ని నేను క్షుణ్ణంగా పరిశీలించాను. సందర్భం వచ్చింది కాబట్టి చెబుతున్నాను. సంధ్య శారీరకంగా, చక్కగా ఆరోగ్యంగా ఎదిగిన యువతి. ఆమె బాహ్యావయవాలు ఎదిగి ఉన్నట్టే ఆమె జననేంద్రియం చక్కగా పరిణతి చెంది ఉంది. పురుష సాంగత్యం పొందడానికీ, సంతానాన్ని కనడానికీ ఆమె శారీరకంగా సర్వసన్నద్ధంగా ఉంది! మళ్ళీ చెప్తున్నా; షీ ఈజ్ ఫుల్లీ రెడీ టు టేక్ ద హజ్బెండ్; ఫుల్లీ రెడీ టు గివ్ బర్త్ టు కిడ్స్!"

వినయ్ కుర్చీలో వెనక్కి వాలాడు. మళ్ళీ ముందుకు జరిగి టేబుల్ మీద చేతుల్ని మోపాడు. తదేకంగా డాక్టర్‌ని చూశాడు. "డాక్టర్ ఒక ప్రశ్న అడగవచ్చా?"

"అడగండి"

"ఒక్కసారి సింహావలోకనం చేసుకుంటే ఫస్ట్ నైట్ స్పృహ తప్పడం నాటకం. రెండవరాత్రి వాంతులు నాటకం. ఇక్కడ మా మిత్రుడి ఇంట్లో వాంతి నాటకం. పీరియడ్స్ నాటకం. నాకోసం ఎదురుచూస్తోందని నేను అనుకున్న రాత్రి హిస్టీరియా నాటకం. సంధ్య ఇన్ని నాటకాలు ఎందుకు ఆడింది?" వినయ్ డాక్టర్ జలజ ముఖంలోకి సూటిగా చూశాడు.

"మిమ్మల్ని దూరంగా ఉంచడానికి! శారీరకంగా మీకు దగ్గరవకుండా ఉండటానికి!"

"నేనంటే తనకి చాలా ఇష్టం. ఆమె అంటే నాకు ప్రాణం."

డాక్టర్ జలజ చిన్నగా నవ్వింది. "సంధ్యకు మీకంటే తనంటేనే తనకు ఎక్కువ ఇష్టం! అమ్మా నాన్నా మీ చేత తాళి కట్టించుకొమ్మన్నారు. కట్టించుకుంది. అది మరిచిపోకండి!"

వినయ్ బరువుగా నిట్టూర్చి దీనంగా చూశాడు.

## జరిగిన కథ

ఒకదాని తరువాత ఒకటిగా కంప్యూటర్ స్క్రీన్‌మీద ఫోటోలు జరిగిపోతున్నాయి. అన్నీ సంధ్య ఫోటోలే! ఆమెనే చూస్తూ గతంలోకి జారుకుంటాడు వినయ్. అమెరికాలో ఉన్న వినయ్ ఇండియా వచ్చి సంధ్యని పెళ్ళి చేసుకుంటాడు. శోభనం రాత్రి గదిలోకి అడుగుపెట్టిన సంధ్య ఒక్కసారిగా కుప్పకూలిపోతుంది. డాక్టర్లు ఆమెకేమీ సమస్య లేదని చెబుతారు. ఆ తరువాత రెండోసారి ఏర్పాటుచేసిన మొదటిరాత్రి, అమెరికా వెళ్ళిన తరువాత కూడా ఇద్దరూ దూరంగానే ఉంటారు. ఏంచేయాలో అర్థంకాక తన పరిస్థితిని కిరణ్‌తో చెబుతాడు. అతడు సెక్సాలజిస్ట్ దగ్గరకు వెళ్ళమని సలహా ఇస్తాడు. సంధ్యని ఒప్పించి డాక్టర్ జాన్‌డేవిడ్ దగ్గరకి తీసుకెళతాడు. ఫిజికల్ టెస్టులు అయ్యాక, వారిద్దరినీ విడివిడిగా ప్రశ్నిస్తాడు డాక్టర్. **ఆ తర్వాత....**



# అంతగా దిగజారాలా?



అవకాశాల కోసం ఎంతకైనా దిగజారుతుంటారు కొందరు సినీతారలు. ఇప్పుడు వారి జాబితాలోకి ప్రియాంకా చోప్రా చేరనుంది అంటున్నారు బాలీవుడ్ జనాలు. ప్రియాంక హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత అక్కడి వారిని ఆకట్టుకోవడానికి పలు వేషాలు వేసింది....వేస్తోంది. ఈ విషయంలో ఆమెను ఎవరూ తప్పు పట్టడం లేదు. ఎందుకంటే అక్కడ క్లిక్ కావాలంటే కొన్ని పనులు తప్పనిసరి అని సరిపెట్టుకున్నా తాజాగా ప్రియాంక తీసుకున్న ఓ నిర్ణయం మాత్రం బాలీవుడ్ జనాలకు అస్సలు నచ్చడం లేదట! ప్రియాంక హాలీవుడ్ మూవీ బేవాచ్ త్వరలో విడుదల కానుంది. ఈ సందర్భంగా ఆ సినిమా మేకర్స్ ప్రియాంకతో ఓ న్యూడ్ షూట్ నిర్వహించాలని భావించారట! దీనికి ఏ మాత్రం అడ్డు చెప్పకుండా ప్రియాంక ఓకే అనేసిందట! ఇప్పుడు ఇదే బాలీవుడ్‌లో హాట్ టాపిక్ అయింది. మామూలుగా ప్రియాంక ఏం చెబితే బాలీవుడ్ మేకర్స్ దానికి సై అనే వారు. ఇప్పుడు సీన్ రివర్స్ అవడమే కాకుండా దానికి ప్రియాంక ఒప్పుకోవడం కొందరికి నచ్చడం లేదట! ఆఖరికి బాలీవుడ్‌లో ఆమె అభిమానులు సైతం ఆమె నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నారట!

“మిస్టర్ వినయ్, మీతోనే కాదు సంధ్యకు ఏ పురుషుడితోనూ లైంగికానుభవం ఇష్టం లేదు..”

వినయ్ నివ్వెరపాటుతో చూస్తూ ఉండిపోయాడు. “అలాగని మీకు చెప్పిందా?” బొంగురుగా అడిగాడతను.

“చెప్పకనే చెప్పింది. మేం చేసేది మాటల విశ్లేషణ మాత్రమే కాదు; మనో విశ్లేషణ కూడా!” డాక్టర్ జలజ నవ్వుతూ అంది. బేసిక్‌గా సంధ్య సెక్సువల్ ఇంటర్‌కోర్స్‌కి పూర్తిగా విముఖంగా ఉంది.”

“అందుకు కారణం కనిపెట్టారా డాక్టర్?”

“అఫ్‌కోర్స్!”

“ఏమిటా కారణం?”

“ఫ్రిజిడిటీ. మన తెలుగులో జడత్వం.”

“అంటే ఏమిటి డాక్టర్?” వినయ్ కంఠం వణికింది.

“ఒక శారీరకమైన, మానసికమైన రుగ్మత. సిగ్మండ్ ఫ్రాయిడ్ కాలం నుంచీ కూడా ఫ్రిజిడిటీ అనేది ప్రధానంగా స్త్రీ రుగ్మతగానే గుర్తించబడింది. జడత్వం అంటే చలనం లేకపోవడం. పురుషుడితో శారీరకమైన కలయికపట్ల ఇచ్ఛ లేకపోవడం. కోరిక లేకపోవడం మానసికం. లైంగిక అనుభవానికి తగిన విధంగా శరీరం స్పందించకపోవడం శారీరకం. ఈ రుగ్మతకు శరీర అవయవాల సౌష్టవంతోగానీ, అందచందాలతో గానీ పనిలేదు. ఫ్రిజిడిటీ రుగ్మత ఉన్న స్త్రీ ఒక కరగని మంచుముద్ద అని చెప్పుకోవచ్చు.”

“డాక్టర్ ఈ రుగ్మతకు కారణం?” వినయ్ అడిగాడు.

“ఒకటని కాదు; కారణాలు చాలా ఉంటాయి!” డాక్టర్ చిరునవ్వుతో అంది. “స్త్రీ పురుషుల శరీరాల కలయిక పాపమన్న మూఢవిశ్వాసం, కలయిక అంటే అసహ్యం; భయం; అభద్రతా భావం; పురుషులంటే ద్వేషం; పురుష జననాంగద్వేషం ఇలా ఎన్నో కారణాలు ఉన్నాయి. సామాజికమైన కారణాలూ ఉన్నాయి.”

“సంధ్య జడత్వానికి మీరు కనిపెట్టిన కారణాలు చెప్తారా?” వినయ్ అడిగాడు.

“స్త్రీపురుషుల కలయిక అపరాధమనో, పాపమనో భావించే మూఢవిశ్వాసం సంధ్య జడత్వానికి కారణం కాదు. ఎందుకంటే ఆమె జన్మించిన కుటుంబం, పెరిగిన వాతావరణం, చదువు, సంస్కారం అంధవిశ్వాసాలకు అవకాశం ఇచ్చేవి కావు.

మా అనాలిసిస్‌ను ఆధారంగా చేసుకుని సూటిగా, క్లుప్తంగా చెప్తాను. మీరు ఎంత తెలుసుకోవాలో అంతే చెప్తాను. సంధ్య జడత్వానికి రెండు అంశాలు కారణాలు కావచ్చని డాక్టర్‌గారూ, నేనూ తీర్మానించాం. ఒకటి సెక్స్ అంటే అసహ్యం. రెండు సెక్స్ అంటే భయం.”

“డాక్టర్‌గారూ, ఇక్కడొక సందేహం..” వినయ్ డాక్టర్ జలజ వాక్ ప్రవాహానికి అడ్డొస్తూ అన్నాడు. “పురుషులంటే అసహ్యమో, భయమో ఉండకూడదా?”

“ఉంటే, ఆమె మిమ్మల్ని పెళ్ళి చేసుకునేదే కాదు.” డాక్టర్ జలజ నవ్వింది. “మా అంచనా ప్రకారం, ఆమె చెప్పిన విషయాల ప్రకారం సెక్సంటే అసహ్యమూ, భయమూ ఆమెలో వేళ్ళూనుకున్నాయన్న నమ్మకం మాకు కలిగింది.”

“ఆ అసహ్యానికీ, భయానికీ కారణాలు?”

“సులభంగా ఊహించగలం. కల్లాకపటం ఎరగని బాల్యంలో, స్త్రీ అంటే ఏమిటో, పురుషుడంటే ఏమిటో, స్త్రీ పురుషుల అవయవాల ఉద్దేశం ఏమిటో తెలియని పసివయసులో ఎవడైనా తన మీద అఘాయిత్యం చేసి ఉండడం; రేప్ చేయడానికి ప్రయత్నించి ఉండడం; మరెవరి మీదైనా... తల్లి మీదో, చెల్లి మీదో, అక్క మీదో, స్నేహితురాలి మీదో, బాగా పరిచయం ఉన్న ఇతర స్త్రీల మీదో జరిగిన అత్యాచారాన్ని చూసి ఉండడం ఇవి ప్రధానంగా కనిపించే కారణాలు.”

“సంధ్యను అడిగి చూశారా డాక్టర్?” వినయ్ అడిగాడు.

“రకరకాలుగా అడిగాం. చిన్నప్పట్నుంచీ తనకు అలాంటి అనుభవాలు ఎదురు కాలేదు; అలాంటి దృశ్యాల్ని చూడలేదు. మేం ఎన్ని రకాలుగా ప్రశ్నించినా సంధ్య సమాధానం అదే. అయితే ఆ విషయంలో ఆమె నిజం చెప్పిందని కూడా మనం నమ్మలేం.”

“ఎందుకో చెప్తారా, దయచేసి?”

“తను గొప్పగా ఆరాధించే వ్యక్తి తండ్రి కావచ్చు, అన్న కావచ్చు, బాబాయి కావచ్చు, మామయ్య కావచ్చు, ఉపాధ్యాయుడు కావచ్చు, రోజూ స్కూలుకి తీసుకెళ్ళిన రిక్షా అంకుల్ కావచ్చు... ఆ పాడుపని చేసివుంటే తనలో దాచుకుని, మనతో అబద్ధం ఆడొచ్చు.” డాక్టర్ జలజ వివరిస్తూ అంది.

**మాటల విశ్లేషణ, మనోవిశ్లేషణ అయిన తరువాత డాక్టర్ జలజ వినయ్‌ని పిలిచింది. అతడికి పరిస్థితి అంతా వివరించింది. సమస్య, కారణాలు, ఇవ్వాల్సిన ట్రీట్‌మెంట్ ఇత్యాది అంశాలన్నింటినీ కూలంకషంగా చర్చించింది. అంతా విన్నాడు వినయ్. అతడెలా స్పందించాడు? అసలు సమస్య ఏమిటి?**

వినయ్ బరువుగా నిట్టూర్చాడు. తనవైపు సానుభూతితో చూస్తున్న డాక్టర్ జలజ ముఖంలోకి చూశాడు. “ఈ ఫ్రిజిడిటీని నయం చేసే మందులు లేవా డాక్టర్?”

“ఉన్నాయి. హోమియో ఔషధాలూ, ఆయుర్వేద ఔషధాలూ చక్కగా పనిచేస్తాయని కూడా అంటారు.

ఏ మందులైనా శారీరక జడత్వం మీద పనిచేస్తాయి. మానసికమైన జడత్వం మీద మందులు పనిచేయలేవని మా అనుభవం చెబుతోంది."

"మీ అనాలిసిస్ ప్రకారం నా భార్య ఫ్రిజిడిటీ శారీరకమైందా? లేక..?"

"మానసికమైనదనే మా అనాలిసిస్ సారాంశం." డాక్టర్ జలజ అంది.

"మానసిక జడత్వానికి ఎలాంటి చికిత్సా చేయలేమా డాక్టర్?" వినయ్ కంఠంలో ఆశ ధ్వనించింది.

"చేయొచ్చు. చేద్దాం. మానసికంగానే. చికిత్స చేసే డాక్టర్ మీరే!" డాక్టర్ జలజ నవ్వుతూ అంది. "నేనా?!" వినయ్ ఆశ్చర్యంగా అంటూ ముందుకి వంగాడు.

"భర్తగా మీరే సంధ్యకు ఆ చికిత్స అందించాలి. ఎలాంటి చికిత్స చేయాలో డాక్టర్ జాన్ డేవిడ్‌గారూ, నేనూ నిర్ణయించాం. మీకు ఎక్స్‌ప్లెయిన్ చేస్తాను."

"నంబర్ వన్. మగవాణ్ణి చూసి అసహ్యించుకోవాల్సిన పనిలేదనీ, భయపడాల్సిన పనిలేదనీ సంధ్యలో అభిప్రాయం కలిగేలా మీరు ఆమెతో ప్రవర్తించాలి. పురుషజాతి పట్ల ఆమెకున్న అసహ్యమూ, పురుషులంటే ఆమెలో ఉన్న భయమూ సంధ్య ఫ్రిజిడిటీకి కారణాలని మనం తెలుసుకున్నాం. పురుషులందరూ అసహ్యించుకోవాల్సిన వాళ్ళు కారనీ, వాళ్ళల్లో ఆరాధించగలిగిన వాళ్ళూ ఉంటారనీ ఆమెలో విశ్వాసం జన్మించాలి. ఆ విశ్వాసాన్ని ప్రాక్టికల్‌గా కలిగించాలి. అందుకు తగిన వ్యక్తి భర్తే! అర్థమైందా?" డాక్టర్ జలజ అడిగింది.

వినయ్ మెల్లిగా తల పంకించాడు. "అందుకు భర్తగా నేను ఏం చేయాలో చెప్పండి..."

డాక్టర్ జలజ చిన్నగా నవ్వింది. "మీకు తెలిసే ఉండాలి. ఒక ఉదాహరణ ద్వారా మీకు వివరించే ప్రయత్నం చేస్తాను. మాటవరసకి ఆఫీసులో ఒక అందమైన యువతి పని చేస్తోందనుకుందాం. మీ ఆఫీసర్‌కి ఆడవాళ్ళ పిచ్చి ఉంది. అతనే కాదు ఆఫీసులో ఇతర పురుషులందరూ కూడా ఆడదాన్ని విలాస వస్తువుగా చిన్నచూపు చూసే వాళ్ళే. ఆఫీసరు మాటలతో, చేతలతో ఆమెను హింసిస్తున్నాడు. ఇతరులు వెకిలి చేష్టలతో ఆఫీసులో ఆ పిల్లకు నిత్య నరకం సృష్టిస్తున్నారు. ఆ పిల్లలో మగజాతి అంటే భయం, అసహ్యం ఏర్పడిపోయి, వేళ్ళూనుకున్నాయి. మీరు డీసెంట్ యంగ్‌మాన్. మీరు అందరిలాంటి వ్యక్తి కాదనీ, మీ విషయంలో భయమూ, అసహ్యమూ లేకుండా ఉండొచ్చనీ ఆమె తెలుసుకోవాలని ఆశించారు. ఆమెను ఆదరించారు. మౌనంగా మీ ప్రవర్తనతో ధైర్యం చెప్పారు. కొన్నాళ్ళకి ఆమె మీ మంచితనాన్నీ, మీలోని నిజమైన పురుషత్వాన్నీ గ్రహించింది. మగాళ్ళందరూ రాక్షసులని అనుకోవడం పొరపాటనీ, మగాళ్ళలో దానవులున్నట్టే, దేవుళ్ళూ ఉంటారని తెలుసుకుంది. ఆ నమ్మకం కలిగించిన మీ వ్యక్తిత్వాన్నీ, మిమ్మల్నీ ఆరాధించడం ప్రారంభించింది.."

వినయ్ చిన్నగా నవ్వాడు. "మీరు చెప్తుంటే సింపుల్‌గా అనిపిస్తోంది"

డాక్టర్ జలజ చిరునవ్వు నవ్వింది. "ప్రాక్టికల్‌గా అంత సింపుల్ కాదు. మనిషికి నార్మల్‌గా, సహజసిద్ధంగా ప్రవర్తించడం కష్టమైన పని!"

"ఐ థింక్, ఐకెన్ డూ ది అడ్వెంచర్!" వినయ్ దృఢంగా అన్నాడు. "ఇంకా ఏం చేయాలో చెప్పండి. థెరపీ అంతటితో ఆయిపోలేదనుకుంటా!"

"సంధ్య మనిషిగా, స్త్రీగా మాత్రమే మీకు మానసికంగా, ఎమోషనల్‌గా దగ్గరవడం ఒక్కటే చాలదు. ఆమె భార్యగా, శారీరకంగా మీకు దగ్గరవ్వాలి. మీ శరీరాన్ని స్వీకరించాలి. తన శరీరాన్ని మీకు అర్పించాలి. అంటే సెంటిమెంట్ పరంగానే కాకుండా, శృంగార పరంగా కూడా మీకు దగ్గరవ్వాలి. ఒక్క సంగతి చెప్పండి మిస్టర్ వినయ్... మీరు సంధ్యను ప్రేమిస్తున్నారా?" డాక్టర్ జలజ అడిగింది.

"ఒకనాడు సంధ్యతో అన్న మాటల్ని కొద్దిగా మార్చి చెప్తాను" వినయ్ ఉద్రేకంతో అన్నాడు. "తొలిసారి చూసిన క్షణంలోనే నేను సంధ్యను ప్రేమించాను. ఇప్పుడూ ప్రేమిస్తూనే ఉన్నాను. ముందు ముందూ ప్రేమిస్తూనే ఉంటాను."

"ఓకే! అలా అయితే మీ ప్రేమ జయించి తీరాలి. ఇవాల్టి నుంచీ మీ ప్రేమకు త్యాగాన్ని జత చేయండి. నటించకండి. సిన్సియర్‌గా ఉండండి. ఆమె అభిరుచిని మీ అభిరుచిగా చేసుకోండి. ఆమె ఆశ మీ ఆశ. ఆమె ఆశయం మీ ఆశయం.

ముఖ్యంగా సంధ్యను అక్కడికీ ఇక్కడికీ తీసుకెళ్ళండి. నయాగరా ఫాల్స్, డిస్నీల్యాండ్, హాలీవుడ్ వగైరా. సున్నితమైన శృంగార దృశ్యాలున్న సినిమాలు చూపించండి. రేప్ సన్నివేశాలు చూపకండి. శృంగార కావ్యాలు చదివేలా చూడండి. వాత్సాయన కామసూత్ర గ్రంథం చదివేలా చూడండి. ఇండియా కెళ్తే ఒరిస్సాలోని ఖజురహో ఆలయ శిల్పాలు చూపించండి.

ఎక్కడికెళ్ళినా మీరిద్దరే ఉండాలి. సంధ్యతో ఏకాంతంలో ఉండండి. ఒకే కంచం, ఒకే మంచం. ఒకే మంచం మీద ఉన్నా ఆమెను కోరికతో ముట్టుకునే ప్రయత్నం చేయకండి. ఆమెకు కొన్నాళ్ళపాటు కేవలం ప్రేమికుడిలా కనిపించండి. నటించడం కాదు; నిజంగా! ప్రేమికుడిగా కనిపించండి. కాముకుడిగా కనిపించకండి! కెన్ యూ డూ ఇట్?"

"సంధ్య కోసం ఏమైనా చేస్తాను" వినయ్ కంఠంలో ఉద్రేకం ధ్వనించింది.

"మళ్ళీ చెప్తున్నా! డోంట్ ఫోర్స్ యువర్ సెల్ఫ్ ఆన్ హర్! డోంట్ ట్రైటు హగ్ హర్! డోంట్ ట్రైటు కిస్ హర్! గివ్ హర్ యాంపుల్ టైం. మీలో ఓపిక, ఓర్పు కాపురం చేయాలి. ఆమెకు నచ్చేవన్నీ చేయండి. ఆమె బట్టలు మార్చుకుంటున్నప్పుడూ, స్నానం చేసేటప్పుడూ పొరపాటున కూడా తొంగి చూడకండి. కొంతకాలం దాకా ఆమెను మీ స్నేహితురాలిగా ట్రీట్ చేయండి. స్నేహం ఇవ్వండి. ప్రేమ ఇవ్వండి. అనురాగం ఇవ్వండి. ఆప్యాయత ఇవ్వండి. కోరికనూ, కామాన్నీ వ్యక్తం చేయకండి. కెన్ యూ డూ దట్?"

"తు.చ.తప్పకుండా!"

"ఆమె ప్రేమను – వాత్సాయన మహర్షి మాటల్లో చెప్పాలంటే ఆమె ప్రీతిని ఎలా పొందాలో ఇంకా

## అక్కడ ఛాన్స్ కష్టమేనట!

బాలీవుడ్‌లో చాలా మంది హీరోయిన్లకన్ను హాలీవుడ్ మీదే ఉంటుంది. ప్రియాంక, దీపిక రేంజ్‌లో కాకపోయినా ఒక్క సినిమాలో అన్నా నటించాలని చాలా మంది హీరోయిన్లు తహతహలాడుతూ ఉంటారు. కానీ తనకు మాత్రం అలాంటి ఆశలు లేవని అంటోంది విద్యాబాలన్. హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలకి కేరాఫ్ అడ్రస్‌గా నిలిచే విద్యాబాలన్ హాలీవుడ్‌లో అవకాశాల మీద సుదీర్ఘ వివరణే ఇచ్చింది. అక్కడ అవకాశాలు రావాలంటే చాలా తతంగం ఉంటుందనీ, కష్టమైన పని అనీ చెప్పుకొచ్చింది. అయినా తనకు అక్కడ సినిమా చేయాలన్న విపరీతమైన కోరిక లేదట! అక్కడ తను మాత్రమే చేయగలను అనుకున్న సినిమాలు ఏమైనా వస్తే ఆలోచిస్తాను తప్ప తనకు తానుగా అక్కడ ప్రయత్నాలు చేసుకోదట!



వివరంగా తెలుసుకోవాలనుకుంటే వాత్సాయన కామసూత్రాలు చదవండి. లెట్ మీ రిపీట్ మిస్టర్ వినయ్. గివ్ హర్ టైమ్! మీరు ఆమె చేతిని పట్టుకోవడం కాదు; ఆమె మీ చేతిని పట్టుకోవాలి! కొంత కాలానికి ఆడపావురం మగపావురం వద్దకు వచ్చినట్టు సంధ్య మీ వద్దకు వస్తుంది... ప్రేమతో ప్రేయసిగా; కోరికతో భార్యగా!"

"థాంక్స్ డాక్టర్!" వినయ్ ఉద్రేకంగా అన్నాడు.

"ఇంకొక చిట్కా కూడా చెప్తాను" డాక్టర్ జలజ ఫోల్డర్ని మూస్తూ అంది. "కొన్ని నెలల పాటు నేను వివరించిన విధంగా ప్రవర్తించాక, మీతో స్నేహం, అనురాగం ఆమెలో జన్మించాక ఇండియాకు పుట్టింటికి పంపేయండి. మీ సాహచర్యం లేని లోటుని, ఒకరకమైన వియోగాన్ని అనుభవించనివ్వండి. ఆ అనుభవంతో ఆమె హృదయం, ఆమె శరీరం మీ కోసం పరుగెత్తుకు వస్తాయి. ఇదీ మిస్టర్ వినయ్ మీరు ఇవ్వాల్సిన ట్రీట్మెంట్. జాగ్రత్తగా, ఓపికగా, ఓర్పుతో విసుగు, ఉద్రేకం అనేవి లేకుండా కొనసాగించండి. సంధ్య మీ గుండెలో గూడు నిర్మించుకుంటుంది." డాక్టర్ జలజ చిరునవ్వు నవ్వింది.

"నా గుండెలో సంధ్య కోసం ఎప్పుడో గుడి కట్టి ఉంచాను డాక్టర్" వినయ్ ఆవేశంతో అన్నాడు. డాక్టర్ జలజ చిన్నగా నవ్వింది. "అయితే ఆ గుడిలో సంధ్య కొలువు తీరుతుంది!"

కుర్చీలోంచి లేచిన డాక్టర్ని చూస్తూ, వినయ్ లేచి నిలుచున్నాడు.

"ఓకే మిస్టర్ వినయ్! అవసరమైతే రండి. అనుమానించకండి" డాక్టర్ జలజ అంది.

వినయ్ ఆమె కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "మళ్ళీ రాను డాక్టర్. దీన్ని నేను ఛాలెంజ్గా తీసుకున్నాను. సాధించి తీరుతాను."

"గుడ్లక్!" డాక్టర్ జలజ నవ్వుతూ అంది.

***

వినయ్ కసిగా కంప్యూటర్ని షట్డౌన్ చేశాడు. బెడ్రూంలో లైటు స్విచ్ నొక్కాడు. హాల్లోకి వచ్చి స్విచ్ నొక్కాడు. హాలుని వెల్తురు ఆక్రమించింది. 'ఇంట్లో సంధ్యవేళ దీపం పెట్టే దిక్కుండాలిరా!' అనేది పెళ్ళి కాకముందు అమ్మ. చివరికి సంధ్య రూపంలో సంధ్యవేళ దీపం పెట్టే దిక్కు వచ్చింది. పెళ్ళయ్యాక కేవలం తొమ్మిది నెలలు తనతో ఉంది. ఫ్రెండు పెళ్ళి ఉందనీ, నెలరోజుల్లో తిరిగొస్తాననీ ఇండియాకి వెళ్ళింది.

వినయ్ సెకండ్ బెడ్రూంలోకి వెళ్ళాడు. అతని చెయ్యి కదిలింది. లైటు వెలిగింది. సెకండ్ బెడ్రూం సంధ్య సొంతం చేసుకున్న బెడ్రూం. తనకు దూరంగా ఉండాలన్న ముందుచూపుతో సంధ్య సెలెక్ట్ చేసిన టూ బెడ్రూం అపార్ట్మెంట్లో సంధ్య అంతఃపురం! సంధ్య తన గదిలోకి రాదు. తనను ఈ గదిలోకి రానివ్వలేదు. డాక్టర్ జలజ చెప్పిన చిట్కాను అక్షరాలా అమలు చేశాడు తను. ఒకటి కాదు, రెండు కాదు...ఏడున్నర నెలలు! గోల్డెన్ గేట్, హాలీవుడ్, డిస్నీలాండ్, నయాగరా ఫాల్స్... ఎక్కడికెళ్ళినా సంధ్య పగలంతా తనను అంటిపెట్టుకున్న నీడ. నవ్వుతూ, తుళ్ళుతూ, పడుతూ, లేస్తూ నూటికి నూరుపాళ్ళు భర్తతో హనీమూన్ ఎంజాయ్ చేస్తున్న యువతి. రాత్రిళ్ళు హోటల్ గదుల్లో ఒంటరిగా!

సంధ్య హృదయంలోంచీ, మనసులోంచీ జడత్వాన్ని కరిగించడానికి తను అంకితమై పోయాడు. ఆమె ఆడమన్నట్టు ఆడాడు. పాడమన్నట్టు పాడాడు. ఫలితం శూన్యం! సంధ్యను ఆవరించిన జడత్వం డాక్టర్ జలజ చెప్పినట్టు మంచుముద్ద కాదు. శిల.. కఠిన పాషాణం.




వారం వారం అమ్మానాన్నా, అత్తామామా తనతో మాట్లాడుతూనే ఉన్నారు. సంధ్యకు నెల తప్పడం గురించి అడుగుతూనే ఉన్నారు. తొందరలోనే చెప్తానంటూ తను వాళ్ళ ఆశలకి నీళ్ళు పోస్తూ వచ్చాడు. సంధ్య సిగ్గుపడుతూ వాళ్ళతో మాట్లాడేది. సంధ్యా తనూ ఒక కంచం, ఒక మంచంగా లేరన్న నిజాన్ని వాళ్ళనుంచీ దాచాడు తను. పదిహేను రోజులప్పుడు సంధ్య ఇండియాకు వెళ్ళాలంది. ఫ్రెండు పెళ్ళి అంది. నెలరోజుల్లో తిరిగి వస్తానన్నది. ఇండియాలో దిగ్గానే తనకి ఫోన్ చేయలేదు. కూతురు క్షేమంగా చేరిందని మామయ్య చెప్పాడు. సంధ్య ఒక్కసారి కూడా తనతో మాట్లాడలేదు. మామగారూ, అత్తగారూ ఫ్రెండింటికి వెళ్ళిందనో, బజారుకెళ్ళిందనో, గుడికెళ్ళిందనో చెప్తూ వచ్చారు, నాలుగు రోజుల పాటు. తరువాత ఆన్సర్ చేయడం మానేశారు!

అమ్మా, నాన్నా, సుధా సంధ్య విమానం దిగిన రోజున వెళ్ళి పలకరించి వచ్చారు. జెట్లాగ్ పోగానే వస్తానంది సంధ్య. తరువాత తనవాళ్ళు ఫోన్ చేస్తే తనకి వచ్చిన సమాధానాలే! నాలుగైదు సార్లు సుధ వెళ్ళి వచ్చింది. ఒక్కసారి కూడా సంధ్య ఇంట్లో లేదు! సంధ్య తనకూ దొరకడం లేదు. తనవాళ్ళకూ దొరకడం లేదు. ఎందుకు? ఏం జరుగుతోంది? తనను వెంటాడుతూ వేధిస్తున్న ప్రశ్నలకి సమాధానాలు వెతుకుతున్నట్టు వినయ్ సంధ్య పడగ్గది లోంచి మాస్టర్ బెడ్రూంలోకి వెళ్ళాడు. మంచం మీద పడేసిన మొబైల్ అతని ప్రశ్నలకి సమాధానాలు చెప్తున్నట్టు మోగింది. వినయ్ అందుకుని, ఆత్రుతగా చూశాడు. సంధ్య కాదు సుధ!

"సుధా!"

"అన్నాయ్, నువ్వు ఉన్నపళంగా బయల్దేరి రావాలి" సుధ కంఠంలో ఆత్రుత.

"ఏం జరిగింది?" వినయ్ కంఠంలో కంగారు.

"కొంపలంటుకునేలా ఉన్నాయి. వెంటనే విమానం ఎక్కు..."

"నాన్న బాగున్నారా?"

"నాన్నా, అమ్మా, నేనూ కులాసే! నువ్వు..."

"ఏం జరిగిందో చెప్పవే! సంధ్యకేం కాలేదుగా?"

"సంధ్యా, ఆమె పేరెంట్సూ అందరూ శుభ్రంగా ఉన్నారు.."

"ఏయ్..నిజం చెప్పు!"

"నిజంగా అన్నాయ్. అందరూ క్షేమం. నువ్వు అర్జెంటుగా రావాలి.."

"ఎమర్జెన్సీ ఏమిటో చెప్పు" వినయ్ అరిచాడు, విసుగ్గా.."

"ఫోన్లో చెప్పే విషయం కాదు. నీ జీవితానికి సంబంధించిన సమస్య. అంతే! వచ్చేయ్.."

"సుధా..."

"డోంట్ వేస్ట్ టైం. నువ్విక్కడకు వస్తే అన్నీ తెలుస్తాయి! బయల్దేరుతున్నావుగా?"

"సుధా...సస్పెన్సుతో చంపకు! నాకు బీపీ పెరిగిపోతోంది. ప్లీజ్... వివరంగా చెప్పు! ఏం జరిగింది?"

"సారీ అన్నాయ్! ఫోన్లో చెప్పకూడదని అమ్మా, నాన్నా, నేనూ డిసైడ్ చేసుకున్నాం. ఎర్లియస్ట్ ఫ్లైట్ ఎక్కేయ్. బై" సుధ డిస్కనెక్ట్ చేసింది.

వినయ్ కోపంగా తండ్రి నంబర్కి డయల్ చేశాడు. ఆయన పలకగానే అడగాల్సిన ప్రశ్న అడిగాడు.

"వినయ్...ఫోన్లో వల్లించే విషయం కాదు. సుధ చెప్పినట్టు తక్షణం బైల్దేరు."

"నాన్నా...నిజం చెప్పండి! ఎవరికైనా సీరియస్గా ఉందా?"

"నీ మీద ఒట్టురా! ఇక్కడ మేమూ, అక్కడ వాళ్ళూ క్షేమం! నువ్వురా!"

"నాన్నా...ఆఫీసు..లీవు...ఉద్యోగం"

"ఐ డోంట్ కేర్! స్టార్ట్ ఇమీడియట్లీ!"

వినయ్ ఆవేశం అంతా మొబైల్ మీద చూపించాడు. కంప్యూటర్ వైపు నడిచాడు..ఆన్లైన్ బుకింగ్.

*(ఇంకావుంది)*




## ఇక రోబో గురువులు!



ఇంటిపనులు చక్కబెట్టడం, ఆస్పత్రుల్లో డాక్టర్లకు సహాయపడడం, హోటళ్ళలో తమ సర్వీసులు అందించడం...ఇలా ఎన్నో రకాలుగా రోబోలు తమ పనితనం ప్రదర్శిస్తున్నాయి. ఇదే తరహాలో ఇక కొత్తగా క్రీడా గురువులుగానూ తమ నైపుణ్యం ప్రదర్శించబోతున్నాయి. జపాన్ వాలీబాల్ అసోసియేషన్‌కు చెందిన నిపుణులు, సుకుబా యూనివర్సిటీ పరిశోధకులతో కలిసి ఆరు చేతులున్న బ్లాక్ మెషీన్ అనే వాలీబాల్ రోబోను రూపొందించారు. ప్రత్యర్థి ఆటగాళ్ళ కదలికల్ని ఈ రోబో ముందుగానే ఊహించిమరీ క్రీడాకారులకి శిక్షణ ఇస్తుందట. ఈ రోబో సెకనుకు 3.7 మీటర్ల వేగంతో అంటే ఓ ఆటగాడికన్నా ఎన్నోరెట్లు వేగంగా కదులుతూ నేర్చుకునేవాళ్ళను పరుగులు పెట్టిస్తుంది. జపాన్ మహిళా వాలీబాల్ బృందంలోని క్రీడాకారిణులకు శిక్షణ ఇచ్చేందుకు మొదట ఈ రోబోను ఉపయోగించారు. ఈ రోబో పనితీరులోని ప్రాథమిక లోపాలు సరిదిద్ది మరింత ప్రభావవంతంగా శిక్షణ ఇచ్చేలా మార్పులు చేయబోతున్నారట. సో.. ఇక రోబో గురువులు రాబోతున్నారన్నమాట!

## వీరాభిమాని

తమ హీరో సినిమా విడుదలైనా, వారి పుట్టినరోజులు వచ్చినా అభిమానుల సందడి అంతా ఇంతా కాదు. పాలాభిషేకాలు, రక్తదానం ఇలా ఎన్నో చేస్తుంటారు. అయితే రికీ వైనర్ ఇంకాస్త ముందుకెళ్ళి తనకెంతో ఇష్టమైన కార్టూన్ క్యారెక్టర్‌ని ఏకంగా పచ్చబొట్టు పొడిపించుకున్నాడు. యునైటెడ్ కింగ్‌డమ్, విల్ట్‌షైర్‌కి చెందిన రికీ వైనర్ చిన్నప్పట్నుంచీ కార్టూన్ క్యారెక్టర్ హోమర్ సింప్సన్ అంటే అభిమానం పెంచుకున్నాడు. ఈయనగారు తన అభిమానాన్ని ఎలా చాటుకున్నాడో తెలుసా? తన కుడిచేతి భుజం నుంచి మణికట్టు వరకు సింప్సన్ క్యారెక్టర్‌ని టాటూ వేయించుకున్నాడు. మొత్తం 52 సింప్సన్ టాటూలు! గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కేస్తానన్న ధీమా కూడా వ్యక్తం చేస్తున్నాడు. ఎలాగంటారా? ఇంతవరకు ఒకే క్యారెక్టర్‌ని అన్నిసార్లు పచ్చ పొడిపించుకున్నవాళ్ళు లేరట మరి!

## పైథాన్ మసాజ్

ఆయిల్ మసాజ్, థాయ్ మసాజ్, అరోమా థెరపీ మసాజ్... ఇలా మసాజ్‌లు ఎన్నో రకాలు. వీటికితోడుగా వచ్చిచేరింది సరికొత్త పైథాన్ మసాజ్! 'టెక్నిక్కులలో బిజినెస్ టెక్నిక్కులు వేరయా' అన్నట్టుగా జర్మనీలోని డ్రెస్‌డెన్ సిటీలో ద హార్ మోడ్ టీమ్ సెలూన్ వాళ్ళు కస్టమర్లకు కొత్తగా నెక్ మసాజ్ అందుబాటులోకి తెచ్చారు.



ఈ మసాజ్‌ని మాత్రం మాంటీ అనే కొండచిలువ చేస్తుంది. 13 సంవత్సరాల మాంటీ ఈ మసాజ్‌కోసం వచ్చిన కస్టమర్ మెడ చుట్టూ అల్లుకుపోతుంది. మెల్లగా మెడ కండరాలకు మసాజ్ చేస్తుంది. మాంటీ సేవలు వినియోగించుకోవడానికి కస్టమర్లు ఎగబడుతున్నారంటే దానికెంత డిమాండ్ ఉందో ఇట్టే అర్థమైపోతుంది. ఈ హైడిమాండ్‌ని దృష్టిలో ఉంచుకుని వారంలో రెండురోజులు మాత్రమే దాని సేవలు అందుబాటులో ఉంచాడు సెలూన్ యజమాని. మెత్తమెత్తగా పైథాన్ మసాజ్ బహు రిలాక్సింగ్‌గా ఉంటుందేమో కదా!

## హలో కిట్టీస్

ముద్దుముద్దుగా ముద్దొచ్చేలా ఉండే కిట్టీ బొమ్మలంటే ఎవరికి ఇష్టం ఉండదు చెప్పండి. జపాన్‌లోని ఓ వ్యక్తికి అయితే మరీనూ! జపాన్, ఛిబాకి చెందిన మసోవా గుంజికి కిట్టీ బొమ్మలంటే చెప్పలేనంత ఇష్టం. ఎంత ఇష్టం అంటే కిట్టీ



బొమ్మ ఎక్కడ కనిపించినా కొనేంత! 30 సంవత్సరాలుగా వాటినే సేకరిస్తున్నాడు. బయటినుంచి చూస్తే మసోవా ఇల్లు చూడముచ్చటగా చక్కగా కిట్టీ ఇల్లులా ఉంటుంది. లోపలికి అడుగుపెడితే గోడలు, అరలు, తలుపులు ఎటుచూసినా కిట్టీలు, వాటి ప్రతిరూపాలే!

టీకప్పుల దగ్గరనుంచి హెల్మెట్లు, ఫ్రిజ్‌లు, అవెన్‌లు, కార్పెట్లు ఇలా ఎన్నో రూపాల్లో కిట్టీస్ దర్శనమిస్తాయి. మొత్తం 5,169 కిట్టీలున్నాయి అతనింట్లో. ఎక్కువ హలో కిట్టీలు సేకరించినందుకు గిన్నిస్ రికార్డు అతని సొంతమైంది. హలో కిట్టీస్‌కి హాయ్ చెబుదామా!

## స్పైడర్ డ్రస్

అమెరికా నేచురల్ హిస్టరీ మ్యూజియం న్యూయార్క్‌లో ఉంది. ఆ మ్యూజియం సందర్శకులకు ఒక బాక్సులో బంగారు రంగులో మెరిసిపోతూ ఓ డ్రస్సు కనిపిస్తుంది. దీనికో ప్రత్యేకత ఉంది. సాలెపురుగు సిల్క్ దారంతో తయారుచేసిన డ్రస్సు ఇది. ఈ బంగారు డ్రస్ తయారుచేయడానికి నాలుగు సంవత్సరాలు పట్టింది. దీనికోసం 70 మంది గోల్డెన్ ఆర్బ్ సాలెపురుగు గూళ్ళు వెదికి అందులోని దారం తీసి భద్రపరిచారు. మరో 12మంది ఆ గూళ్ళల్లోని



దారం లోంచి బంగారు రంగు దారం వేరుచేసి ఈ డ్రస్ తయారు చేశారు. ఇదే ప్రపంచంలో సాలెపురుగు సిల్కుతో తయారుచేసిన మొట్టమొదటి డ్రస్సు కావడం దీని ప్రత్యేకత.

"గోల్డెన్ ఆర్బ్ వెబ్‌స్పైడర్" అని పిలిచే ఈ సాలెపురుగులు ఉత్తర అమెరికాలో ఎక్కువగా కనబడతాయి. ఈ సాలెపురుగులు గూడు అల్లుకునే దారం బంగారురంగులో ఉంటుంది. ఆ దారాలలో కొంత సిల్కు కూడా ఉంటుంది. ఆ సిల్క్‌ను వేరుచేసి తయారుచేసినదే ఈ బంగారు డ్రస్సు.

—నర్మద వాసిరెడ్డి




"గెలుపు" అంటే నీ సంతకం ఆటోగ్రాఫ్‌గా మారటమే.

—అబ్దుల్‌కలాం

విత్తనం నాటగానే పంట చేతికి అందాలనుకోవటం అత్యాశ. విత్తనం నాటాలంటే నేల పదును చెయ్యాలి, వర్షం పడాలి, అది మొలకెత్తాలి, ఎరువులు వెయ్యాలి, ఎదిగే వరకూ కాపాడాలి, పంట పండాలి, ఫలితం ఆస్వాదించాలి. దాన్నే "గెలుపు" అంటారు. శ్రమలేనిదే ఫలితం రాదు. ఫలితం లేనిదేదీ గెలుపు కాదు. దీనికి ఉత్ప్రేరకం కోరిక. గమ్యాన్ని నిర్దేశించేది కోరిక. అందరికంటే అత్యున్నతంగా ఉండాలని, అందరిలోకి "బెస్ట్" అనిపించుకోవాలనే ఆలోచనని మనలో నిరంతరం ప్రేరేపిస్తుంది కోరిక. పులు సృష్టిస్తుండాలి. అందరిలోకెల్లా ముందుండటమే గెలుపు." అది మన సొంతమవ్వాలంటే అంచెలంచెలుగా ముందుకు సాగాలి. గెలుపు మజిలీ కాదు. అలుపు, ఆసరా కాదు. దానిని నిరంతర ప్రక్రియగా మార్చుకున్న వాళ్ళే విజేతలు.

విద్యార్థి విజయం సాధించాలంటే చదువుమీద మనసు లగ్నం చెయ్యాలి, ఆకళింపు చేసుకోవాలి. పరీక్షలు బాగా రాయాలి. ఇందులోని ప్రతి ప్రక్రియా

# గెలుపు గుర్రంపై స్వారీ చెయ్యాలంటే...

మనలో దాగున్న ప్రతిభను గుర్తించడం "ప్రథమ దశ".

కోరిక రూపంలో దానిని పునశ్చరణ గావించుకోవడం "రెండో దశ".

కోరికని ఆచరణలో పెట్టడానికి, కృషిచేసి విజయం సాధించడం "మూడోదశ".

**"తాను సాధించింది ప్రపంచంలో అన్నిటికన్నా గొప్పదనుకోవడమే మనిషి విజయానికి మూలధాతువు"**

**—జార్జి ఇలియట్.**

క్రికెటర్‌ని కావాలి, సినిమా డైరెక్టర్‌ని కావాలి, బిజినెస్‌మేన్‌గా ఎదగాలి.. ఇవన్నీ సామాన్యమైన కోరికలు.

అయితే ఎంతమందిలో ఈ కోరిక బలీయంగా నాటుకుని వారిని గెలుపుకోసం కృషి చేయిస్తోంది?

కోరిక ఎవరినైతే నిరంతర శ్రమ వైపు దృష్టి సారించేలా చేస్తుందో వాళ్ళే గెలుపు గుర్రాన్ని స్వారీ చేసే నైపుణ్యం సాధించగలుగుతారు.



గెలుపు కోరిక అనుక్షణం మనల్ని జ్వలింపజేయాలి.

## కొత్త శీర్షిక ప్రారంభం

ఎదిగే మొక్కలా అది దినదినాభివృద్ధి చెందాలి.

అప్పుడే నీకేం కావాలో, నువ్వేం కాదల్చుకున్నావో ముందు నీకు బోధపడుతుంది. అప్పుడు అసాధ్యాలను సైతం సుసాధ్యం చెయ్యగల 'శక్తి' నీకు తెలియకుండానే నీలో ప్రవేశిస్తుంది.

స్వయం ప్రతిభతో రాణించి, శాస్త్రవేత్తగా కీర్తి గడించి, అత్యున్నత శిఖరాలకు చేరిన మహామనీషి అబ్దుల్ కలాం. యువతకి దిశానిర్దేశం చెయ్యాలనే కోరిక బలీయంగా ఉండబట్టే, ఎల్లప్పుడూ పిల్లలతో, యువతతో మమేకమై, "కలలు కనండి, వాటిని సాకారం చేసుకోండి" అంటూ తన ఉపన్యాసాల ద్వారా దేశ యువత ఆలోచనలో 'మార్పు'కు నాంది పలికారు. తనకిష్టమైన విద్యార్థుల సమక్షంలో ఉపన్యసిస్తూనే అంతిమశ్వాస విడిచారు. అదీ అసలైన గెలుపు. మనిషి బ్రతికున్నా మరణించినా ఆ వ్యక్తి పేరు తలపులోకి రాగానే రోమాలు నిక్కబొడుచుకోవాలి.

"విజయసాధనకు కోరిక ఉత్ప్రేరకమైతే, గమ్యం ఆ ప్రాంగణ స్వప్నం. అందుకే "కలలు కనాలి. వాటిని సాకారం చేసుకునే వారిలో నువ్వూ ఉండాలి" అన్నారు అబ్దుల్ కలాం.

### గెలుపు కలలు సాకారం చేసుకోవాలంటే.....

"మనం కనే కలలు మెరుపుకలలై ఉండాలి. అనుక్షణం మనలో ఆ కోరిక ఉరుములు, మెరుపులు సృష్టిస్తుండాలి..."

గెలుపే. ఈ క్రమంలో అలుపొచ్చి విశ్రాంతి కోరుకుంటే మన గెలుపు మరొకరి పరమవుతుందని గ్రహించాలి.

తాబేలు, కుందేలు రన్నింగ్ రేస్ కథ తెలుసుగా. నువ్వు గెలిచినట్టు భావించే ప్రతి అంశమూ పరుగుపందెంలో నీ స్థానం ఏమిటో నీకు చెబుతూనే ఉంటుంది. అప్పుడు నువ్వెక్కడికి చేరుకోవాలో, గెలుస్తావో, ఓడిపోతావో తెలియజెప్పే గమ్యం సాక్షాత్కరిస్తుంది. తదనుగుణమైన ప్రణాళికతో శ్రమించేవాళ్ళకు ఆత్మవిశ్వాసం వెల్లువలా తోడుండి ప్రేరణనిస్తుంది.

అహర్నిశలు శ్రమించి స్టేట్ ర్యాంకులు సాధించిన విద్యార్థుల్ని మీ తదుపరి లక్ష్యం ఏమిటని ప్రశ్నిస్తే రోల్‌మోడల్స్ పేర్లుచెప్పి వాళ్ళలా అవుతాం అంటారు. ఎవరో సాధించిన విజయాలు దృష్టిలో ఉంచుకుని వారిలా అవ్వాలని కలలు కంటే విజయం సాధించలేరు. ఒకవేళ సాధించినా ఆ ఘనత నీది కాదెప్పటికీ. ఎందుకంటే ఆ గెలుపుగుర్రంపై నీ రోల్ మోడల్స్ స్వారీ చేసేశారు. వాళ్ళ ప్రేరణతో నువ్వేంటో నిరూపించుకోవాలి. అది ఎవ్వరూ సాధించని అరుదైన గెలుపై ఉండాలి.

మనుషులందరూ దైవాంశ సంభూతులే. అనంతమైన శక్తియుక్తులు మనలో ఉన్నాయని గ్రహించాలి. మనం ఎక్కవలసిన గెలుపుగుర్రం మన కోసం ఉండే తీరుతుంది. బద్ధకం, సోమరితనంతో శ్రమకి దూరమైతే గెలుపు పరాధీనమే.

### భయపెట్టే భ్రమల్ని బహిష్కరించే వాళ్ళే విజేతలు

భయం, అవరోధం, అపజయం ఈ మూడూ

'గెలుపు' ప్రయాణంలో ఎదురయ్యే క్షణభంగురమైన భ్రమలే. భయం వల్ల ఎదురయ్యే అవరోధాల్ని అడ్డు తొలగించుకోలేకపోతే మిగిలేది ఖచ్చితంగా అపజయమే. అపజయం మన గెలుపువాకిట అడపాదడపా ఎదురయ్యే తాత్కాలిక భ్రమ అని గుర్తించి, ముందుకు సాగటమే గెలుపు.

విశ్వవ్యాప్తమైన ఆకాశాన్నిచూసి భయపడి, చిన్నిరెక్కలతో ఎగిరే పిచ్చుక ఎగరటం ఆపుతోందా?

అనంతసాగరాన్ని చూసి హడలెత్తి ఉండీ లేనట్టుండే చిన్నమొప్పలతో ఈదే చేపపిల్ల ఈదటం మానుతోందా?

సాధించాలన్న తపన, తృష్ణ మనలో ఉంటే, ఆ తీవ్రత మండే సూర్యుడిలా అవరోధాల్ని కాల్చి బూడిద చేసేలా ఉండాలి.

అపజయాన్ని చూసి బెదిరిపోవద్దు. సానుకూలంగా ఆలోచిస్తే అపజయంలో దాగున్న జయం నీకు దర్శనమిస్తుంది.

"Think Positive and Find Fuel in Failure"

చాలాసార్లు విజయానికి దగ్గరయ్యే తరుణంలో అపజయాలు చుట్టుముడతాయి. ప్రపంచంలో గొప్ప గొప్ప పరిశోధనలన్నీ వందల అపజయాల తర్వాతే ఆవిష్కరింపబడ్డాయి.

**"మంచి రచయిత కావాలని బలమైన కోరిక పెంచుకుని చేస్తున్న ఉద్యోగం వదిలేశాడు. రాయటం మొదలుపెట్టాడు. అలా ఆయన పేరు సంపాదించుకోవడానికి తొమ్మిదేళ్ళు పట్టింది. ఆ సమయంలో అనేక అవరోధాలు, అవమానాలు ఎదురయ్యాయి. తిండికి కూడా ఇబ్బందిపడ్డాడు. కానీ ఆయన రాసిన వ్యాసాలు, పుస్తకాలు, నాటకాలు ఆయన్ను ప్రపంచంలోనే ప్రఖ్యాతిగాంచిన రచయితగా నిలబెట్టాయి. ఆయనే నేటికీ మనం తలుచుకునే "జార్జిబెర్నార్డ్ షా".**

"బాల్యంలోనే కన్నీళ్ళు మొలిస్తే మొలవనీ..
అవి కష్టాల వాతావరణంలో ఆరి, తేరి ఎదగటం నేర్చుకోనీ...
కానీ అవి చెట్లయ్యాక, రహదారి పొడుగునా
ద్వారపాలకుల్లా బతికితే నేనైతే సహించను".

అని రాసిన "అలిశెట్టి ప్రభాకర్" మాటల్లోని దార్శనికత "గెలుపు" పరమార్థానికి అద్దం పడతాయి.

ఎన్నో బాలారిష్టాల్ని అధిగమించి ఎదిగిన వృక్షం తన నీడని తాను వాడుకుంటుందా? తన పండ్లని తానే భుజిస్తోందా?

సమాజానికి నీడనిచ్చే వృక్షంలా నీ గెలుపు పదిమందికీ ఉపయుక్తంగా ఉండాలి.

* తన విజయాన్ని స్వార్థపు పరిధిలో బంధిస్తే "హెన్రీఫోర్డు" సృష్టించిన "కదిలే గది (కారు)" ప్రపంచానికి అందుబాటులోకి వచ్చేదా?

* చీకటిలోనూ వెలుగులు విరజిమ్మే విద్యుత్ బల్బు కనుగొన్న "ఎడిసన్" తన గదికే ఆ వెలుగులు పరిమితం చేసుకుంటే ఆయన ప్రపంచ చరిత్రలో మిగిలిపోయేవాడా?

* గాంధీజీ ఒక సాధారణ పౌరుడిలా జీవించి ఉంటే భారతదేశానికి దాస్యవిముక్తి కలిగేదా? ఆదర్శవంతమైన ఆచరణ, నిరాడంబరత, కార్యసాధన, అహింసావ్రతం, సర్వమత సమత, సకల మానవ సౌభ్రాతృత్వం అనే ఉత్తమ లక్షణాలు గల మహాత్ముడిగా బాపూజీ మిగిలిపోయే వారేనా?

* ఎవరూ తీయని విధంగా సినిమా తీయాలన్న బలీయమైన కోరిక ఉండబట్టే రాజమౌళి 'బాహుబలి' సినిమా తీసి చరిత్ర తిరగరాశాడు. ఆయన పడే శ్రమవైపు కన్నెత్తి చూడటానికి కూడా 'అపజయానికి' వణుకు పుడుతుంది. ఆయన చిత్రాలన్నీ అపజయం ఎరగనివే. అయినా తృప్తిచెందక రెండేళ్ళు శ్రమించి, ఎంతోమంది సినీకార్మికులకు పనికల్పించి బాహుబలి నిర్మించాడు. ప్రపంచం మొత్తం 'బాహుబలి' గురించి మాట్లాడుకునే విజయానికి విలాసమయ్యాడు.

గెలుపు గుర్రంపై స్వారీ చెయ్యాలంటే మీలో ఉన్న ప్రతిభకి మీరే పట్టం కట్టుకోవాలి.

"అనగనగా ఒక ఊళ్ళో ఫలానా గొప్పవ్యక్తి ఉన్నాడు" అని తరతరాలు చెప్పుకునే గెలుపు కథలకు విలాసం కావాలన్న 'కోరిక' నీలో జ్వలించినప్పుడే గెలుపుగుర్రంపై అలుపెరగని స్వారీచేసి విజయవిలాసంగా మారతావు.

నవ్య



## హేట్సాఫ్

**"కష్టాలు నిన్ను నాశనం చేసేందుకు రాలేదు. నీలోని శక్తిసామర్థ్యాల్ని వెలికితీసి నిన్ను నువ్వు నిరూపించుకునేందుకే కష్టాలు వస్తాయి. కష్టాలకు కూడా తెలియాలి నిన్ను గెలవడం కష్టమని".**

**–అబ్దుల్ కలాం**



సామాన్యుడిగా పుట్టి, అవలీలగా అత్యున్నత శిఖరాలు అందుకున్న అసామాన్యుడు అబ్దుల్ కలాం. తమిళనాడులోని రామేశ్వరంలో 1931 అక్టోబర్ 15న జన్మించిన ఆయన పూర్తిపేరు అవుల్ పకీర్ జైనులబ్దీన్ అబ్దుల్ కలాం.

చిన్ననాటి నుండే ఆకాశ విహంగాలపై ఆసక్తి కనబరిచిన కలాం, ఉపాధ్యాయుని తోడ్పాటుతో ఆ దిశగా అడుగులు వేశారు. మద్రాస్ ఐఐటి నుండి భౌతికశాస్త్రంలో, ఏరోస్పేస్‌లో ఇంజనీరింగ్ పూర్తిచేశాక డీఆర్‌డీవో (డిఫెన్స్ రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్)లో చేరారు. హైదరాబాద్ డీఆర్‌డీవోలోనూ పనిచేశారు. ప్రధానంగా రక్షణ, అంతరిక్ష పరిశోధనలపై దృష్టి పెట్టిన కలాం, తర్వాత భారత క్షిపణి పరిశోధనలపై విస్తృత సేవలందించారు. పృథ్వి, అగ్ని, ఆకాశ్, నాగ్, త్రిశూల్ తదితర క్షిపణుల అభివృద్ధికి విశేష సేవలందించి 'మిసైల్ మేన్ ఆఫ్ ఇండియా'గా పేరు గడించారు. భారత బాలిస్టిక్ క్షిపణి 'అగ్ని' శక్తిసామర్థ్యాలు ప్రపంచానికి తెలిశాయి. ఈ క్షిపణులన్నీ కలాం సారథ్యంలో స్వదేశీ పరిజ్ఞానంతో రూపుదిద్దుకోవటం విశేషం.

1998లో వాజ్‌పేయి ప్రభుత్వం పోఖ్రాన్‌లో చేపట్టిన అణ్వాయుధ ప్రయోగంలో కలాం కీలక పాత్ర పోషించారు. ఆయన సేవలకుగాను కేంద్ర ప్రభుత్వం భారతరత్నతో సహా పలు ప్రతిష్ఠాత్మక అవార్డులు అందచేసింది. 40 విశ్వవిద్యాలయాలు ఆయనకు గౌరవ డాక్టరేట్‌లు అందచేయటం విశేషం. 2002 నుండి 2007 వరకు భారత 11వ రాష్ట్రపతిగా సేవలు అందించారు.

కలాంకు చిన్నపిల్లలంటే ఎంతో ఇష్టం. ప్రతి వారం 300–400 మంది విద్యార్థులతో సమావేశమయ్యేవారు. ఒక శాస్త్రవేత్త, ఒక అవివాహితుడు రాష్ట్రపతిగా ఎన్నిక కావడం భారతదేశ చరిత్రలో ఇదే ప్రథమం.

రాష్ట్రపతిగా తన పదవీకాలం ముగిసిన తర్వాత తనకిష్టమైన అధ్యాపకవృత్తి చేపట్టారు కలాం. పలు యూనివర్సిటీలలో గౌరవ ఆచార్యునిగా పనిచేశారు. 'వింగ్స్ ఆఫ్ ఫైర్' ఆత్మకథ రాసుకున్నారు. అది 13 భాషలలో అనువాదమైంది. దేశం కోసం విశిష్ట సేవలు అందించిన ఈ మహామనిషి, కర్మయోగి 2015 జులై 17 షిల్లాంగ్ ఎ.ఐ.ఎం.లో విద్యార్థులనుద్దేశించి ప్రసంగిస్తూ తుదిశ్వాస విడిచారు.







# అది నావల్ల కాదు

## -రీతూవర్మ

**ఓ చిన్న సినిమా హీరోయిన్ జాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చుకోవడం అంటే సామాన్యమైన విషయం కాదు. ఆమెలో ఎంతో టాలెంట్ ఉంటే తప్ప అది సాధ్యం కాదు. అంతటి గుర్తింపు సొంతం చేసుకున్న హీరోయిన్ రీతూ వర్మ. 'ఎవడే సుబ్రమణ్యం', 'ప్రేమ ఇష్క్ కాదల్' సినిమాల్లో చిన్న పాత్రల్లో మెరిసిన రీతూ 'పెళ్ళిచూపులు'తో ఒక్కసారిగా జాతీయ స్థాయిలో గుర్తింపు పొందింది. ఈ రంగంలో గ్లామర్ అవసరమే అయినా దాన్ని నమ్ముకొని సినిమాలు చేయలేను అంటున్న రీతూ వర్మతో....**

### 'కేశవ' విజయాన్ని ముందే ఊహించారా?

ముందే సక్సెస్ సాధిస్తుంది అనుకున్నాను అంటే అతిశయోక్తి అవుతుంది. సినిమా కథ విన్నప్పుడే డిఫరెంట్‌గా అనిపించింది. ఈ సినిమాలో క్యారెక్టర్లు నిత్య జీవితంలో ఏదో ఒక సమయంలో ఎప్పుడో ఒకప్పుడు మనకు తారసపడుతూనే ఉంటాయి. అందుకే ఈ సినిమా ప్రేక్షకులకు నచ్చింది. నా అంచనా తప్పు కాలేదు.

### 'పెళ్ళిచూపులు' తరువాత ఇంత గ్యాప్ తీసుకోవడానికి కారణం?

రొటీన్ సినిమాలు చేయడం నా వల్ల కాదు. ఏవో మూడు పాటలు, నాలుగు డ్యాన్సులు ఉన్న క్యారెక్టర్లు చేయమంటే చేయలేను. నటనకు అవకాశం ఉన్న పాత్ర వస్తేనే చేయాలనే ఉద్దేశంతో ఇంతకాలం ఆగాను. 'కేశవ'లో నాకు నచ్చిన పాత్ర రావడంతో చేశాను. అలాగని గ్లామర్ రోల్స్ చేయను అని చెప్పలేను. నటనకు అవకాశం ఉన్న సినిమాలతో పాటు గ్లామర్ సినిమాలు కూడా చేస్తాను. ఈ రంగంలో గ్లామర్ ఎంత అవసరమో నాకు తెలుసు. అయినా ఈ గ్యాప్‌లో ఇతర భాషల్లో సినిమాలు చేశాను.

### 'కేశవ'లో అవకాశం ఎలా వచ్చింది?

'పెళ్ళిచూపులు' సినిమాలో నా నటన నచ్చి దర్శకుడు సుధీర్‌వర్మగారు నాకు ఈ అవకాశం ఇచ్చారు. ఈ సినిమా కథ వినగానే బాగా నచ్చింది. సహజంగా హీరో అంటే ఆరోగ్యంగా, ఎంత మందినైనా ఒంటిచేత్తో కొట్టేటట్టు ఉంటాడు. కానీ ఇందుకు భిన్నంగా 'కేశవ' హీరో కనిపిస్తాడు. అనారోగ్యంతో ఉన్నా, దాన్నే తన బలంగా చేసుకుని పగ తీర్చుకుంటాడు. ఈ కాన్సెప్ట్ చాలా నచ్చింది. ఇలాంటి సినిమాలు అరుదుగా వస్తుంటాయి. అసలు సినిమా మొత్తం సీరియస్‌గా సాగుతుంది. ప్రత్యేకించి డ్యాన్సులు, పాటలు ఉండవు. ఉన్న పాటలన్నీ సందర్భానుసారంగా వచ్చేవిగానే ఉంటాయి. ఇప్పటి వరకూ కొత్త జోనర్లోనే సినిమా చేయాలని ఆశగా ఉండేది. ఆ ఆశ ఈ సినిమాతో తీరిపోయింది. ఈ సినిమాలో చిత్ర క్యారెక్టర్ దాదాపు ప్రతి ఇంట్లోనూ కనిపిస్తుంది. సినిమా చూస్తున్న వారికి ఇది మనింట్లో జరిగే కథే, సన్నివేశాలు కూడా అలాంటివే అనిపిస్తుంది తప్ప సినిమా చూస్తున్నామన్న ఫీలింగ్ కలగదు. ఈ విషయంలో సినిమా యూనిట్ విజయవంతమైందనే అనుకుంటున్నాను.

### నిఖిల్ గురించి....

నిఖిల్ నాకన్నా చాలా సీనియర్. కానీ తనని చూస్తే అలా అనిపించదు. తన పాత్రకి వందశాతం న్యాయం చేయాలని చూసే వ్యక్తి. సినిమాల ఎంపిక విషయంలో నా ఆలోచనలు, తన ఆలోచనలు దాదాపు ఒకే విధంగా ఉంటాయి. ఈ సినిమా పూర్తయ్యేసరికి ఇద్దరి మధ్యా మంచి స్నేహం ఏర్పడింది.

### ఈ సినిమాలో నటించిన మరో సీనియర్ ఈషా కొప్పికర్ గురించి...

ఆవిడతో నాకు రెండు మూడు సీన్లు తప్పలేవు. మా మధ్య పరిచయం తక్కువే అయినా, తను బాగా కలిసిపోతుంది. సీనియర్ నటినన్న భావం ఆవిడలో నాకు కనిపించలేదు.





**టాలీవుడ్‌లో కన్నా కోలీవుడ్‌లో ఎక్కువ సినిమాలు చేస్తున్నట్టున్నారు?**

ఎక్కడ మంచి పాత్ర వస్తే అక్కడ చేస్తున్నాను. ఒక భాషకే లేదా ఒకే రకమైన పాత్రలకే పరిమితం కాదలుచుకోలేదు.

**గౌతమ్ మీనన్‌తో చేస్తున్న సినిమా గురించి....**

ఈ సినిమాలో అవకాశం వస్తుందని అస్సలు ఊహించలేదు. మొదట నాకు ఫోన్ చేసి స్క్రీన్ టెస్ట్‌కి రమ్మన్నారు. మామూలుగా పిలిచారు అనుకున్నానే తప్ప నాకు అవకాశం వస్తుందని అస్సలు ఊహించలేదు. టెస్ట్ అవగానే సెలెక్ట్ అయ్యానని చెప్పారు. ఎంత సంతోషం కలిగిందో చెప్పలేను. ఈ రంగంలోకి వచ్చినప్పటి నుంచీ ఆయనతో చేయాలని అనుకునేదాన్ని. అది ఇంత త్వరగా నెరవేరుతుందని ఊహించలేదు.

**విక్రమ్‌తో చేయడం ఎలా ఉంది?**

షూటింగ్ మొదటి రోజు విక్రమ్‌సార్‌తో చేయడం అంటే భయమేసింది. కానీ ఆయనంత మంచి మనిషిని ఇంతవరకూ చూడలేదు. షూటింగ్ మొదలైన కొద్దిసేపట్లోనే నా భయాలన్నీ పటాపంచలైపోయాయి. ఆయనతో చేయడం మరిచిపోలేని అనుభూతి. ఆయన దగ్గర నుంచి రోజుకో కొత్త విషయం నేర్చుకుంటున్నాను.

**ఎక్కువగా హర్రర్ సినిమాలే చేస్తున్నట్టున్నారు?**

కథ నచ్చితే చేస్తున్నాను తప్ప అది లవ్ స్టోరీనా, హర్రర్ స్టోరీనా? అని చూడడం లేదు. అలా అనుకుంటే 'పెళ్లి చూపులు'లాంటి సినిమా చేసేదాన్ని కాదుగా!

**గ్లామర్ పాత్రలు చేయకపోవడానికి కారణం?**

గ్లామర్‌గా కనిపించడం అంటే అందంగా కనిపించడమే కదా! లంగా ఓణీ, చుడీదార్, చీరలో కూడా అందంగా కనిపించవచ్చు. చిట్టిపొట్టి డ్రస్సుల్లోనే అందం ఉంటుంది అంటే నేను నమ్మను. గ్లామర్ పేరుతో అసభ్యంగా కనిపించడమంటే మటుకు నా వల్ల కాదు.

**తెలుగు బాగా వచ్చేసినట్టేనా?**

నేను హైదరాబాద్ అమ్మాయినే. ఇక్కడే పుట్టి పెరిగాను. ఇంజనీరింగ్ కూడా ఇక్కడే పూర్తి చేశాను. అయినా తెలుగు అంత బాగా అయితే రాదు. నా సీన్ల వరకూ బాగా వచ్చు. ఉత్తరాది అమ్మాయిని కావడంతో తెలుగు అంత స్పష్టంగా రాదు. భాష రాకపోతే సీన్ అంత బాగా పండదు. అందుకే అవసరమైనంత మేరకు తెలుగు నేర్చుకున్నాను. గతం కంటే ఇప్పుడు బెటర్ అనుకుంటున్నాను. తెలుగు అనే కాదు. ఏ భాషలో సినిమా చేసినా భాష తెలిసి ఉండడం ముఖ్యం. అప్పుడే హావభావాలు చక్కగా పలికించగలం. నేను ఏ భాషలో చేసినా, ముందు భాష నేర్చుకోవడానికి ప్రయత్నిస్తాను.

**ఈ రంగంలోకి రావాలని ఎందుకు అనిపించింది?**

'అనుకోకుండా' అనే షార్ట్ ఫిలిం అనుకోకుండానే చేశాను. అందులో నా నటనకు మంచి పేరుతో పాటు, అవార్డులు కూడా వచ్చాయి. దాంతో నా చదువుకి ఏ మాత్రం సంబంధం లేని ఈ రంగంలో స్థిరపడాలని నిర్ణయించుకున్నాను.

**సినిమాల్లోకి వస్తానంటే మీ పేరెంట్స్ ఏమనలేదా?**

సహజంగానే వారి భయాలు వారికి ఉంటాయి. షార్ట్ ఫిలిం ద్వారా నాకు వచ్చిన పేరు చూసి కాంప్రమైజ్ అయ్యారు. ఈ ఫీల్డులో క్లిక్ కాకపోతే నేను చదివిన చదువుకి మంచి ఉద్యోగం వస్తుందనే నమ్మకం నాకుంది. అలాంటి పరిస్థితి ఇప్పటి వరకూ నాకు ఎదురు కాలేదు.

**ఎలాంటి పాత్రలు చేయాలని అనుకుంటున్నారు?**

పక్కింటి అమ్మాయిగానో, గ్లామర్ డాల్‌గానో కనిపించాలని లేదు. త్వరత్వరగా సినిమాలు చేసెయ్యాలన్న తొందర లేదు. నెమ్మదిగా నాకు నచ్చిన పాత్రలే చేస్తాను. ఒక పాత్ర అంటే ఇష్టం, మరొక పాత్ర అంటే కష్టం అనుకోను. నాకు నచ్చిన పాత్రలే చేస్తాను. నచ్చకపోతే ఎలాంటి మొహమాటాలకీ పోను.

**ఈ రంగంలోకి వచ్చిన నాలుగు సంవత్సరాలలో దాదాపు ఎనిమిది సినిమాలే చేసినట్టున్నారు?**

ముందే చెప్పానుగా. పదులకొద్దీ సినిమాలు చేసేసి బోలెడంత డబ్బు సంపాదించాలన్న కోరిక నాకు లేదు. మనసుకు నచ్చిన పాత్రలు వస్తేనే చేస్తాను. లేకపోతే లేదు.

**తెలుగులో స్టార్ హీరోలతో చేయలేదన్న బాధ ఉందా?**

అస్సలు లేదు. నేనేమీ స్టార్ హీరోయిన్‌ని కాదు కదా? స్టార్ హీరోలతో చేయలేదు అని బాధపడడానికి. అయినా కోలీవుడ్‌లో విక్రమ్ సార్‌తో చేస్తున్నాను కనుక ఆ లోటు లేదు. భవిష్యత్తులో తెలుగులో కూడా పెద్ద హీరోలతో చేసే అవకాశం రావచ్చు.

**ఫ్యూచర్ ప్రాజెక్టులు?**

తెలుగు, తమిళంలో కథలు వినడం జరిగింది. ఇంకా ఎవరికీ ఓకే చెప్పలేదు.

**–స్పందన రెడ్డి**

# ప్రతి ఫ్రెండూ అవసరమేరా...

## –శరత్‌చంద్ర

**"ఇది చాలా దారుణం సర్..." అంది సంజన.**
**"ఏది?" అడిగాడు కార్తికేయ.**
**"కంపెనీలో శ్రమ అంతా మీది...లాభాల్లో అతనికి సమాన వాటా"**
**"జస్ట్ షట్... అప్.." చిరుకోపం ప్రదర్శించాడు కార్తికేయ.**
**"నేను మేమ్‌తో 'డిస్కస్' చేస్తాను.." మొండిగా అంది సంజన.**
**"గెటవుట్ ఫ్రమ్ హియర్.." ఈసారి కాస్త కోపంగానే అన్నాడు.**

"మీ ఉప్పు తినేప్పుడు 'నిజాలు' చెప్పడం నా ధర్మం, గో టు హెల్.." అంతే కోపంతో ఆడిట్ చేసిన ఫైల్ 'బాస్' టేబుల్ మీద విసురుగా పెట్టి వెళ్ళింది సంజన.

"క్రేజీ" అనుకున్నాడు ఫైల్‌వైపు చూస్తూ.

అతడి పార్టనర్ అవినాష్ గుర్తొచ్చాడు.

"వీడు ఇప్పుడు ఏ ప్యారిస్‌పిల్ల కౌగిట్లోనో, జపాన్‌లో 'కాసినోవా' లోనో ఉండి ఉంటాడు. ఫోన్ లిఫ్ట్‌చేయడు వెధవ" ముద్దుగా విసుక్కున్నాడు.

టేబుల్‌మీద సంజన పెట్టిన 'ఫైల్‌వైపు చూశాడు.

ఐ.టి. రిటర్న్ కోసం కంపెనీ ఆదాయం సమానంగా పంపిణీ చేస్తూ తయారుచేసిన ఫైల్. 'నాటీ గర్ల్' అనుకున్నాడు. తను కాస్త ఎక్కువ చొరవ తీసుకుంటుంది. దానికి కారణం కూడా తనే.

కంపెనీని ఎంత జాగ్రత్తగా చూసుకుంటుందో తన విషయంలో కూడా అంతే కేరింగ్‌గా ఉంటుంది అనుకుని ఆమెకోసం కాసేపు ఎదురు చూశాడు. నాలుగవుతోంది. సంజన రాలేదు. తిట్టానని అలిగిందా?

తనకు అన్నీ సమయానికి సమకూర్చిపెడుతూ ఉంటుంది.

స్నాక్స్‌లో మొలకెత్తిన గింజలు పంపుతుందా? లేక తనే స్వయంగా తెస్తుందా?

గడియారం వైపు చూశాడు. మూడు యాభై తొమ్మిది.

'టంచన్'గా బెల్ కొట్టినట్టు, మొలకెత్తిన గింజలు ఒక ట్రేలో తెచ్చింది.

పక్కన మరో రెండు బిస్కట్స్ కూడా ఉన్నాయ్.

"షి ఈజ్ మోస్ట్ ప్రొఫెషనల్...బట్ ఆల్ సో లవ్లీ" కార్తీకేయ పెదవులపై చిరునవ్వు.

'సర్వ్' చేస్తుంటే "కోపం వచ్చిందా.." అని అడిగాడు.

"నథింగ్ సర్. నా ఫీలింగ్స్ చెప్పడం నా ధర్మం, పైగా మీరు నాకు అన్నం పెడుతున్న "బాస్" అంది. 'అన్నం' ఒత్తి పలుకుతూ.

"ఇట్సోకే... వసంతకు ఏం చెప్పకు"

"ఆల్రెడీ చెప్పాను సర్... మేడమ్ ఆన్ ది వే" అంది నవ్వును తొక్కిపెడుతూ...

"రాక్షసీ... గెట్ లాస్ట్.." అన్నాడు కోపంగా మరో సారి.

"మీరు ఎమోషన్స్ బ్యాలెన్స్ చేసుకోవాలి సర్.. ప్రస్తుతానికి మీకు డయాబెటీస్ మాత్రమే, ఇలాగే ఎమోషనల్ అవుతుంటే బి.పి. కూడా ట్రేస్ అవుట్ అవుతుంది. అప్పుడు అగ్నికి ఆజ్యం తోడవడం, అది మీ హెల్త్‌ని దెబ్బతీయడం, పరిస్థితి హార్ట్‌ఎటాక్ దాకా వెళ్ళడం....

అమంగళం అప్రతిహతమగుగాక.. మీకేదైనా జరిగితే మీ ప్రియమిత్రుడు, వన్ ఆఫ్ ది కంపెనీ డైరెక్టర్స్ అవినాష్ సర్ ఈ బిజినెస్‌ని ప్రాపర్‌గా 'ట్యాకిల్' చేయలేడు. తత్ఫలితంగా కంపెనీ ఒడిదుడుకులకు లోనవుతుంది. మిగిలిపోయిన ఆస్తులతో మీరంతా బాగానే ఉండవచ్చు, మిమ్మల్ని నమ్ముకుని బ్రతుకుతున్న ఫ్రెండ్‌మీద కోపంతో మమ్మల్ని మాత్రం ఏ కంపెనీ 'అకామిడేట్' చేసుకోదు" చెప్పింది సంజన ఖరీదైన రెనాల్డ్ పెన్ను నోట్లో తచ్చాడిస్తూ.

ఇక వెళ్ళమన్న ఉద్దేశంతో, "అయిపోయిందా.." అన్నాడు

"నో సర్, ఓ కప్పు జీరో ఫ్యాట్ మిల్క్ ఇచ్చి ఈ గదినుండి 'లీవ్' తీసుకుంటా, వసంత మేమ్ వస్తుంది కదా.. మిగతా 'సబ్జెక్ట్' ఆమే చూసుకుంటుంది" కూల్‌గా చెప్పింది.

'అదొక రాక్షసి.. దాన్నెందుకు దించుతున్నావ్..'



కాస్త భయం, కోపం మేళవించాడు.

"దట్స్ గుడ్... ఆ భయం ఉండాలి సర్. టన్నుల కొద్దీకాదు.. కాస్త ఉంటే చాలు.." అని ఫ్లాస్క్‌లో పాలు కప్పులో ఒంపిచ్చి బైటకు నడిచింది.

"బ్రహ్మరాక్షసి..." అనుకున్నాడు. అవినాష్ ఉంటే ఈ అఫీషియల్ పంపకాలకి ఒప్పుకోడని అతడు 'ఫారెన్'లో ఉండగా అదునుచూసి 'కంపెనీ' యాక్ట్ ప్రకారం అన్నీ పుల్‌ఫిల్‌చేసే నా ప్లాన్‌ని 'దయ్యం' ఈ సంజన తలక్రిందులు చేసేలా ఉందే! చొరవ 'మిస్యూజ్' చేస్తోందా..? గొణుక్కున్నాడు.

అసలు సంజన రిక్రూట్‌మెంటే తమాషాగా జరిగింది. 'కిమ్స్'లో డయాబెటీస్ చెకప్‌కెళ్ళినప్పుడు పరిచయం సంజన. డాక్టర్ ఇందిర పరీక్షలన్నీ చేసి డైటీషియన్ సంజన దగ్గరకు పంపింది. సంజన మాటతీరు, 'ఖచ్చితత్వం' తనకెంతో నచ్చింది. మాటల మధ్య ఎం.బి.ఏ చేసినట్టు చెప్పింది. ఆ చొరవ, నమ్రత గురించి చెప్పిన తర్వాత వసంత కూడా తన ఆలోచనకు 'ఓకే' చెప్పింది.

కానీ తనలోని మరో ఆలోచన వసంతకు చెప్పలేదు. అదిరిపోయే ఆఫర్ ఇచ్చాడు. దాంతో తన కంపెనీలోకి 'జంప్' అయ్యింది సంజన. అందరికీ తలలో నాలుకగా మారింది. ముఖ్యంగా కార్తికేయను అట్రాక్ట్ చేసింది ఆమె 'మ్యారేజీ' బ్యాక్ గ్రౌండే. ఒంటరి జీవితం.

అరగంట తర్వాత వసంత రావడంతోనే 'కంపెనీ ఆడిటర్‌ని పిలిపించండి" అంది.

"ఇప్పుడెందుకు" అన్నాడు కార్తికేయ చిరాగ్గా.

"ప్లీజ్ పిలిపించండి" ఇక 'తప్ప'దన్నట్టు 'సంజన' ద్వారా మెసేజ్ 'పాస్' చేశాడు.

'సంజన' కిసుక్కున నవ్వుకుంది. 'అయ్యింది అయ్యగారి పని' అనుకుంది. కూల్‌గా తన చాంబర్‌లోకి వెళ్ళిపోయింది.

కానీ కథ అనూహ్యమైన మలుపు తిరిగింది. ఆడిటర్ సుబ్బరామన్ వచ్చాడు.

"మిస్టర్ రామన్.. ఫిఫ్టీ.. ఫిఫ్టీ క్రింద ఆదాయం చూపించి కదా డాక్యుమెంట్ ఐటీకి సబ్మిట్ చేస్తున్నారు దాన్ని సిక్స్టీ ఫార్టీ చేయండి" చెప్పింది.

"సిక్స్టీ సార్‌కి, ఫార్టీ అవినాష్‌గారి పేరుమీదా మేడమ్" అడిగాడు.

"కాదు.. ఫార్టీ మనకి సిక్స్టీ అవినాష్‌గారి పేరు మీద" చెప్పింది.

అదిరిపడ్డాడు సుబ్బరామన్.. "వ్వాట్..." కీచుగా అరిచాడు.

"సర్‌ప్రైజ్ అయ్యింది చాలు, ఫైలు తయారు చేసి కాపీ ఒకటి నాకు 'సెండ్' చేయండి" చెప్పి అంతే వేగంగా దిగి క్రిందికి వచ్చింది. మేమ్ వెళ్తున్న విషయం తెలిసి సంజన ఆమెని కారు దాకా వెంబడించింది.

"థాంక్స్ సంజన... రైట్ టైమ్‌లో ఎలర్ట్ చేశావ్"

సంజన ముఖం మతాబులా వెలిగింది.

"చెప్పడం నా బాధ్యత అన్పించింది మేమ్"

"గుడ్ కీపిటప్" అంది వసంత. గంట తర్వాత ఆడిటర్ చెప్పిన విషయం విని "కెవ్వుకేక.." అంది నెగెటివ్ ఎక్స్‌ప్రెషన్‌తో.

పర్మిషన్ కూడా లేకుండా కార్తికేయ చాంబర్‌లోకి వచ్చి.

"హౌ ఇటీజ్...? మేమ్‌ని కూడా మార్చేశారా?" కాస్త కోపంగా అంది.

"ఎక్కువ 'టెంప్ట్' అయితే బి.పి. షుగర్స్ వచ్చే ప్రమాదం ఉంది.." అన్నాడు కూల్‌గా కార్తికేయ.

"ఇక నేను ఈ ఉద్యోగం చేయను"

"టూ ఇయర్స్ కంపెనీకి బాండ్ రాశావ్, నీకా



అవకాశం లేదు"

"ఆ బాండ్ మడిచీ...."నోటిదాకా వచ్చిన మాట తమాయించుకుంది. "అది ఐదేళ్ళ క్రితంనాటిది. ఇది సిక్స్‌త్ ఇయర్" కోపంగా గుర్తుచేసింది.

"అగ్రిమెంట్స్ ఇయర్లీ రెన్యువల్ అవుతాయి ఘనతవహించిన పర్సనల్‌సెక్రటరీగారు మర్చి పోయినట్టున్నారు" అన్నాడు.

"ఏంటో ఈ మెంటల్ సంత. వేగలేకపోతున్నా" గొణుక్కుంటూ బైటకొచ్చింది.

అవినాష్ ఫారిన్ నుంచి తిరిగొచ్చాక తన టేబుల్‌మీద ఫైల్ చూసి సుబ్బరామన్‌ను పిలిచాడు. "ఏంటి ఇలా రిటర్న్స్ ఫైల్ చేశావు?" అడిగాడు కోపంగా.

"సర్ చెప్పారు.."

అవినాష్ కళ్ళు గిర్రున తిరిగాయ్.

"ఓ..కే యు కెన్ గో.." అన్నాడు తమాయించుకుని. కార్తికేయకు రింగ్‌చేశాడు. "వాట్ డార్లింగ్ ఎప్పుడొచ్చావ్.." అడిగాడు కార్తికేయ.

"ముందు ఇది చెప్పరా...ఈ పంపకాలేంటి?" అడిగాడు కోపంగా.

"అదా... వసంత డెసిషన్.." కూల్‌గా అన్నాడు.

"వసంత ఇలా కూడా చేస్తుందా?" అని ఫోన్ కట్ చేశాడు.

కార్తికేయ రెండుసార్లు కాల్‌బ్యాక్ చేసినా అవినాష్ ఫోన్‌లిఫ్ట్ చేయలేదు.

"మూడీ ఫెలో.." నవ్వుకున్నాడు.

"నేను మడ్‌బాత్‌కి వెళ్తున్నా, అర్జెంట్ సైనింగ్స్ ఉంటే అవినాష్‌కి పంపించు" సంజనకి కాల్‌చేసి చెప్పాడు.

"ఎస్.. సర్.." అందామె.

ఓ గంట తర్వాత బాంబ్‌లాంటివార్త!

కంపెనీనుండి వైదొలుగుతున్నట్టు ఆఫీసుకు మెయిల్‌పంపాడు అవినాష్.

'వ్వాట్..' అంటూ తల బద్దలు కొట్టుకుంది సంజన.

కార్తికేయగారు ఎలా రియాక్ట్ అవుతారో? అనుకుంటూనే మెసేజ్ పాస్ చేసింది.

ఒంటికి పూసుకున్న బురద కడుక్కుని నేరుగా ఆఫీస్‌కు బయలుదేరాడు కార్తికేయ.

అతడికి చెమటలు పడుతున్నాయ్.

వీడిలా ఎందుకు చేశాడు? సంజన, వసంత వీణ్ణి అనవసరంగా డిస్టర్బ్ చేశారు. తనకన్నా పది శాతం ఎక్కువ 'షేర్స్' అవినాష్‌కి కేటాయిస్తే, 'వాడు ఆనందపడతాడులే' అనుకున్నాడుగానీ బూమరంగ్ అవుతుందనుకోలేదు.

అసలు వాడిగురించి వీళ్ళకేం తెలుసు? అవినాష్‌ని మైనస్ చేస్తే కార్తికేయ శూన్యం...! జ్ఞాపకాలు సుళ్ళు తిరిగాయ్.

***

నాన్న చిన్నపాటి టీచరు.. రోడ్డు ప్రమాదంలో కాలంచేస్తే అమ్మే ఫ్యామిలీని లీడ్ చేసింది. చాలీచాలని ఆదాయం. మార్నింగ్ న్యూస్‌పేపర్లు వేస్తూ, పాలప్యాకెట్లు అమ్మేవాడు తను.

ఆ కొద్దిపాటి డబ్బు అమ్మకిస్తే ఎంతో సంతోషపడేది. పాత న్యూస్‌పేపర్లు కొని తెచ్చి 'కవర్లు' చేసి వాటిని దుకాణాల్లో  అమ్మేవాడు. పచ్చళ్ళ సీజన్లో టమోటా, పుల్లమామిడికాయ అమ్మచేత ఊరగాయ పెట్టించేవాడు.. తనలోని వ్యాపార నైపుణ్యాన్ని అమ్మ మెచ్చుకునేది. విధి బలీయం. అమ్మ ఆరోగ్యం క్షీణించి కళ్ళముందే రాలిపోయింది. ఆఖరి క్షణాల్లో కన్నీరు పెట్టుకుని "కార్తీ... మీ నాన్న నాకు అన్యాయం చేసి వెళ్ళిపోయారు, ఇప్పుడు నేనూ మీకు అన్యాయం చేసి వెళ్తున్నాను. చెల్లాయిల్ని తమ్ముణ్ణి నీ శక్తిమేర చదివించు. నీలో పట్టుదల, కార్యదక్షత ఉన్నాయి. ఏదోఒకరోజు నువ్వు మంచి బిజినెస్‌మాగ్నెట్ అవుతావు" అమ్మ కళ్ళు మూతలు పడ్డాయి. కార్తికేయ గుండె బ్రద్ధలైంది. ఎదురుగా అమాయకత్వం నిండిన ఇద్దరు చిన్నారిచెల్లెళ్ళు, తమ్ముడు. వారిని పొదివి పట్టుకుని ఏడ్చాడు.

"ఏడవకు అన్నయ్యా..." అంటూ అతన్ని ఓదార్చారువాళ్ళు. నాన్న పెద్దక్కయ్య సుశీల విడో. వాళ్ళకి తోడుగా ఉండేందుకొచ్చింది. "ఎలా ఈదు కొస్తావురా ఈ కుటుంబాన్ని.." అంటూ తనని పొదివి పట్టుకొని ఏడ్చేసింది.

"నువ్వు వర్రీకాకు అత్తా... నాన్నఫించన్‌తో పాటు నేనూ ఎక్కడో ఒకచోట పనిలో జేరతా. చెల్లాయిల్ని, తమ్ముణ్ణి చదివిస్తా" ఆరిందాలా




**వాళ్ళిద్దరూ  స్నేహితులు. వ్యాపార భాగస్వాములు. కార్తికేయ కంపెనీకోసం  ఒళ్ళొంచి కష్టపడతాడు. అవినాష్ మాత్రం అమ్మాయిలతో  పారిస్‌లోనో మరోచోటో ఎంజాయ్ చేస్తూ ఉంటాడు. ఆడిటర్ రిటర్న్స్ ఫైల్ చేసేటప్పుడు ఇద్దరికీ సమానవాటా  పంచాడు కార్తికేయ. అక్కడ మొదలైంది  అసలు సమస్య. చినికి చినికి గాలివానగా మారింది. చివరకు ఆ స్నేహితులు విడి పోయారా? లేక కథ సుఖాంతమైందా?**

చెప్పాడు తను.

"చాలా తెలివైన బిడ్డవు, నువ్వు చదువుకోవాలిరా" అంది.

'పర్వాలేదత్తా... ప్రైవేటుగా చదువుతా. ఎం.బి.ఏ చేసి బిజినెస్ మాగ్నెట్ అవుతా, అమ్మ కల నెరవేరుస్తా" చెప్పాడు తను. అత్త మురిసిపోతూ తనను కౌగిలించుకుంది. తాను స్కూలుకి డుమ్మా కొట్టాడు. అదిగో అప్పుడే ఎంటరయ్యాడు అవినాష్. తనను వెతుక్కుంటూ ఇంటికొచ్చాడు.

"అదేంట్రా స్కూలుకు రావడం లేదు. రోజూ నీకు ఆబ్సెంట్ పడుతోంది. నాకేమీ అర్థంకాక వెతుక్కుంటూ వచ్చా" అన్నాడు. జరిగినదంతా చెప్పాక "అయ్యో సారీరా... మరి నీ లైఫ్ ఎలారా?" అడిగాడు ఆందోళనగా.

"ప్రైవేటుగా చదువుతా" అన్నాడు.

"భలేవాడివే! టెన్త్ పబ్లిక్ పరీక్షరా.. ఆ మార్కులే నీ కెరీర్‌ని నిర్ణయిస్తాయి" అన్నాడు.

మొదటిసారి అవినాష్‌వైపు తేరిపార చూశాడు కార్తికేయ. అవినాష్ డిపెండెంట్. మాస్టరు చెప్పేది ఫాలో కాలేకపోయేవాడు. నోట్సు రాసుకోలేక తన వెంట పడేవాడు. తానే రాసిచ్చే వాడు. అందుకు కృతజ్ఞతగా, ఇంటర్వెల్‌లో ఐస్‌క్రీం వగైరా యిప్పిస్తున్నాడేమో అనుకున్నాడు కానీ... తన గురించి ఇంత సీరియస్‌గా ఆలోచిస్తాడని కార్తికేయ ఊహించలేదు.

"ఏదో షాపులో జేరానన్నావుకదా... అక్కడ జీతం ఎంతిస్తార్రా"

"నాలుగువేలు.."

"సర్లే... చల్ నాకు మా నాయన, హాస్టల్ ఫీజులు, ఖర్చులకి నెలకు పదివేలిస్తున్నాడు. నేనూ మీ ఇంటికొచ్చేస్తా... ఆ పైసలన్నీ నువ్వే తీసుకో... మార్నింగ్ నీతో పాటు నేనూ పేపర్ వేస్తా... ఇద్దరం కలిసి చెల్లాయిల్ని చదివిద్దాం.. ఏమంటావ్" అడిగాడు అవినాష్. కార్తికేయకు కన్నీరు ఆగలేదు.

అవినాష్ వితరణ గుణాన్ని సుశీల అత్త ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది. "నీలో మా అమ్మానాన్నా ఆవహించార్రా.." ఆర్తిగా కౌగిలించుకున్నాడు కార్తికేయ.

"దీనికి ఏడుపా?" అంటుంటే అవినాష్ సెల్ మ్రోగింది. ఆ రింగ్‌టోన్ అంటే కార్తికేయకు చాలా ఇష్టం.

"అరేయ్ ఇంకోసారి వినిపించరా..." అనేవాడు. ఇద్దరి కళ్ళూ మరోసారి కలుసుకున్నాయ్.



## ఆలయాల్లో స్వీటీ పూజలు

*ఓ సినిమా విడుదలకు ముందు హీరోయిన్లు ఆలయాల్లో పూజలు చేశారంటే అర్థం చేసుకోవచ్చు. ఎందుకంటే తను నటించిన సినిమాను సక్సెస్ చేయమని ఆ భగవంతుడిని ప్రార్థిస్తుందేమో అని సరిపెట్టుకోవచ్చు. కానీ టాలీవుడ్ జేజమ్మ నటించిన 'బాహుబలి-2' దేశంలోనే అతి పెద్ద విజయం సాధించింది. భవిష్యత్తులో ఆమె నటించి విడుదల కాబోతున్న సినిమాల మీద కూడా బోలెడన్ని అంచనాలు ఉన్నాయి. ప్రస్తుతం అపజయం అన్నది అనుష్క కనుచూపు మేరలో లేదు. అలాంటప్పుడు అనుష్క తన కుటుంబ సభ్యులతో కలిసి కర్నాటకలోని ప్రసిద్ధ గుళ్ళల్లో తెగ పూజలు చేసేస్తోంది. ఈ జేజమ్మ వెంట తల్లి, సోదరుడు కూడా ఉండడం విశేషం. త్వరలోనే అనుష్క పెళ్ళి చేయాలని ఆమె ఇంటి వారు తొందరపడుతున్నారనీ, అందుకే ఈ పూజలూ పునస్కారాలూ అని సినీ జనాలు అంటున్నారు. ఈ పూజలు ఎందుకోసమో అనుష్క చెప్పేంతవరకూ ఊహాగానాలకు తెరపడదు.*

ఇద్దరూ ఒకేసారి అన్నారు. "ప్రతి ఫ్రెండూ అవసరమేరా.." గొంతు కలిపారు ఇద్దరూ.

"అరేయ్ కార్తీ మా నాన్న కాల్ చేశాడు. ఒక్క నిమిషం" అని తండ్రికి కాల్‌బ్యాక్ చేశాడు.

అవినాష్ తండ్రి భూపతిరాజు కొడుకును మంచి చదువుకోసం పట్టణంలో పెట్టి చదివిస్తున్నాడు. భూస్వామి కుటుంబం.

"నాన్నో నేనే చేద్దామనుకున్నాను. ఈలోపే నువ్వు చేశావు. ఏంటి విషయం" అడిగాడు. ఆc..ఆc...

"బాగానే చదువుతున్నా... మరో ముఖ్య విషయం.. నా ఫ్రెండ్ కార్తికేయ బాగా చదువుతాడని చెప్పాచూడు. వాడి ఇంట్లోకి షిఫ్ట్ అయిపోతున్నా... అక్కడే ఉండి బాగా చదువుకుంటా. హాస్టల్లో కట్టే పైసలు వాడికిచ్చేస్తా... ట్యూషన్‌కి వెళ్ళే శ్రమ కూడా ఉండదు. వాడే నాకు అన్నీ చెబుతాడు.. ఏమంటావు" అడిగాడు.

"నీదంతా స్పీడేరా, మేం చెబితే మాత్రం వింటావా పాడా..? సర్లే, విషయం ఏంటంటే సంక్రాంతికి బట్టలు తీయడానికి నేనూ మీ అమ్మా రేపు వస్తున్నాం" చెప్పాడు వాళ్ళ నాన్న.

"నా ఫ్రెండ్ ఫ్యామిలీకి కూడా తీయాలి" కండిషన్ పెట్టాడు అవినాష్.

"సర్లేరా, అట్నే..." అంటూ ఫోన్ పెట్టేశాడు భూపతిరాజు. అవినాష్ కళ్ళెగరేస్తూ, "డోంట్‌వర్రీ కార్తీ, ఈనెల నుండి ట్యూషన్‌కోసం మరో రెండు వేలు నాన్నకి ఫైన్ వేస్తాలే" చెప్పాడు నవ్వుతూ. అది మొదలు అవినాష్, తన జీవితంలోని ప్రతిదశలోనూ పెనవేసుకుపోయాడు. తానిక వెనుదిరిగి చూడలేదు. తన బిజినెస్‌కు మూలధనం అవినాష్‌దే.

రాత్రింబవళ్ళు కష్టపడి తనే బిజినెస్ పెంచాడు.

"ఈ బిజినెస్ ఈ స్థాయికి రావడానికి కారణం నీ కృషి, శ్రమ, పట్టుదలే కారణం. నాకు మెయింటెనెన్స్ ఇవ్వుచాలు" అనేవాడు అవినాష్. "పళ్ళూరాలగొడతా ఫిఫ్టీ ఫిఫ్టీ.." చెప్పాడు. నవ్వుతూ 'ఓకే' చెప్పాడు. రాతపత్రాలు వగైరా ఏమీలేవు కానీ.. అదే దామాషాలో విషయం నడుస్తోంది. అవినాష్ భార్య కాలం చేసింది. పిల్లలు 'స్టేట్స్'లో చదువుతున్నారు. ఒంటరిపక్షి దేశాలు పట్టి తిరుగుతున్నాడు.

అఫీషియల్‌గా అతడి వాటా డిసైడ్‌చేసి పేపర్స్ తయారుచేయమని చెబితే 'సంజన' కంగాళీ చేసింది. ఇప్పుడు వీడెందుకు హర్టయ్యాడో తెలియదు. 'హి ఈజ్ టూ సెన్సిటివ్' తల పట్టుకున్నాడు కార్తికేయ. కారు వేగంకన్నా తన ఆలోచనల వేగం పెరిగింది. సంజన గుర్తుకొచ్చింది.

తాను సంజనను జేరదీయడానికి కారణం అవినాషే.

చాలా ఒద్దికైన వ్యక్తి. నమ్మకస్థురాలు. తన కుటుంబంలో భాగమై పోయింది. వసంతకు మరీ ఇంటిమసీ ఎక్కువ. సంజన డైవోర్సీ. ఎందుకో మొదట్నించీ అవినాష్ అంటే సంజనకు సదభిప్రాయం లేదు.

అతన్ని ఒక ఇర్రెస్పాన్సిబుల్ పర్సన్‌గా చూస్తుంది గానీ అవినాష్ తన జీవితంలో భాగం. అవినాష్ లేకపోతే తాను లేడన్న విషయం సంజనకు తెలియదు. వసంతకు తెలిసినా తెలియనట్టు నటిస్తుంది.

అవినాష్ గురించి చెబుతుంటే వినీ విననట్టు 'యాక్ట్' చేస్తుంది. "అదంతా గతం కదా కార్తీ, బిజినెస్‌మీద ఇప్పటికైనా అతన్ని దృష్టి పెట్టమను" అంటుంది.

"పిచ్చీ... మన కంపెనీకివచ్చే ప్రతీ కాంట్రాక్టూ వాడి యారోగెన్సీ ద్వారా సాధించిందే. వాడి బంధువులే నలుగురు మినిస్టర్లు ఉన్నారు. మా కంపెనీకి ఇవ్వాల్సిందే అని బెదిరించి తెస్తుంటాడు. వాడి ఇన్వాల్వ్‌మెంట్ లేకపోతే బిల్స్ కూడా పెండింగ్ పడుతుంటాయ్. ఇదంతా నీకు తెలియదా" అంటే.

"సర్లేండి.. మీ స్నేహితుడిగొప్పని మాత్రం కొండంతచేసి చెబుతారు. ఏం? మీరు సిన్సియర్‌గా 'వర్క్' చేయరా.. డే అండ్ నైట్ వర్క్. పూర్తయ్యే వరకూ నిద్రపోరే. మీకన్నా డిసిప్లిన్‌గా ప్రాజెక్ట్ పూర్తిచేసే వాళ్ళు గవర్నమెంట్‌కి దొరుకుతారా?" అని తనను ఆకాశానికి ఎత్తేసేది.

"సర్లే కాకిపిల్ల కాకికి ముద్దు, నా ఫ్రెండే నాకు ముద్దు" అని నవ్వేసేవాడు.

"అయినా అన్నింటికీ ఉంటుందో హద్దు" ఎద్దేవా చేసేది. నవ్వుకునేవాడతను.

సంజన పర్సనల్ సెక్రటరీగా జాయిన్ అయినప్పటి నుంచీ చాలా విషయాల్లో తనే డిసిప్లిన్ మేకర్‌గా మారింది. వసంతకుకూడా సంజన పర్ఫార్మెన్స్ మీద నమ్మకం.

తాను కూడా ఆ చొరవ ఇచ్చేవాడు. ప్రతి పండక్కీ 'రిషి వ్యాలి'లో చదువుతున్న తన కూతురితోసహా అటెండ్ అయ్యేది. తనూ యారొగెంట్ ఉమన్. కానీ తన విషయంలో అత్యంత భక్తిశ్రద్ధలు చూపేది. దానికి కారణం కంపెనీని దైవంలా భావించే తన సిన్సియారిటీ. రెండుమూడు సార్లు సంజన, అవినాష్‌లను కూర్చోపెట్టి 'ఇంటిమసీ' డెవలప్‌చేయాలని ప్రయత్నించాడు. తనవల్ల కాలేదు. ఒకసారి సంజనతో అవినాష్ విషయం ప్రస్తావించాడు. 'డెఫినెట్లీ నో సార్. నాకు మళ్ళీ పెళ్ళి చేసుకునే ఆలోచన అస్సల్లేదు. మీ ఫ్రెండ్‌ని నా హబ్బీగా అస్సలూహించుకోలేను.." కరాఖండిగా చెప్పింది.

అవినాష్‌తో బంధం పెంచేందుకు పని పేరుతో సంజనను అతని దగ్గరకు పంపేవాడు.

"అరేయ్... మీ సెక్రటరీ నీ కంటే పనిరాక్షసి.. 'ఫైల్స్' పూర్తిగా చూడమని ప్రాణాలు తీస్తుంది.

తనతో వేగడం నావల్ల కాదు. నా దగ్గరకు పంపకురా బాబూ" అని చేతులెత్తేస్తాడు అవినాష్.

కంపెనీ బిజినెస్ వ్యవహారాలు బ్రీఫింగ్ చెయ్యమని పంపిస్తే 'గ్రాఫ్స్' వేసి మరీ చూపించేది.

"సంజనా... ఇవన్నీ నాకు బోర్.. ఎక్కడ సంతకం పెట్టాలో చెప్పండి" అనేవాడు. అప్పట్నించీ అతనంటే నెగెటివ్ థింకింగ్ మొదలైంది. 'తిని కూర్చునే బ్యాచ్' కింద డిక్లేర్ చేసింది.

కంపెనీ యజమాని కూడా కార్మికుడిలా కష్టపడాలనేది ఆమె నేర్చిన వ్యాపార నిబంధన. దాన్ని అవినాష్ రూల్అవుట్ చేస్తున్నాడని ఆమెకు కసి. అందుకే ఈ ఉపద్రవం సృష్టించింది. ఆఫీసుకు చేరుకోవడంతో ఆలోచనలనుండి తేరుకున్నాను. సంజన ఎదురు చూస్తోంది. ఎందుకో ఆమె ముఖంలో చాలా టెన్షన్. "అవినాష్ ఎక్కడున్నాడో ట్రేస్ చెయ్ సంజూ" అప్పటికే పదిసార్లు కాల్ చేసి ఉన్నాడు.

"ఎస్సర్..ఎస్సర్" అంది. ఆమెకి చెమటలు పడుతున్నాయ్.

కార్తికేయ ఇంత నెర్వస్ కావడం ఆమె ఇంతవరకూ చూడలేదు.

తన బాస్‌కి అవినాష్ స్నేహితుడని తెలుసు




గానీ, ఆ బంధం ఇంత బలీయమైందని ఊహించలేదు సంజన. అవినాష్ సెల్‌ఫోన్ స్విచ్ఛాఫైంది.

అతడు ఉండే ప్రాంతాలన్నింటికీ మనుషుల్ని పంపింది. అన్ని వైపుల్నించీ నెగెటివ్ సమాధానమే.

"మేమ్.. మీరు రావాలి.. ఈ సబ్జెక్ట్‌లో ప్యాచ్ వర్క్ మీరే చెయ్యాలి" ఆత్రుతగా చెప్పింది.

కార్తికేయ నెర్వస్ అవుతున్నాడని తెలిసి వసంత వెంటనే బయలుదేరింది.

గంటతర్వాత కార్తికేయ చాంబర్‌లో ముగ్గురూ సమావేశమయ్యారు. కార్తికేయ ముఖంచూసి వసంత, సంజనా ఏం మాట్లాడడం లేదు. తుఫాను ముందు ప్రశాంతతలా ఉంది. కార్తికేయలో అంతటి ఆగ్రహం, ఆవేదన వాళ్ళెప్పుడూ చూడలేదు.

ఏం మాట్లాడితే ఏం అంటాడో అని బిక్కుబిక్కుమని చూస్తున్నారు. కార్తికేయ స్వరం కదిపాడు.

"ఏం మానవసంబంధాల కంటే బిజినెస్ చాలా గొప్పదా? అవినాష్ అనేవాడే లేకపోతే కార్తికేయ లేడు. వీడి జీవితంలో వసంతం లేదు. వీడి చెల్లెళ్ళూ తమ్ముడూ విదేశాల్లో చదివేవాళ్ళే కాదు. దర్జాగా అక్కడే సెటిలయ్యేవాళ్ళూ కాదు. ఆ విషయం తెలుసా మీకు? వాడు బిజినెస్ చేయడు. చేయాల్సిన అవసరం కూడా లేదు.

వెయ్యిఎకరాల ఆసామి వాడు. కేవలం నన్ను చూడ్డం కోసమే వాడు ఆఫీసుకు వస్తున్నాడు. మీకో విషయం తెలుసో లేదో వాణ్ణి చూడకపోతే నాకు పిచ్చెక్కిపోతుంది తెలుసా? వెళ్ళండి... వెళ్ళి ఏదో ఒకటి చేసి నా స్నేహితుణ్ణి నాకు తెచ్చివ్వండి.

చూడు సంజనా.. నీకు ఈ కంపెనీలో నా తర్వాత స్థానం ఎందుకిచ్చానో తెలుసా? వాడికి అత్యంత ప్రియమైన భార్య లావణ్య కారుప్రమాదంలో మరణించింది. ఆ కారులో వాడు కూడా ఉన్నాడు. నేనుపోయి నా లావణ్య బ్రతికుంటే బావుండేదని రోజూ కునారిల్లుతుంటాడు. నువ్వు నాకు నచ్చావు.. నీ కమిట్‌మెంట్, సిన్సియారిటీ నచ్చింది.

ఏదో ఒకవిధంగా వాడి జీవితంతో నిన్ను ముడివేయాలన్న నా తపనను నువ్వు కుప్పకూల్చావు. నేను ప్రయత్నించిన ప్రతీసారీ 'నో' చెప్పావ్.

ఈ రాక్షసితో చేతులు కలిపి నాకు నా స్నేహితుణ్ణి దూరం చేశావు"

కార్తికేయ కళ్ళలో నీళ్ళు ధారాపాతమవుతున్నాయి. ఇద్దరాడవాళ్ళకీ కాళ్లూ చేతులూ ఆడలేదు.

"కార్తీ.... ప్లీజ్ కూల్‌డౌన్... నావల్ల ఈ తప్పు జరిగింది. నేనే దీన్ని 'సాల్వ్' చేస్తాను.

నిన్ను సంతోష పెడతాను. ప్లీజ్ నన్ను నమ్ము. సంజనా నువ్వు నాతోరా" వసంత విసురుగా బైటకు నడిచింది. ఇద్దరూ వెళ్ళి వసంత చాంబర్‌లో కూర్చున్నారు.

"సంజూ, కార్తీ డయాబెటిక్ పేషంట్. రెండుసార్లు 'స్టంట్స్' వేశారని నీకూ తెలుసు కదా? వీళ్ళ అటాచ్‌మెంట్‌ని తక్కువ అంచనా వేసి తప్పు చేశాను. ఇందులో నువ్వూ భాగస్వామివే. అవినాష్‌కి పది శాతం వాటా పెంచి ప్రొవోక్ చేసింది అతన్ని ఇన్‌సల్ట్ చేయడానికే. నా అస్త్రం ఫలించింది. ఆ గిల్టీ ఫీలింగ్‌తోనే అతను బైటకెళ్లడానికి సిద్ధమయ్యాడు. కానీ అతన్ని వెనక్కి తేకపోతే కార్తికేయ ఈలోకం విడిచి వెళ్ళిపోతాడు. మానవ సంబంధాలకంటే బిజినెస్‌లు గొప్పవికావు. స్నేహబంధం ఇంకా గొప్పది. అది వ్యాపార ప్రపంచానికి అతీతం.

నాకు ఇప్పుడే అర్థమైంది.

"ఇప్పుడీ సమస్య పరిష్కారం నీ చేతుల్లో కూడా ఉంది"

వసంత మాటలకు తెల్లబోయింది సంజన.

"నా చేతుల్లోనా.."

"ఎస్..." అంది.

వసంత చెప్పింది విన్నాక సంజన మైండ్ బ్లాంకయ్యింది.

అరగంట తర్వాత ఆ ఇద్దరూ కార్తికేయ చాంబర్‌లో కెళ్ళారు.

***

కార్తికేయ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్, ఇన్‌ఫ్రా అధినేత కార్తికేయ హార్ట్‌ఎటాక్‌తో ఒక పెద్ద పేరున్న కార్పొరేట్ హాస్పిటల్లో చేరాడన్న వార్త బిజినెస్ వర్గాల్లో సంచలనం రేకెత్తించింది. టెలివిజన్ ఛానళ్ళు హోరెత్తాయి. ఆ వార్త ఎవరికిచేరాలో వారికి చేరింది.

అవినాష్ ఉరుకులు పరుగులు పెడుతూ హాస్పిటల్‌కు చేరుకున్నాడు. ఐ.సి.యు.. బయట సంజన... వసంత... ఆఫీస్ స్టాఫ్ కన్పించారు.

"ఏం జరిగింది.." ఆత్రుతగా అడిగాడు అవినాష్.

"ఆయన మిమ్మల్నే కలవరిస్తున్నారు" ఆందోళనగా అంది వసంత. ఐ.సి.యు లోపలికెళ్ళాడు అవినాష్.

ఆక్సిజన్ మాస్క్‌లో ఉన్న కార్తికేయ కళ్ళలో మెరుపు.

"ఏంట్రా.. ఇది" ఆవేదనతో అడిగాడు అవినాష్.

ఇద్దరి మధ్యా మౌనం. కన్నీళ్ళతోనే పలకరింపులు..

'బయటున్నవాళ్ళని కూడా పిలు" అన్నాడు కార్తికేయ.

ఇద్దరు ఆడవాళ్ళూ లోపలికి వచ్చారు.

"నన్ను వదిలి పోతావా? ఎందుకు చేశావీపని? నువ్వు లేకుండా నేననేవాణ్ణి ఉన్నానా? అందుకే నా గుండె స్తంభించిపోవాలనుకుంది"

ఇక మాట్లాడనివ్వకుండా కార్తికేయ నోరు మూశాడు అవినాష్. అతడి కళ్ళు వర్షిస్తున్నాయ్..

"వసంత తప్పు చేయలేదు... పెంచిన పది శాతం నీది కాదు. నా చెల్లాయి సంజనకు నేను పసుపు కుంకుమల కింద ఇచ్చేది. ఇక నీ వాటా నువ్వు మానిటరింగ్ చేసుకోనక్కరలేదు. నా చెల్లాయి టోటల్‌గా మానిటరింగ్ చేసుకుంటుంది. తన వాటాతో సహా.." ఆయాసంతో ఆగాడు.

అవినాష్‌కేమీ అర్థం కాలేదు.

"ఎస్, సంజన ఇక నీ జీవిత భాగస్వామి... నా మాట కాదనకు" ఆయాసంగా చెప్పాడు కార్తికేయ. సంజన చేతుల్ని అవినాష్ చేతుల్లో పెట్టింది వసంత.

"ఈ నిర్ణయం నాది కాదు, నీ స్నేహితుడిది"

నవ్వు అదిమిపెట్టి చెప్పింది.

తెల్లబోయి సంజన ముఖంలోకి చూశాడు అవినాష్.

ఆమె ముఖంలో సిగ్గుదొంతర అంగీకారంగా కనిపించింది.

అవినాష్ నోరు తెరిచేలోపు అతడికిష్టమైన రింగ్ టోన్ మోగింది.

"ప్రతి ఫ్రెండూ అవసరమేరా.." అందరూ ఒక్కసారిగా నవ్వుకున్నారు.

***

ఆ కార్పొరేట్ హాస్పిటల్స్ అధినేత ఫోన్ రింగయ్యింది.

'చెప్పమ్మా..' అన్నాడు.

"మీ సహకారానికి 'థాంక్స్ అంకుల్" అంది వసంత. అవతల ఆయన బిగ్గరగా నవ్వి "దానిదేముంది అమ్మాయ్ కార్తికేయ ఎలాగూ మా పేషంటే కదా..? ఆ స్నేహితుల్ని కలపడానికి మా హాస్పిటల్‌కే ఒక మంచి పాత్రనిచ్చావ్ కంగ్రాట్స్" అంటూ ఫోన్ కట్ చేశాడాయన. వెనకనుంచి వచ్చిన కార్తికేయ, వసంతతో, "హమ్మయ్య వాళ్ళిద్దరూ ఒక ఇంటివాళ్ళయ్యారు" అన్నాడు. "ఈ డైరెక్షన్ అంతా మీదేకదా, సంజనకి పసుపు కుంకుమల క్రింద టెన్‌పర్సెంట్ ఇస్తున్నట్టు 'స్క్రిప్టు' 'రెడీ' చేసి పనిలో పనిగా పెళ్ళికి ఒప్పించేలా చేసి మీ చిరకాల కోర్కె తీర్చుకున్నారు! చాలా గ్రేట్ స్వామీ.." అంది వసంత నవ్వుతూ.

"నీకు గుర్తుందా వసంతా, బిజినెస్‌స్కూల్లో మనం చదివేప్పుడు ఉపముఖ్యమంత్రి కూతురు అలకనంద నాకు ప్రపోజ్‌చేసింది. బిజినెస్ పెట్టించడానికి తన తండ్రితో పెట్టుబడి కూడా పెట్టిస్తానంది. అప్పటికే నువ్వు నాకు మంచి ఫ్రెండ్. కానీ నాలోని బిజినెస్‌మెన్ అలకనందవైపు చూశాడు. ఫైనల్ డెసిషన్ అవినాష్‌ని అడిగాను.

"వసంత పేద పిల్లయినా తను 'వజ్రం'రా... తను నీకు 'సరి జోడు'. నీతో తను మాట్లాడేటప్పుడు ఆమె కళ్ళల్లో ప్రేమ చూశాను, వెలుగు చూశాను. నీ సోల్‌మేట్ తనే.." అన్నాడు. నేను కూడా ఆలోచిస్తే నిజమే అన్పించింది. దానికి తగ్గట్టే అదేరోజు నువ్వు కూడా 'విల్ యూ మ్యారీ మీ' అని నాకు మెసేజ్ పెట్టావు. ఇంకో విషయం తెలుసా? బిజినెస్ పెట్టడానికి ఆ మూలధనం తానే ఇస్తానని హామీ ఇవ్వడమేకాదు, తనమాట నిలబెట్టుకున్నాడు అవినాష్. ఎవరిలోనైనా స్నేహం, మంచితనం చూడటమే వాడికలవాటు.

"అవినాష్ నిన్ను రికమెండ్ చేసిన విషయం ఎప్పటికీ నీకు చెప్పొద్దని" నా దగ్గర మాట తీసుకున్నాడు. ప్రజలకు ప్రభుత్వానికి వారధిలా మన ప్రాజెక్టులుండాలన్నది వాడి అభిలాష. ఆ లక్ష్మణ రేఖ నేనెప్పుడూ దాటలేదు.

మామధ్య వైరుధ్యాలు సృష్టించాలని ఎందరో యత్నించారు. వాళ్ళ ఆటలు సాగలేదు. ఇప్పటికే నా గుండె రెండుసార్లు మొరాయించింది. మూడోసారి ఆగిపోతే..? ఆ భయంతోనే అఫీషియల్‌గా వాడి వాటా డిసైడ్‌చేశా. నాకంటే నువ్వు ఉన్నతంగా ఆలోచించావని సంతోషించా, కానీ నా నుండి వాణ్ణి దూరం చేయాలనుకున్నావ్...! అవునా వసంతా" అన్నాడు వేదనగా.

పశ్చాత్తాపభావనతో క్షణకాలం నిస్తేజంగా భర్త కళ్ళల్లోకి చూసింది వసంత.

"స్నేహితులమధ్య తలదూరిస్తే ఏమవుతుందో అర్థమైందికదా" అన్నాడు మళ్ళీ నవ్వుతూ.

'అర్థమైంది స్వామీ మీ మధ్య తల పెడితే.....అంతే" అంది నవ్వుతూ.

"ఎనీ హౌ అంతా మంచే జరిగింది. యూ హావ్ డన్ ఎ గ్రేట్ జాబ్ వసంతా" భార్యను దగ్గరకు తీసుకుని ఆమె నుదురు చుంబించాడు కార్తికేయ. అంతలో అతని ఫోన్ రింగయ్యింది. అవతల లైన్లో అవినాష్. "ప్రతి ఫ్రెండూ అవసరమేరా" రింగ్ టోన్ ప్రతిధ్వనించింది.

**సెల్: 9849241286**

## మనమీదేనట్రోయ్!

సరసి








# షూ లేసులు

**'ఇది చాలా సులభమైన కేసు అనుకున్నాను. కానీ చాలా కఠినంగా ఉంది' డిటెక్టివ్ శరత్ ఎదురుగా కుర్చీలో కూలబడుతూ అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.**

**ప్రశ్నార్థకంగా చూశాడు శరత్.**

**'కఠినమైన కేసంటూ ఉండదు. పరిశోధనకు మనం సరైనకోణం ఎన్నుకోలేదని చెప్పు' నవ్వుతూ అన్నాడు శరత్.**

'ఇది కులభూషణ్ హత్యకేసు. ఎవరో కొట్టి చంపేశారు. ఎక్కడో చంపి పార్కులోని చెత్తకుండీలో పారేశారు. దుప్పటిలో చుట్టేసివుంది దేహం. కులభూషణ్ ఇన్స్యూరెన్స్ ఏజెంట్. పెళ్ళైంది. ఇద్దరు పిల్లలు. భార్య టీచరు. అతన్ని ఎందుకు చంపారో, ఎవరు చంపారో తెలియటం లేదు. ఆఫీసులో మంచి పేరుంది. పాలసీలు బాగా చేయిస్తాడట. టార్గెట్లు రీచ్ అవుతాడు. ఒక మధ్యతరగతి జీవి, ఇంత హింసాత్మక చావుకు గురైన కారణం కనబడటం లేదు' చెప్పాడు విజయ్.

'ఫోన్ కాల్ రికార్డ్స్, బ్యాంకు లావాదేవీలు గమనించావా?' అడిగాడు శరత్.

'అన్ని వివరాలు ఫైలులో ఉన్నాయి. అతని క్లయింట్లతోపాటు అతను ఫోన్ చేసిన వాళ్లందర్నీ ప్రశ్నించాను. క్లయింట్లే ఎక్కువమంది. బ్యాంకు బ్యాలెన్స్ హఠాత్తుగా పెరగడం, తగ్గడం ఏంలేదు. నేను చేయాల్సింది చేశా. నీ వల్ల అవుతుందేమో చూడు' అని వెళ్ళిపోయాడు.

విజయ్ వెళ్ళాక ఫైలుతీసి మొత్తం వివరాలన్నీ చదివి ఆలోచిస్తూ కూర్చున్నాడు శరత్. తర్వాత అసిస్టెంట్ రామును పిలిచి కేసు ఫైలు అందించాడు.

'ఇటీవల కులభూషణ్ కలిసిన క్లయింట్స్ అందర్నీ ప్రశ్నించు. అతను డీల్ చేస్తున్న క్లెయిమ్స్, కేసులు పరిశీలించి అందులో ఏదైనా అనుమానం వస్తే చెప్పు'.

'ఇది నాకు పరీక్షా బాస్? ఈపాటికి నీ అనుమానితుల జాబితా తయారయిపోయే ఉంటుందిగా' నవ్వుతూ అన్నాడు రాము.

'మనిద్దరి జాబితాలు పోల్చి ఫలితం ఏమొస్తుందో చూద్దాం' అన్నాడు శరత్.

***

"బాస్ నా జాబితా సిద్ధం. నాలుగు క్లెయిమ్ కేసులున్నాయి. రాంచందర్ భార్యపేరిట కోటి రూపాయల పాలసీ తీసుకున్నాడు. ఆరు నెలల్లో భార్య మెట్లు దిగుతూ జారిపడి మరణించింది. 50 లక్షల పాలసీ ఉన్న 'విభిన్న' భర్త వీరేంద్ర కారు ఏక్సిడెంట్‌లో మరణించాడు. ఐతే ప్రమాదంలో విభిన్న కూడా గాయపడింది. చావుబ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడి నెలరోజుల క్రితమే ఆస్పత్రినుంచి బైట పడింది. నాలుగుకోట్ల పాలసీ ఉన్న అనన్య వంట చేస్తూ కాలినగాయాలతో మరణించింది. ఆమె తల్లిదండ్రులు ఆమె భర్త శామ్యూల్ మీద కేసు పెట్టారు. నారాయణ గుండెనొప్పితో మరణించాడు. అతని భార్య సుశీల రెండు కోట్లు బీమా ఇమ్మంటోంది. ఈ నాలుగు కేసులు అనుమానంగా ఉన్నాయి' చెప్పాడు రాము.

'నారాయణది సహజ మరణం కదా?' అడిగాడు శరత్.

'నిజమేగానీ వాళ్ళమధ్య నలభై ఏళ్ళు వయసు తేడా ఉంది. డబ్బు కోసం వృద్ధుణ్ణి చేసుకుంది సుశీల. అతని ఎదుటే మరొకరితో అసభ్యంగా ప్రవర్తించేది. దాంతో నారాయణ గుండెపోటుతో మరణించాడు'.

వాళ్ళ వ్యక్తిగత వ్యవహారం వదిలెయ్. సుశీల క్లెయిమ్‌లో అసంబద్ధత ఉందా? అంటే నా ఉద్దేశం డబ్బులు తీసుకుని తప్పుడు పద్ధతిలో సాయం చేసే అవకాశం కులభూషణ్‌కి ఉందా?' అడిగాడు శరత్.

'లేదు బాస్...'

'సరే, ఇలాంటి అవకాశం కులభూషణ్‌కి ఎక్కడెక్కడుందో గమనించు'.

తల అడ్డంగా ఊపాడు రాము.

శరత్ నవ్వి, 'ఈ నాలుగు కేసుల్లో కులభూషణ్‌తో వాళ్ళ ఫోన్‌కాల్స్ వివరాలు చూశావా?' అన్నాడు.

'లేదు బాస్'

'అతను విభిన్నకే ఎక్కువ కాల్స్ చేశాడు'

'కానీ ఆమె చావు బ్రతుకులమధ్య ఆసుపత్రిలో ఉందిగా'

'విభిన్నకు రోజుకు రెండుమూడు మార్లు ఫోన్లుచేసి గంటల తరబడి మాట్లాడాడు. అతని హత్యకు గంట ముందు కూడా మాట్లాడేడు. పద ఆమెను కలుద్దాం' అన్నాడు శరత్.

***

'కులభూషణ్ చాలా మంచివాడు. అతని హత్యా వార్త నాకు చాలా బాధ కలిగించింది' అంది విభిన్న.

'అతని హత్యకు గంటముందు అతనికి మీరెందుకు ఫోను చేశారు?'

'పోలీసులు కూడా ఇదే అడిగారు. క్లెయిమ్ విషయం గురించి అతడు ఆ టైమ్‌కి ఫోన్‌చెయ్యమన్నాడు. అందుకే చేశాను.'

'మీతో గంటల తరబడి మాట్లాడేవాడు?'

'అవును. వాళ్ళకి బోలెడు అనుమానాలు. ఏక్సిడెంట్ అని రుజువయ్యేదాకా క్లెయిమ్ ఇవ్వరట. ఏవేవో అర్థం కాని విషయాలు చెప్పాడు. కావాలని ఏక్సిడెంట్ చేస్తామా? ఇద్దరం ఫంక్షన్‌కి వెళ్ళాం. ఇలా అవుతుందనుకున్నామా?'

'ఎలా జరిగింది ఏక్సిడెంట్?'

'ఆయన ఎప్పుడూ 120పైనే నడుపుతారు కారు. ఆరోజు వెళ్తుంటే పెద్ద శబ్దం వచ్చింది. ఏం జరిగిందో అర్థమయ్యేలోపు కారు డివైడర్‌కి ఢీకొట్టింది. నా ఎయిర్‌బ్యాగ్ తెరుచుకుంది. అతడిది...' ఏడుపు రావటంతో ఆగిపోయింది. టైర్‌బరస్ట్‌వల్ల అదుపుతప్పి ప్రమాదం జరిగిందని శరత్ చదివాడు. అర్ధరాత్రి దాటడంతో ఆ శివారు ప్రాంతానికి ఎవరూ వెళ్ళలేకపోయారు, ఆలోచిస్తూ బైటకొచ్చాడు శరత్. 'విభిన్న కాల్ రికార్డులు కావాలి' రాముతో అన్నాడు.

***

కారుకు ఏ మాత్రం ప్రమాదం జరిగినా ఎయిర్ బాగ్‌లు తెరుచుకోవాలి. ఈ కేసులో ఎయిర్ బాగ్ తెరచుకుంది. మరి గాలి ఎలా పోయిందో తెలియటంలేదు. అదే పరిశోధిస్తున్నాం. ఎయిర్‌బాగ్‌కు చిల్లుపడింది. అదెలా జరిగిందో పరిశీలిస్తున్నాం' చెప్పాడు కార్లకంపెనీ సాంకేతిక నిపుణుడు.

తర్వాత విజయ్ దగ్గరకు వెళ్ళాడు శరత్.

శరత్ అడిగిన ప్రశ్నకు విజయ్ నవ్వి, 'పూచిక పుల్లతో సహా కారులో దొరికినవన్నీ ఈ బాక్సులో ఉంచాం' అంటూ బాక్సు అందించాడు విజయ్.

దాన్లోని వస్తువులు పరిశీలిస్తున్న శరత్ కళ్ళు చిన్నవయ్యాయి.

'ఈ లేసులు ఏమిటి?' అడిగాడు.

'విభిన్న భర్తకు షూలేసుల పిచ్చట. కారు నిండా లేసులు పెట్టుకునేవాడట. ఇంట్లో కూడా ఓ

**ఒక సామాన్య మధ్యతరగతి బీమా ఏజెంట్ కులభూషణ్. దారుణహత్యకు గురయ్యాడు. ఇన్‌స్పెక్టర్ విజయ్ ఈ కేసును డిటెక్టివ్ శరత్‌కు అప్పగించాడు. కులభూషణ్ పరిష్కరించిన క్లెయిమ్స్‌లో నాలుగు కేసులు అనుమానాస్పదంగా ఉన్నాయి. ఆ నాలుగు కేసుల్నీ శరత్, అతడి అసిస్టెంట్ రామూ ఇద్దరూ భిన్న కోణాల్లో పరిశీలించారు. చివరకు కులభూషణ్ హంతకులు పట్టుబడ్డారా? లేక వారి శ్రమ బూడిదలోపోసిన పన్నీరైందా?**

డబ్బా నిండా లేసులున్నాయి' చెప్పాడు విజయ్.

'ముడివేసి ఉన్న లేసులనే చూస్తూ కూచున్నాడు శరత్'.

***

'మా ఆయన కేసుల వివరాలన్నీ వాళ్ళ కంపెనీ వాళ్ళు తీసుకెళ్ళారు. పనికిరానిఫైల్స్ మాత్రం వదిలేశారు' చెప్పింది కులభూషణ్ భార్య. కన్నీళ్ళు తుడుచుకుంటూ.

'ఓసారి నేను ఆయన ఆఫీసు గది చూడవచ్చా?' అడిగాడు శరత్.

ఆమె తల ఊపింది.

కులభూషణ్ ఆఫీసు అణువణువూ పరిశీలించటం ప్రారంభించాడు శరత్. షెల్ఫ్ అడుగున ఉన్న రహస్య అరకింద మరో రహస్య అర ఉంది. దాన్లో నాలుగయిదు జతల షూలున్నాయి. వాటి నిండా డబ్బుల కట్టలున్నాయి. ఒక దానిలోమాత్రం చిన్న పాకెట్‌సైజ్ నోటు పుస్తకం ఉంది.

డబ్బులు అతడి భార్యకు ఇచ్చాడు శరత్. నోటు బుక్కు జేబులో వేసుకున్నాడు.

***

'కులభూషణ్‌ది ఎక్సలెంట్ రికార్డు. ఏదైనా క్లెయిమ్ సరైనది అన్నాడంటే ఇక దానికి తిరుగుండదు' చెప్పాడు అధికారి.

'అతడి పాత క్లెయిమ్స్ రికార్డులిస్తారా?' అడిగాడు శరత్.

అధికారి అందించిన వివరాలు రాముకు ఇచ్చాడు శరత్.

'రామూ, ఇందులో క్లెయిమ్ అందుకున్న వారందరినీ ప్రశ్నించు. ఈ డైరీలో ఉన్న పేర్లతో పోల్చి వారి పేరుదగ్గర రాసి ఉన్న మొత్తం చెల్లించారో లేదో నిర్ధారణ చేయి'.

"బాస్... అంటే కులభూషణ్ డబ్బులు తీసుకుని..' రాము మాట పూర్తి కానివ్వలేదు శరత్.

'త్వరగా కనుక్కో. నేను విభిన్నకు చికిత్స చేసిన డాక్టర్‌ని కలుస్తాను' అన్నాడు శరత్.

***

'డాక్టర్, విభిన్న మీకు తెలుసా?' అడిగాడు శరత్.

'యెస్... వీరేంద్ర, మేము ఫ్యామిలీ ఫ్రెండ్స్. ఏక్సిడెంట్ విషయం తెలియగానే వారిని మా ఆసుపత్రికే రప్పించాను, కానీ వీరేంద్ర స్పాట్ డెడ్.

విభిన్న ప్రాణం కాపాడగలిగాను' చెప్పాడు డాక్టర్.

'ఆమె ట్రీట్‌మెంట్ రికార్డు ఇస్తారా?'

'అఫ్‌కోర్స్' అంటూ ప్రింటౌట్ ఇచ్చాడు డాక్టర్.

'ఒరిజినల్ రికార్డు కావాలి'.

'ఇవ్వకూడదు'.

'నాకు కావాలి' మొండిగా అన్నాడు శరత్.

'ఓకే' అయిష్టంగానే ఇచ్చాడు డాక్టర్.

'ఇది మీ నెంబరేనా?' అడిగాడు శరత్ ఓ నెంబర్ చూపిస్తూ.



ఆశ్చర్యపోయాడు డాక్టర్. 'ఇది నా పర్సనల్ నెంబర్. మీకెలా....?'

'విభిన్న రోజూ రాత్రి ఈ నెంబరుకే ఎందుకు చేస్తోంది?'

'ఆమె మానసికంగా దెబ్బతిన్నది. ఒక డాక్టర్‌గా ధైర్యం చెప్తుంటాను' తడబడ్డాడు.

'సరే, మళ్ళీ కలుద్దాం' అంటూ బైటకొచ్చేశాడు శరత్.

క్లినిక్‌కు దూరంగా ఉన్న కారు దగ్గరకొచ్చి రామూకి ఫోన్ చేశాడు శరత్. 'విభిన్న ఇంటి దగ్గర మనవాళ్ళున్నారుగా?' అడిగాడు.

'యెస్ బాస్! ఆమె ఇప్పుడే ఎక్కడికో బయలుదేరిందట'.

శరత్ ఏదో అనబోయేంతలోనే, డాక్టర్ బైటకు వచ్చి కారు స్టార్ట్ చేయటం కనిపించింది.

'విభిన్న కారును వెంబడించు' అని రాముతో చెప్పి విజయ్‌కి ఫోన్ చేశాడు శరత్.

***

ఊరుకి చాలా దూరంలో ఉన్న ఫామ్‌హౌస్‌కి చేరుకుంది డాక్టర్ కారు. శరత్, రాము, విజయ్ చీకట్లో చెట్లచాటునుంచి ఫామ్‌హౌస్ చేరుకున్నారు. కారు చెట్లనడుమనున్న ఇల్లు చేరుకునేలోగా విభిన్న కారు కూడా వచ్చి ఆగింది.

నిశ్శబ్దంగా ముగ్గురూ కిటికీ దగ్గర చేరారు. కిటికీ లోంచి చూశారు.

డాక్టరు కౌగిలిలో ఉంది విభిన్న.

'కొన్నిరోజులు మనం ఫోన్లు చేసుకోకూడదు. కలవకూడదు. నీకు నాకు పరిచయం ఉన్నట్టే ఉండకూడదు.

'ఎందుకని? నేను నీకు దూరంగా ఉండలేను. ఇప్పుడు వీరేంద్ర లేడుకదా! మనల్ని బెదిరిస్తున్న కులభూషణ్ అడ్డు కూడా తొలగిపోయింది. క్లెయిమ్ కూడా వస్తోంది. ఇక మనకి అడ్డేముంది?' అడిగింది విభిన్న.

'పోలీసులు. పోలీసులు నిన్ను నన్ను అనుమానిస్తున్నట్టున్నారు. ఓ వెధవ డిటెక్టివ్ వచ్చాడు. ఏవేవో ప్రశ్నలడిగాడు. రికార్డులు తీసుకున్నాడు. వీరేంద్రను హత్యచేసి అతణ్ణి అందులో ఉంచి కారును యాక్సిడెంట్ చేయించామని, పోస్టుమార్టం రిపోర్టు మనకి కావల్సినట్టు రాయించుకున్నామనీ, నిన్ను ఉట్టిగా నెలరోజులు ఐసియులో ఉంచాననీ, బ్లాక్ మెయిల్ చేస్తున్న కులభూషణ్‌ని చంపించింది నేనేననీ...ఇవన్నీ బైటపడ్డాయంటే మన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరైపోతుంది. కలిసి ఉండటం అటుంచి ఇద్దరం కటకటాల్లో గడపాల్సి వస్తుంది. అప్పటికే వాళ్ళను డైవర్ట్ చేయడానికి షూ లేసులు కారులో పడేశాం, కొన్నినెలల పాటు నువ్వెవరో, నేనెవరో అన్నట్టు విడివిడిగా గడపాల్సిందే, ఫోన్లు కూడా చేసుకోవద్దు చెప్పాడు డాక్టర్.

'క్షణమైనా నీకు దూరంగా ఉండలేను' అతన్ని గట్టిగా పట్టుకుని ఏడుపుగొంతుతో చెప్పింది విభిన్న. అంతలో అలికిడైంది. ఆ అలికిడికి ఇద్దరూ ఉలికిపడి దూరంగా జరిగారు. గుమ్మం దగ్గర నిలబడిన ఆ ముగ్గురినీ చూసి కెవ్వున కేకవేసి పడిపోయింది విభిన్న. స్థాణువైపోయాడు డాక్టర్.

**–కస్తూరి మురళీకృష్ణ**

*సెల్: **98496 17392***



**ఓ వ్యక్తి రాత్రికి రాత్రే అకాల మరణం చెందాడు. పుట్టెడు శోకం ఆ కుటుంబాన్ని అలముకుంది. అయినా తేరుకుని కుటుంబ సభ్యులు అంతిమ సంస్కారాలకు అన్ని ఏర్పాట్లు చేశారు. చితిపై శవాన్ని కాల్చేందుకు సిద్ధమవుతుండటంతో ఊహించని సంఘటన ఒకటి జరిగింది. చితిపై ఉన్న శవం నిద్ర నుంచి మేల్కొన్నట్లు లేచింది... అంతే అంత్యక్రియలకు వచ్చిన బంధుమిత్రులంతా పరుగో పరుగు.. సినిమాల్లో ఏ హీరోనో చేసిన అద్భుతమైన సీన్ కాదు ఇది.. నిజంగా నమ్మలేని నిజం. ఏదైనా యాక్సిడెంట్‌లోనో, అగ్ని ప్రమాదంలోనో చావుదాకా వెళ్లి క్షేమంగా తిరిగొచ్చిన 'మృత్యుంజయుల' గురించి పేపర్లలో చాలాసార్లు చదివే ఉంటారు. కానీ చనిపోయారని వైద్యులు నిర్ధారించిన తర్వాత కూడా బతికొచ్చిన వారి గురించి ఎప్పుడైనా విన్నారా? ఒకటి కాదు రెండు కాదు ఏకంగా వారం రోజుల తర్వాత చావును గెలిచిన వారి గురించి మీకు తెలుసా? నమ్మడానికి కూడా ఆలోచించాల్సి వచ్చే నిజజీవిత 'మృత్యువీరుల' గురించి ఓ లుక్కేయండి.**

# మృత్యుంజయులు

### దయ్యమనుకున్నారు

అదొక మార్చురీ. అన్ని బాక్సుల్లోనూ ప్రాణం లేని మానవ శరీరాలు. భయం అంటే తెలియని వారే దాంట్లో పనోళ్లు. సడన్‌గా ఓ రాత్రి ఆ మార్చురీ లోంచి అరుపులు... కేకలు... రాకూడని ప్రదేశం నుంచి కలలో కూడా ఊహించని శబ్దాలు రావడంతో మార్చురీలో పనిచేసేవాళ్లు, నర్సులు పరుగులు తీశారు. అయినా 'కాపాడండి.. నన్ను బతికించండి..' అనే అరుపులతో మార్చురీ హోరెత్తిపోతోంది. ఓ పక్క గుండెల్లో భయం భయంగా ఉన్నా, తనకంటే దిగువస్థాయి ఉద్యోగుల ముందు ధైర్యం నటించాడు హాస్పిటల్ పెద్దాయన. మొత్తానికి సిబ్బందికి ధైర్యం చెప్పి, మార్చురీని మూసేయించి పోలీసులకు ఫోన్ చేశాడు. ఇంకేం.. పది నిమిషాల్లో ఓ ఇరవై మంది పోలీసులు గన్‌లు పట్టుకుని ఆసుపత్రిలోకి ఎంటరయ్యారు. ఓ భయంకరమైన క్రిమినల్‌ను పట్టుకునేందుకు సిద్ధమైనట్లు ఆ పోలీస్ బృందం మార్చురీలోకి అడుగుపెట్టింది. బిక్కుబిక్కుమంటూ డాక్టర్లు కూడా వారిని అనుసరించారు. మార్చురీలోని ఫ్రిజ్‌లో ఉంచిన ఓ శవపేటిక నుంచి శబ్దాలు అరుపులు రావడంతో ప్రాణాలు అరచేతిలో పట్టుకుని దాని తాళం తెరిపించారు. శవపేటికను బయటకు లాగి తెరిచి చూసిన వారి పై ప్రాణాలు పైనే పోయాయి. చనిపోయాడనుకుని మార్చురీలో పెట్టిన ఓ వ్యక్తి ఏకంగా 23 గంటల తర్వాత బతికొచ్చాడు. 'కాపాడండి.. బతికించండి' అని వేడుకుంటూ శవపేటికలో కనిపించిన ఆ వ్యక్తిని హుటాహుటిన ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్లి వైద్య పరీక్షలు చేశారు. వైద్యులకు జీవితంలో మర్చిపోలేని షాకిచ్చిన ఈ యదార్థ సంఘటన దక్షిణాఫ్రికాలో జరిగింది.

ఓ వ్యక్తి చనిపోయాడనీ, కొద్ది రోజులు భద్రపరచాలంటూ తమకు ఓ ఫ్యామిలీ నుంచి ఫోన్ వచ్చిందని ఓ ప్రముఖ ఆసుపత్రి మార్చురీలోని హెల్త్ డిపార్ట్‌మెంట్ అధికార ప్రతినిధి అయాండా మఖోలో వివరించారు. డ్రైవర్ వెళ్లి అతడి మృతదేహాన్ని తెచ్చాడనీ, ఆ తర్వాత వైద్య పరీక్షల అనంతరం అతడు చనిపోయినట్లు నిర్ధారించి శవపేటికలో పెట్టి మార్చురీకి తరలించామన్నారు. మార్చురీలో శవాన్ని ఉంచిన 21 గంటల తర్వాత కేకలు పెట్టి అందర్నీ హడలగొట్టి, చనిపోయాడనుకున్న వ్యక్తి బతికొచ్చాడని ఆనాటి సంఘటనను గుర్తు చేసుకున్నారాయన. ఆసుపత్రి నుంచి వెళ్లిపోయిన ఆ వ్యక్తి నేరుగా ఇంటికెళ్లాడట. అంత్యక్రియలకు ఏర్పాట్లు చేసుకుంటున్న వారు... దయ్యం వచ్చిందంటూ పరుగులు తీశారట. ఆసుపత్రి నుంచి ఫోన్ చేస్తే కానీ అసలు విషయం వారికి బోధపడలేదట.

### ఓ పాప వింత కథ

తమకు పుట్టబోయే బిడ్డ గురించి భార్యాభర్తలు ఎన్నో కలలు కన్నారు. ఏ పేరు పెట్టాలనే దగ్గర్నుంచీ ఏ స్కూల్లో చదివించాలి.. వంటి ప్రణాళికలన్నీ ముందే సిద్ధం చేసుకున్నారు. తల్లిదండ్రులను ముందుగానే చూద్దామనో ఏమో కానీ.. మూడు నెలల ముందుగానే భూమిపైకి వచ్చి తల్లిదండ్రులకు కోలుకోలేని షాకిచ్చింది. ముందుగానే పుట్టిన పాపను పరీక్షించిన డాక్టర్లు.. పాపలో చలనం లేదని, మరణించిన పిండం బయటకు వచ్చిందని తేల్చేశారు. పాప చనిపోయిందని నిర్ధారించి ఆ మృతదేహాన్ని మార్చురీలో పెట్టారు. విషయం తెలిసిన

భార్యాభర్తలు కన్నీరు మున్నీరయ్యారు. 12 గంటల తర్వాత చివరిసారిగా పాపతో ఓ ఫోటో అయినా దిగి పాప గుర్తుగా ఉంచుకోవాలనుకున్నారా దంపతులు. డాక్టర్లకు ఫోటో విషయమై చెప్పడంతో, వారు అంగీ కరించి మార్చురీ దగ్గరకు తీసుకెళ్లారు. పాపను ఉంచిన బాక్స్‌ను ఓపెన్ చేయగానే ఆ చిన్నారి ఏడుపు విని పించింది. వెంటనే వైద్యం చేసి పరీక్షలు జరిపి పాపను సజీవంగా ఆ భార్యాభర్తలకు అందజేశారు. అమెరి కాలోని అర్జెంటీనా రాష్ట్రంలో రెసిస్టెన్సియాలో జరిగిన యదార్థ సంఘటన ఇది. పెర్రాండో హాస్పిటల్‌లో అనీలా బౌటెర్ అనే మహిళ ఈ వింతకు కారణమయింది. 'వైద్య చరిత్రలో ఈ ఆసుపత్రికి ఎంతో పేరుంది. దేవుడే నా కన్నీటిని తుడిచేందుకు ఈ అద్భుతాన్ని జరిపించాడు' అని ఆనందంతో చెప్పిందామె. పాప పుడితే 'లూసియా అబిగైల్' అని పేరు పెడదామను కున్నారట. కానీ పుట్టుకతోనే మిరాకిల్ జరగడంతో.. 'లూజ్ మిలాగ్రోస్ వెరాన్' అని పేరు పెట్టారు. ఇంగ్లీ షులో దీనికి 'అద్భుత దీపం' అని అర్థమట.

### చనిపోయిన వారం తర్వాత...

చైనాకు చెందిన లీ జ్యూఫెంగ్ అనే 95 ఏళ్ల వృద్ధురాలు రోజూలాగానే మాత్రలు వేసుకుని నిద్ర పోయింది. కానీ తెల్లారిన తర్వాత మళ్లీ లేవలేదు. తలకు బలమైన దెబ్బ తగలడంతో ఆమె చనిపో యిందని వైద్యులు కూడా తేల్చేశారు. విదేశాల్లో ఉన్న ఆమె కొడుకులు, మనవళ్లు వచ్చేదాకా ఆగా లని, ఓ శవపేటిక తెప్పించి అందులో ఆమె మృత దేహాన్ని ఉంచారు. అయితే ఆ శవపేటికకు మేకులు మాత్రం కొట్టలేదు. మొత్తానికి వారం రోజులకు బంధువులంతా చేరుకున్నారు. అప్పుడే వచ్చిన బంధువులకు కాసిన్ని మంచినీళ్లు తీసుకువద్దామని వంటగదిలోకి వెళ్లిన లీ జ్యూఫెంగ్ మనవడికి గుండె ఆగినంత పనయింది. శవపేటికలో ఉండా ల్సిన బామ్మ వంట చేసుకుంటూ కనిపించింది. కెవ్వు మని ఓ కేక పెట్టి పరుగులు తీశాడతను. దీంతో అసలు ఏమై ఉంటుందా? అని వంటగదిలోకి వెళ్లి చూస్తే.. హాయిగా ఎగ్ ఆమ్లెట్ వేసుకుని ఆవురావురు మంటూ తింటూ కనిపించిందా బామ్మ. నిద్ర ఎక్కు వగా పోయానంటూనే.. బాగా ఆకలేసినట్లు ఉంటే ఆమ్లెట్ వేసుకున్నానని తీరిగ్గా సమాధానమిచ్చింది. బామ్మ కథేంటో వైద్యులకే కాదు వారి బంధువులకు కూడా అంతు చిక్కలేదు. మొత్తానికి చనిపోయింద నుకుని ఇంటికి వచ్చినవారంతా బామ్మతో సరదాగా ఓ వారం రోజులు గడిపి మరీ వెళ్లారు.

### పరార్

ఒత్తిడి ఎక్కువయితే ఎంతటి వారయినా మర ణిస్తారు. న్యూజిలాండ్‌లో వేశ్యావృత్తిలో ఉన్న ఓ మహిళను ఓ కస్టమర్ బులేవేయోలోని మనోర్ హోటల్‌కు తీసుకుని వెళ్లాడు. శృంగారం చేస్తూ ఉండగా ఆమెకు ఊపిరి అందక తీవ్రమైన ఒత్తిడిని ఎదుర్కొంది. శ్వాస పీల్చుకోలేక మరణించింది. ఆమెను అలా చూసి ఒక్కసారిగా భయపడిపోయిన కస్టమర్, పోలీసులకు ఫోన్ చేశాడు. వాళ్లు రావడం.. వివరాలు తీసుకోవడం అన్నీ చకచకా జరిగిపోయాయి. మూడు అంతస్తుల నుంచి ఆమెను కిందకు దించి శవపేటికలో పెట్టి మూత పెడుతుండగా ఒక్కసా రిగా ఆమె కళ్లు తెరిచింది. 'నన్ను చంపాలని ప్లాన్ చేశారా? అది మీ వల్ల కాదు' అంటూ కోపంగా అరి చేసరికి పోలీసులు ఖంగుతిన్నారు. వైద్య సిబ్బంది, పోలీసులు సహా అందరూ పరుగులు తీశారు. ఆమె మాత్రం ఎంచక్కా శవపేటిక నుంచి బయటకు వచ్చి తన దారిన తాను వెళ్లింది. 'ఆమె శరీరం చల్ల బడిపోయింది. నాడి కూడా ఆడలేదు. ఆమె చనిపో యింది. కానీ ఇలా బతకడం ఆశ్చర్యంగా ఉంది' అని వైద్య సిబ్బంది వ్యాఖ్యానించడం గమనార్హం.





### మార్చురీలో మూడు రోజులు

రష్యాలోని హార్డీ ల్యాడ్‌మిలా స్టెబ్లిట్స్కాయా అనే 61 ఏళ్ల మహిళ అనారోగ్యంతో బాధపడు తోంది. ఓ రోజు తుదిశ్వాస విడిచింది. దీంతో బంధు వులు వచ్చేవరకూ మృతదేహాన్ని మార్చురీలో భద్ర పరచాలంటూ ఆమె కూతురు నెల్లీ (29) కోరింది. ఓ శవపేటికలో ఆమె మృతదేహాన్ని ఉంచి మార్చురీలో భద్రపరిచారు. ఆమె అంత్యక్రియలకు అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకుని మూడు రోజుల తర్వాత ఆసుపత్రికి వెళ్లి తల్లి మృతదేహాన్ని ఇవ్వాలని కోరింది. అయితే ఆమె చనిపోలేదని, బతికే ఉందని వైద్యులు తెలి పారు. పోస్ట్‌మార్టం చేయడానికి శవాన్ని తీయగా.. ఆమె చేయి కదిలిందనీ, దీంతో మళ్లీ పరీక్షలు జరిపి ఆమె బతికినట్లు వైద్యులు తేల్చారనీ ఆసుపత్రి యాజమాన్యం నెల్లీకి తెలిపింది. వైద్యుల తప్పిద మేమీ లేదని, ఇలాంటి అద్భుతాలు అరుదుగా జరుగు తుంటాయని వివరించింది. హాయిగా బెడ్‌పై పడు కుని దగ్గరకు వచ్చిన వారిని పలకరిస్తూ కనిపిం చింది స్టెబ్లిట్స్కాయా. తాను చనిపోయి బతికిన సంగతి కూడా ఆమెకు తెలియకపోవడం విశేషం. ఇలా 2011లో ఓ సారి, 2012లో మరోసారి చచ్చి బతికిందనీ, ఈ విచిత్రమేంటో తమకే అంతుబట్టలేదనీ డాక్టర్లు చెప్పడం గమనార్హం. మొత్తానికి రెండు సార్లు మరణాన్ని జయించి అందరి దృష్టిలో సెలబ్రిటీగా మారిందీ బామ్మ.

ఇలా వీళ్లు మాత్రమే కాదు... కూతురి కౌగిలిం తతో అరుదైన వ్యాధి వల్ల వచ్చిన మరణాన్ని కూడా జయించిన 60 ఏళ్ల బ్రెజిల్ బామ్మ, శ్వాసకోశ వ్యాధితో చనిపోయి, అంత్యక్రియలు నిర్వహిస్తుం డగా చితిమీద నుంచి లేచి పక్కన కూర్చుని కన్నతం డ్రిని మంచినీళ్లు అడిగి తాగి... నిమిషాల్లోనే తుది శ్వాస విడిచిన కెల్విన్ శాంటోస్ అనే ఓ రెండేళ్ల బ్రెజిల్ బాలుడు, గుండెపోటుతో మరణించి, అంత్య క్రియల సమయంలో లేచి బంధువులను భయపె ట్టిన 49 ఏళ్ల ఫగిల్యా ముఖామెత్యానవ్ అనే రష్యన్ మహిళ, 17 గంటలపాటు గుండె స్పందించక, మెదడు లోని నరాల్లో చలనం లేకపోయినా వైద్యులకే అంతు బట్టని రీతిలో ప్రాణాలను నిలబెట్టుకున్న అమెరికా లోని వెస్ట్ వర్జీనియాకు చెందిన వాల్ థామస్ అనే 61 ఏళ్ల బామ్మ, సమాధి చేసే చివరిక్షణాల ముందు ప్రార్థన చేస్తున్న సమయంలో లేచి కూర్చుని, చుట్టా లందరికీ గుండెలదిరేలా చేసిన 34 ఏళ్ల బ్రిగ్టన్ దామా జాంథే అనే జింబాబ్వే మహిళ... ఇలా చెప్పు కుంటూ పోతే మరణించి మళ్లీ బతికిన వారు చాలా మందే ఉన్నారు. వారి గుండె ధైర్యమో, లేక దేవుడి లీలో కానీ.. మరణాన్ని కూడా మనిషి జయిస్తాడేమో అన్నంతలా మేధావులను ఆలోచింపజేస్తున్నాయి ఈ సంఘటనలు.

–కె. హసాన్
kandula.hassan@gmail.com



# ప్రయాణం

4

(రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

**నిద్రలేని నా కళ్ళు ఎర్రగా, బరువుగా ఉన్నాయి. మంచం మీద ఓ పక్క చేతుల్లో ముఖం దాచుకుని కళ్ళు మూసుకున్నాను. ఇంతలో ఏదో చప్పుడు. గుసగుసలు లాంటివి. లేచి చూస్తే ఇల్లుగలామె తన భర్తతో నన్ను పలకరించడానికి వచ్చింది. అబ్రహం బాత్‌రూంలో ఉన్నాడు. ఆమె పెద్దగా నవ్వుతూ 'అయ్యో! మగాళ్ళ మంచం మీదా నిద్ర' అంది నా మాతృభాష యిద్దీష్‌లో.**

నేనూ నవ్వుకున్నాను మెల్లిగా.

ఏ మంచమయినా నిద్రపడితే కదా! "రాత్రే కదా వచ్చాను. అయినా ఈ పురుగులేమిటి? తెల్లవార్లూ నిద్రపోనివ్వలేదు" అన్నాను సరిగ్గా సర్దుకు కూర్చుంటూ.

వారు ఆ మాటను విన్నట్టు లేదు. ఎదురుగా ముఖం కడుక్కు వస్తున్న అబ్రహంతోనే మాట్లాడి వెళ్ళిపోయారు. ఆ పూటకు వంటకు కావలసిన సామానులుతెచ్చి బల్లమీద పెట్టి అబ్రహం పనిలోకి వెళ్లిపోయాడు. మరీ ఎక్కువగా ఆలోచిస్తే లాభం లేదు. ఇతనితోనే నా బతుకంతా ముడిపడి ఉంది. మధ్య మధ్య పక్కింట్లోనే ఉన్న ఇల్లుగలామె సలహాలు తీసుకుంటూ లేచి ఇల్లంతా శుభ్రం చేశాను. బ్రెడ్ ముక్కలు వేడి చేసి స్పినెక్‌తో కూర చేసి అతని కోసం ఎదురుచూస్తూ కూచున్నాను.

## జరిగిన కథ

*రాచెల్ కలోఫ్ ఉక్రెయిన్‌లో పుట్టి పెరిగింది. తరువాత అమెరికా చేరింది. ఆమె రాసుకున్న ఆత్మ కథే ప్రయాణం. రాచెల్ చిన్నతనంలోనే తల్లి మరణించటంతో తండ్రి తన నలుగురు పిల్లల్నీ బంధువుల పంచనచేర్చి, అమెరికా వెళ్ళిపోతాడు. రాచెల్ మేనత్త ఇంటికి పనిమనిషిగా వెళుతుంది. అమెరికాలో ఉంటున్న తన బంధువు అబ్రహం కోసం పిల్లను వెతుకుతుంటుంది ఛాయ. రకరకాల పరీక్షలు పెట్టి సంతృప్తి చెందిన తరువాత అబ్రహంకి రాచెల్ తగిన ఈడూజోడుగా నిర్ణయిస్తుందామె. షిప్‌లో అమెరికా చేరుతుంది రాచెల్. అబ్రహం ఆమెను తనుండే ఇంటికి తీసుకెళతాడు. ఆరోజు రాత్రి ఆమెకు జాగరణే అవుతుంది. ఆ తర్వాత....*

సాయంకాలమయ్యింది.

క్రమేపీ చీకట్లు కమ్ముతున్నాయి. టైమెంత య్యిందో తెలియదు. కిరోసిన్‌తో వీధి లైట్లు వెలిగిస్తున్నారు. అబ్రహం నవ్వుతూ వస్తున్నాడు.

రాత్రి భోజనాలు అయ్యే వరకూ కబుర్లు చెప్పుకున్నాం. ఇల్లంతా చూశాడు. ఎక్కడుండవలసిన వస్తువు అక్కడే సర్ది ఉండడం, మకిలిగా ఉన్న పాత్రలు తోమడం... ఇల్లంతా శుభ్రంగా కనిపించిందతనికి. ముఖమంతా నవ్వు నింపుకుని "నీకేం ఇబ్బంది కలుగలేదు కదా! కలిగితే నన్ను మన్నించు" అన్నాడు.

ఇలా చాలా సార్లు అన్నాడు.

"లేదు...లేదు. నాకంతా కొత్త కదా! ఇల్లుగలామె సలహాలు తీసుకున్నాను." అని వెంటనే చెప్పాను. నా వంటకాలు అతనికి నచ్చినట్లున్నాయి. మరీ మరీ వడ్డించుకు తిన్నాడు.

నేను తిన్న పాత్రలు శుభ్రం చేస్తున్నాను.

"మనం అలా నడుస్తూ వెళదాం పద" అన్నాడు.

ఆ మాటకు నాలో బెరుకు పట్టుకుంది. మా మేనత్త ఇంటి దగ్గర ఆ మాంసం కొట్టు యజమాని కొడుకూ ఇదే మాట అన్నాడు. అదంతా నాకు కొత్త! నేను గౌరవంగల పెద్దింటి అమ్మాయిని. బాగుండదు. సరే అప్పటి పరిస్థితులు అలా ఉన్నా ఇప్పుడు ఇతడి నుండీ అలాంటి మాటలే విన వలసి వస్తోంది.

ఆలోచిస్తున్నాను...

కానీ వీరిమధ్య ఎంతో తేడా ఉంది. ఇతన్ని నేను వివాహం చేసుకోవాలి. మా మధ్య ఒకరినొకరు అర్థం చేసుకోవడాలు, గౌరవించుకోవడాలు ముఖ్యం. అలా రాలేననీ, కాదనీ అనలేను.

ఉదయం నుండీ ఇంట్లో ఒక్కదాన్నే ఉన్నానని ఈతని భావం కావచ్చు. పైగా ఈ ఊరు ఈ వీధులు ఎలా ఉన్నాయో ఇంకా నేను చూడలేదు కదా!

సరేనన్నాను.

రెండు వీధుల తరువాత ఓ పార్క్ ఉంది. ఎర్రటి దీపాల వెలుగులో బాగానే ఉన్నట్టనిపించింది. అక్కడక్కడ బల్లల మీద చాలామంది కూర్చొని ఉన్నారు. మేము ఖాళీగా ఉన్న చెక్కబల్ల మీదకు పోయి కూచున్నాం. చాలాసేపటి వరకు అతనేం మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తున్నాడనిపించింది. నేను చుట్టూ ఉన్న మనుషుల్నీ, ఇళ్లనూ చూస్తూ కాలక్షేపం చేస్తున్నాను. ఉన్నట్టుండి తానే మాట్లాడడం మొదలెట్టాడు.

ఎంతో నెమ్మదిగా, నిజాయితీగా నాకే వినపడేటట్టు స్నేహపూర్వకంగా మాట్లాడుతున్నాడు. నాకు అంతా అర్థం కావాలన్న తాపత్రయం అందులో ఉంది. అతని మాటల్లో నా ప్రయాణానికి అయిన ఖర్చులు, ఏజెంట్‌ను నియమించడం... అంత దూరం నుండి ఈమె ఒక్కతే రాగలదా? బోర్డర్లు దాటగలదా? అనే భయం తనలో



ఉన్నట్టు చెప్పాడు.

నేను ఎక్కిన షిప్ ఎప్పుడు ఈ తీరానికి చేరుతుందో ఎవరూ చెప్పేవారు కాదట. మూడు రోజుల పాటు రోజూ రావడం, నోటీసు బోర్డులో చూసి తిరిగి వెనక్కు వెళ్లడం జరిగిందట. నిన్నటి రోజు నోటీస్ బోర్డు చూస్తే ఈ సాయంకాలం షిప్ రావచ్చు అని ఉన్నదట. అందువల్ల అక్కడా ఇక్కడా కూచుని ఎదురు చూశానని చెప్పాడు. ఇక తన కుటుంబం విషయానికి వస్తే మూడునెలల క్రితమే తన తండ్రి, తల్లి, చిన్న తమ్ముడు మోసెస్ వచ్చారట. తన అన్నయ్య ఛార్లీ అతని భార్య ఫాగా వారి ఇద్దరు పిల్లలు, ఇద్దరు మేనకోడళ్ళు జోలా, సారా వారి వారి భర్తలతో నార్త్ డకోటా అనే ప్రాంతంలో గవర్నమెంట్ వద్ద చవగ్గా కొన్న ప్రయరీ గడ్డి భూముల్లో స్థిరపడ్డారని చెప్పాడు.

"ఇక నీవు వచ్చేశావు కాబట్టి నా దృష్టి అంతా వ్యవసాయం మీదే పెట్టదలచాను. మరో వారం రోజుల్లో ఈ న్యూయార్క్ వదిలి నార్త్ డకోటా వెళ్లిపోదాం. అక్కడే మన పెళ్లి జరుగుతుంది" అని చెప్పాడు. పైగా గవర్నమెంటు రూలు ప్రకారం పెళ్ళయిన వారికే భూమి కేటాయింపులో రిజిస్ట్రేషన్ జరుగుతుందనీ, అందులో భార్య పేరూ ఉండాలనీ వారిద్దరి ఉమ్మడి ఆస్తిగా అది రికార్డులకు ఎక్కుతుందనీ చెప్పాడు. తను పెళ్ళికి తొందరపడడంలో ఇదీ ఒక కారణం కావచ్చు. మా యూదుల్లో మరొక మతం వారిని పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడరు.

నేను అన్నీ వింటున్నాను.

గ్రేటంకుల్ చెప్పిన మాటలు గుర్తుకు వస్తున్నాయి. "అబ్రహం మంచివాడే, నేను ఎరిగున్న రోజుల్లో. ప్రస్తుతం న్యూయార్క్‌లో ఉన్నాడేమో, మారిపోయి ఉండవచ్చు."

లేదు లేదు! లేదంకుల్... మారలేదు. బాధ్యతగల మనుషుల్లో మార్పు ఉండదు. బాధ్యాతాయుతమైన అతని మాటలు వింటుంటూనే తెలుస్తోంది.

నా మనసు ఆనందంతో నిండిపోయింది.

పెన్నీ అన్నా లేని పద్దెనిమిదేళ్ల అమ్మాయిని. దరిద్రావస్థలో ఉన్నదాన్ని. కట్నకానుకలు ఇస్తే గానీ వరుడు దొరకని పరిస్థితి. అబ్రహం మాటలు వింటూంటే మధురంగా అనిపించి పరమాత్ముని మనసారా తలచుకున్నాను. ఇక ఇతనితోనే నా నడక మొదలవ్వాలి.

ఈ నార్త్ డకోటా ఎక్కడుందో నాకు తెలియదు.

ఆ వారం రోజులూ ఇట్టే గడిచిపోయాయి. మేం నార్త్ డకోటాకు ప్రయాణం కావలసిన రోజు వచ్చేసింది. రైల్లో ఇద్దరం బయలుదేరాం. మూడు రోజుల ప్రయాణం. ఏ వంద మైళ్ళకో ఓ చిన్న స్టేషన్ వస్తుంది. ఎవరో ఇద్దరు ఎక్కుతారు. ఒకే ఒక్కడు దిగుతాడు. రైలు మాత్రం గంట ఆగుతుంది. కొండలు, రాళ్ల రప్పలు... అడవి మార్గం గుండా ప్రయాణం. ఇలా ఎన్ని మైళ్లు వెళ్లామో తెలియదు. తరువాత అంతా గడ్డి మైదానం మీదే ప్రయాణం. వాటిని ప్రయరీలు అంటారు. డకోటా ఈ గడ్డి మైదానంలోనే ఉంది. మూడు రోజుల అనంతరం మేం దిగవలసిన స్టేషన్ వచ్చింది. అక్కడ దిగి మరో ముప్పయి మైళ్లు కాలినడకన వెళితే గానీ వీరి నివాస ప్రాంతానికి చేరుకోలేం!

స్టేషన్‌లో దిగాం.

ఆ ఊరు కొంచెం పెద్దదే. ప్రయాణికుల హడావుడి ఎక్కువగానే ఉంది. చాలా మంది ప్రయాణికులు దిగారు. కొంతమంది ఎక్కారు. స్టేషన్‌కు అబ్రహం అన్న ఛార్లీ వచ్చాడు. ఆయన మాకు ఎస్కార్ట్ అన్నమాట. నాకు అతన్ని చూడగానే అబ్రహంకు అన్నయ్యంటే నమ్మకం కలగలేదు. 'మా అన్నయ్య... ఛార్లీ' అని పరిచయం చేశాడు కాబట్టి నమ్మవలసి వస్తోంది. మా ఊరిలో హీనమయిన పనులు చేసేవారు కూడా ఇంతకన్నా బాగుంటారు. ఆయనను చూడగానే మనసు అదోలా అయిపోయింది. ఒంటినిండా మట్టి పట్టిన మురికి గుడ్డలు. షేవింగ్ చెయ్యని గెడ్డం. కాళ్లకు బూట్లు ఉండవలసిన ప్రదేశంలో గడ్డి తాళ్లతో అల్లిన బూట్లు ఆకారం గలవి వేసుకున్నాడు అనే బదులు, కాళ్లకు గడ్డి కట్టుకున్నాడనడం మేలు. ముఖం నిండా పగుళ్లు, రక్తపు చారలు కనిపిస్తున్నాయి. చిరునవ్వు నవ్వాడు.

నేనూ జవాబుగా నవ్వాను గానీ, ఈయనే ఇలా ఉంటే ఇక ఇంట్లో వారు ఎలా ఉంటారో అని భయమేసింది. అబ్రహం చేతుల్లో ఉన్న బరువుని

**ఏదో అనుకుంటే ఇంకేదో జరుగుతోంది. ఆమె కలలన్నీ కల్లలవుతున్నాయి. ఆమెకు చెప్పింది ఒకటి జరుగుతున్నది మరొకటి. అసలు ఈ బ్రతుకేమిటి? ముందు ముందు ఇంకెలా ఉంటుందో? అని ఆలోచిస్తోంది. ఆలోచిస్తున్న కొద్దీ ఆమె గుండెలు చెదురుతున్నాయి. కళ్ళల్లో నీళ్ళు తిరిగి వెచ్చగా చెంపలవెంట జారాయి. అసలేం జరిగింది? ఆమె ఎందుకలా ఆలోచిస్తోంది?**

తన చేతుల్లోకి తీసుకోవడానికి చేయి చాచాడు. అప్పుడు చూశాను. అరచేయి పగిలిపోయి ఎర్రటి రక్తపు చారలుగా ఉంది. ఇలా ఈ చలికి జరిగి ఉంటుందేమో అనిపించింది. స్టేషన్ బయటకు వచ్చాము. కొంచెం దూరంలో ఛార్లీ తెచ్చిన గూడు బండి ఉంది. దానికి రెండు గుర్రాలు పూన్చి ఉన్నాయి. ఈ గుర్రాలు అద్దెకు తెచ్చినవట. ఆ గూడు బండి మాత్రం వీరిదే. ఆ గూడు బండిని వేగన్‌లంటారు. ఈ బండి కాక, మూడు ఎద్దులూ, మూడు ఆవులూ వీరికున్నాయట. నేను, అబ్రహం బండి ఎక్కాము. అది బయలుదేరింది. బండి బాగానే ఉంది కానీ సరైన దారి లేక ఆ గడ్డి మార్గంలో ఒకటే కుదుపులు. రెండు మూడు గంటల తరువాత వారుంటున్న ఇంటికి చేరుకున్నాం.

నేను ఊహించినట్టే ఉంది.

అబ్రహం తండ్రీ, తల్లీ, తమ్ముడు మోసెస్, అబ్రహం మేనకోడళ్ళు డోచా, సారా అందరూ అక్కడే ఉన్నారు. వారిని చూడగానే షాక్‌కి గురయ్యాను. ఆడవాళ్ల కాళ్లకి మగవారి బూట్లున్నాయి. మగవారి కాళ్లకూ, ఛార్లీ ఇద్దరు పిల్లల కాళ్లకూ గడ్డి చుట్టుకొని అది జారిపోకుండా దారాలతో కట్టుకున్నారు. ఇక ఒంటి మీద బట్టలు చెప్ప నవసరం లేదు. మురికితోలు గుడ్డలు. గౌరవనీయులైన యూదు వనితలు ఇలా ఉంటారా? లేక ఈ మైదానంలో వ్యవసాయం చేయడం వల్ల ఇలా ఉన్నారా? ఎంత పేదవారయినా ఒంటినిండా పరిశుభ్రమైన ఉన్ని దుస్తులతోనూ లేక నూలు దుస్తులతోనూ ఉంటారే! నేను నా వెంట తెచ్చుకున్న సామాను కిందపెట్టి అక్కడే ఉన్న బల్ల మీద కూచున్నాను.

నా చుట్టూ ఉన్న వారంతా నన్ను నఖశిఖ పర్యంతం పరీక్షగా చూస్తున్నారు. వారేమన్నా అడిగితే మెల్లగా సమాధానం ఇస్తున్నాను. వారి ప్రశ్నలు చూస్తుంటే నాకు స్వాగతం పలుకుతున్నారని అనిపించింది. రేపు నేనూ ఇలాగే తయారవుతానా? ఈ ప్రయరీ గడ్డిభూముల్లో జీవితం ఇలాగే ఉంటుందా?

ఇక ఇల్లు చూద్దామంటే ఇరుగూ లేదు పొరుగూ లేదు. అక్కడక్కడ కనీకనపడనట్టు రెండు మూడు ఇళ్లు కనిపిస్తున్నాయి. అదీ ఎంతో దూరాన. ఈ ఇంటి లోపల చూస్తే దాన్ని ఇల్లు అనడం కన్నా ఒక పెద్ద చెక్క డబ్బా అనడం



# ఆ పాత్ర చేయాలనుందట!

'**బా**హుబలి 2' లో నటించిన వారికి వస్తున్న పేరు ప్రఖ్యాతులు సినీరంగంలో వారికి అసూయను కలిగిస్తున్నాయనడంలో ఎలాంటి అనుమానం లేదు. అందులో నటించిన ప్రభాస్, రానాల సంగతి పక్కన పెడితే ఇప్పుడు అందరి దృష్టి అనుష్క మీద పడింది. ఆమె బదులు తాము నటించి ఉంటే అంత పేరు తమకూ వచ్చి ఉండేది కదా అని చాలా మంది మనసులో మల్లగుల్లాలు పడుతున్నారు. కాకపోతే వారెవ్వరూ బయట పడకపోయినా, సమంత మాత్రం ఓపెన్ అయిపోయింది. ఇటీవల ఓ సమావేశానికి వెళ్ళిన సమంత 'దేవసేన' పాత్ర తను చేసి ఉండాల్సింది అంటూ చెప్పుకొచ్చింది. కాకపోతే సమంత మాటలే కొందరిని అయోమయానికి గురిచేశాయట! ఈ పాత్ర ముందుగా సమంత దగ్గరకు వచ్చిందా? అన్న అనుమానాన్ని కొందరు వ్యక్తం చేస్తున్నారు.



మేలు. ఆ డబ్బాలోకి అడుగు పెట్టాలంటే చిన్న చిన్న రాతి ముక్కల మెట్లు. ఆ గదిలో ఓ పక్క చెక్కలు పరిచిన మంచం ఉంది. దాని పక్కనే చెక్క టేబుల్. దానికి రెండడుగుల్లో రెండు బెంచీలున్నాయి. నాకు కాబోయే మామగారు చెక్కల మంచం మీద కూర్చుని ఉన్నారు. అయితే ఆ మొత్తం స్థలం రెండు భాగాలుగా కనబడుతోంది. మరో పక్క వంట చేసుకునే ప్రాంతం! కిరోసిన్ స్టవ్, దాని పక్కనే మామూలు రాతి పొయ్యి. దానికి పిడకలు వాడతారు కాబోలు. అవి ఆ పొయ్యి వెనక గుట్టలుగా పోసి ఉన్నాయి. అక్కడ వంటకు కర్రలు వాడుతున్న దాఖలాలు లేవు. ఇల్లంతా పేడ వాసన.

గది అంతా పేడతో అలికినట్టు తెలుస్తోంది.

ఆ గదిలో మరో పక్క చిన్న తలుపు వంటిది ఉంది. అది బాత్‌రూం అనుకున్నాను. కాదట! అది పశువుల శాల. లేక పశువుల్ని కట్టిన గది!

మరి బాత్‌రూం అవసరాలుంటాయి కదా! మరి దాని పరిస్థితి ఏమిటి? అలాంటి అవసరాలకు బయటకు, ఆ గడ్డి మైదానాల్లోకి పోవడమే. ఆ గడ్డి దుబ్బులు మామూలుగా ఉండవు. చుట్టూ దొరికే నీటివనరునుబట్టి మనిషంత ఎత్తులో ఆ రెల్లుగడ్డి దుబ్బులుంటాయి. అందువల్ల వాటిని చాటుగా చేసుకుని మన పని పూర్తి చేసుకోవాలి.

మధ్యలో షిప్ ఎక్కినా, టౌన్ నుండి వచ్చిన దాన్ని కాబట్టి నాకిదంతా సిగ్గుగానూ, ఆశ్చర్యంగానూ ఉంది. నేను ఆ గది లాంటి ఇంట్లోకి వెళ్ళాను. నా చేతిలోనున్న బట్టల మూటను ఓ బల్ల మీద చివర నుంచాను. నాకు కాబోయే మావగారు ఆ చెక్క బల్లను వదిలేట్టు లేడు. ఇప్పుడు చూస్తే దానిమీదే పడుకున్నాడు. ఇక మిగిలిన వారి పరిస్థితి ఏమిటి?

నాకు కాబోయే అత్తగారు ఇల్లంతా చక్కబెడుతోంది. ఆమె ఒంటి మీద బట్టలు కూడా మురికిగానే ఉన్నాయి. నేను వచ్చానని ఆ రాత్రి విందుభోజనం వండింది (కాపురానికి వచ్చి ముగ్గురుపిల్లల తల్లయినా, ఆ రోజు ఆవిడ వండిన వంటకం గుర్తుంది). ఉడకపెట్టిన దుంపలు, కొంత వెన్న, నీళ్ల పాలు.

మూడురోజులు రైలు ప్రయాణం... ముప్పయి మైళ్ల ఈ గడ్డి మైదానంలోంచి ఇంటికి రావడం... చివరికి ఈ భోజనం.

భోజనాలు అయ్యాక, ఆ చీకట్లో అబ్రహం మేనకోడళ్లు వారివారి భర్తలతో వారిళ్లకి వెళ్లిపోయారు. అబ్రహం వైపు చూస్తూ నేను అన్నాను "పద! నీ ఇంటికి వెళ్లిపోదాం!" అని.

ఈసారి అబ్రహం ఆశ్చర్యపోయాడు. వెంటనే నాక్కాబోయే అత్తగారు కలగజేసుకుంది. "అలా వెళ్లకూడదు. ఈ రాత్రి ఇక్కడే నిద్రపోవాలి" అంది.

నేను నేలచూపు చూడడం మొదలెట్టాను. అదంతా హరికేన్ లాంతరు వెలుతురులోనే. ఈ ముసలామె ఈ చిన్న గదిలో మమ్మల్ని ఎలా సర్దుతుంది? ఎలా పడుకొమ్మంటుంది? నేను నోరు మెదపలేదు. అబ్రహం, వాళ్ల నాన్నా ఓ పదినిమిషాలు మాట్లాడుకున్నారు బల్ల మీద కూచుని.

ఇక నిద్రకు ఉపక్రమించాలి.

ఇక్కడంతా నాకు కొత్త కాబట్టి వారు చెప్పినట్టే చేయాలి. ముసలామె, నేనూ ఆ చెక్క మంచం మీద, చెరో పక్కా సర్దుకుని పడుకున్నాం. అబ్రహం, అతని తండ్రీ ఓ మూల గడ్డి పరుచుకొని దానిపై కంబళ్ళు వేసుకున్నారు. మరోమూల గడ్డిపరుచుకుని చార్లీ, అతని భార్యా, పిల్లలూ సర్దుకున్నారు. మోసెస్ గుమ్మానికి అడ్డంగా గడ్డి పరుచుకున్నాడు.

ఆ ఇంటికి కొత్త మనిషి రాగానే నిద్రపోవడానికి పడ్డ పాట్లు గుర్తొచ్చాయి కాబోలు, ఉదయాన్నే చార్లీ, అబ్రహం మాట్లాడుకుంటున్నారు. బయట, వీలైనంత త్వరలో ఇంటికప్పు కోసం గట్టి బోర్డ్ వంటిది టౌన్‌లో కొనడం, మూడు గదులు దగ్గర దగ్గరగా వెయ్యడం. ఆ గదులు కూడా వీలైనంత ఎత్తులో నిర్మించడం.

ఈ గడ్డి భూముల్లో పెనుగాలులు ఎక్కువట. అందువల్ల ఆ కట్టే గదులేవో కొంచెం దిట్టంగానే వేయాలి. మూడింటిలో మొదటి దానిలో వాళ్ల అమ్మానాన్నా, తమ్ముడూ, రెండవ గదిలో అన్నగారయిన చార్లీ, అతని భార్యా పిల్లలూ, ఇక మూడవ గదిలో అబ్రహం, నేనూ ఉంటాము. ఇది నిజంగా రూపుదాల్చేనా? ఈ ఆలోచన ఎన్నాళ్ల నుంచీ వీరి మధ్య నలుగుతుందో తెలియదు. తమాషా ఏమంటే ఈ భూమి అంతా వీరిదే! మొత్తం నూట అరవై ఎకరాలు. సరైన చిన్నపాటి ఇల్లు లేదు. అప్పట్లో అమెరికా గవర్నమెంటు భూమి విషయంలో ఇలా ఉంది. వ్యవసాయం చేసుకుంటామని ఎవరు వచ్చినా 160 ఎకరాలు ఉచితంగా ఇస్తుంది. అయితే దానిని 14 నెలల్లో వారికి సంతృప్తికర రీతిలో నేలను దున్ని పంట భూములుగా మార్చాలి. 'కల్టివేషన్ ఆఫీసర్' వచ్చి మొత్తం చెక్ చేస్తాడు. అతను సంతృప్తి చెందితే ఒక డాలర్ ఐదు సెంట్లకు ఒక ఎకరం చొప్పున, అలా నీకు కావలసిన చోట ఎంత భూమి కావాలంటే అంతా ఇస్తుంది. ఒకవేళ ఆశపడి ఎకరాలకు ఎకరాలు నీ పేర్న తీసుకున్నావనుకో... అందులో ఏ పంటా పండించకపోతే అరవై ఎకరాలకు ఇరవై డాలర్లు ఫైన్‌గా చెల్లించవలసి ఉంటుంది. అంతే కాదు, ఆ భూమి తిరిగి ప్రభుత్వపరమై పోతుంది.

చార్లీ, అబ్రహంలు ఒక మాట అనుకున్నారు కదా కుటుంబం పెరుగుతోంది కాబట్టి కొంచెం

పెద్ద ఇళ్లు వేసుకుందామనీ. అవి రూపు దాల్చుతున్నాయి. పన్నెండు అడుగులు, పద్నాలుగు అడుగులతో చిన్న గదులు... లోపల ఎత్తుగా ఉండాలి.

ఇక్కడ మంచు చలిగాలులు ఎక్కువే! గాలి వీస్తే నేలంతా కదిలిపోయేటట్టు వీస్తుంది. ఈ విషయం అందరం ఒకచోట కూర్చుని చర్చిస్తున్నాం కాబట్టి నేనూ నా అభిప్రాయం చెప్పాను.

"మైళ్లకు మైళ్లు మాటిమాటికీ వెళ్లలేం కాబట్టి మొదట ఉన్న పెద్ద ఇల్లు అలాగే ఉంచి, కట్టబోయేవి చిన్న చిన్న ఇళ్లు కాబట్టి కింద చక్రాలు అమర్చి ఒకచోట నుంచి మరొక చోటుకి అంటే పనులు చేసే చోటుకి తీసుకెళ్తే ఎలా ఉంటుందో ఆలోచించమన్నాను. దానివల్ల కళ్లం దగ్గరే గదులు అటూ ఇటూ ఉంటాయి. అక్కడే అన్ని పనులూ జరుగుతాయి. మధ్యలో పశువుల్ని కడదాం. వాటినీ కనిపెట్టుకుని చూడవచ్చు" అన్నాను.

ఇది వారందరికీ నచ్చింది.

ఆ రకమైన ఇళ్లు తయారవుతున్నాయి.

సామాన్లు లాంటివి పెట్టుకోవడానికి గోడల్లోనే చెక్కలుకొట్టి టేబుల్స్ లాంటివి ఏర్పాటు చేశారు.

ఒకరోజు ఉదయం ఆ గడ్డి మైదానాలకు అడ్డంపడి నేనూ, అబ్రహాం నడవడం మొదలెట్టాం. వారి వారి ఇళ్లు మూడు నాలుగు మైళ్ల దూరంలోనే ఉన్నా సరియైన దారి లేదు. ఏదో అంటున్నారని గాలివాటు ప్రయాణం చెయ్యడమే.

గడ్డి మైదానాలంటే మామూలు పొదాలు మునిగేంత కాదు, మనిషి అంత ఎత్తుండే రెల్లు పొదలు. అందులో ఆ గడ్డి చాటున తోడేళ్లూ, విషపు పురుగులూ ఎక్కువ. "మీరూ మీ అన్నదమ్ములూ ఆలోచించండి. ఈ గడ్డిని నరికి సరైన దారి చెయ్యవచ్చుగా. కనీసం మనవాళ్ల ఇళ్ల వరకు" అన్నాను.

"చెయ్యాలి... చేద్దాం" అన్నాడు.

ఇద్దరం మౌనంగా అడుగులు వేస్తున్నాం. అయితే అది అంత తేలికైన పని కాదు. వర్షాకాలం వస్తే తిరిగి ఆ గడ్డి మళ్ళీ ఎదగదన్న గ్యారంటీ ఏమిటి? ఆయన మేనకోడళ్ల ఇళ్ళకి వెళ్లాం. అవి గొప్పగా లేవు గానీ ఫరవాలేదు. వాటికి ఇంకా కొన్ని వసతులు లేవు. తిరిగి వచ్చేటప్పుడు అబ్రహాం మా కామన్ హౌస్ ఇంటివెపు దారి తీశాడు. కొత్తగా కట్టిన ఈ చిన్న ఇళ్లల్లో ఏ పనీ పూర్తి కాలేదు.




గాలికి నేలంతా కదిలిపోయేట్టు ఉండటమే కాదు రెల్లుగడ్డి దుబ్బులు విపరీతంగా శబ్దం చేస్తాయి. ఆ చలిగాలులూ వర్షపునీరు లోపలకి రాకుండా వీలైనంత గట్టిగానే అబ్రహాం అన్ని వైపులా, పైనా రేకులు పరిచి మేకులతో కొట్టించినా ఒకరాత్రి పెనుగాలులు వీచాయి. చార్లీ ఉంటున్న ఇంటి కప్పు ఎగిరిపోయింది. ఇంట్లో సామాను ఓ మూల పడింది. ఎవరికీ ఏ ప్రమాదం జరగలేదు. అప్పటి వరకూ ఉన్న నా ఆలోచనల్లో మార్పు వచ్చింది. అమెరికా వచ్చాక కూడా నేనింకా ఉక్రెయిన్‌లో ఉన్నట్టే ఆలోచిస్తున్నాను!

ఇకపై కట్టుకోబోతున్న నివాస గృహాలేవో కొంచెం దిట్టమయిన పునాదులతో కట్టుకోవాలనీ, పశువులకూ, గుర్రాలకూ మాకూ నాలుగడుగుల దూరంలో శాలలు వేసినా అవి దిట్టంగా ఉండాలనీ అనిపించింది. ఇంతవరకూ మాకు ఉన్న ఉమ్మడి ఇల్లు... ఆ పెద్ద ఇల్లే కనపడుతోంది దిట్టంగా.

అబ్రహాం మేనకోడళ్ల ఇళ్లు ఎలా ఉన్నాయో చూడాలి. మొన్న వచ్చిన అంత పెద్ద గాలికీ వారిళ్లు చెక్కుచెదరలేదు!

కాబట్టి తప్పదేమో!

నాక్కాబోయే అత్తగారు మాకు ఎదురొచ్చింది. అబ్రహాంను చిన్న చిన్న విషయాలు అడుగుతూ పలకరించింది. ఈయనా వాటికి సమాధానాలు చెబుతున్నాడు. చిన్నగా ఆ ఇంటి ముందున్న మట్టి అరుగు మీదకు చేరాం. అయితే ఆ అరుగుపై ఓ పక్క అప్పటికే చార్లీ, ఆయన భార్యా, పిల్లలు కూర్చుని ఉన్నారు. వారి నాలుగు సంవత్సరాల కుర్రాడు నా వైపు ఎగాదిగా చూస్తున్నాడు. వాడి ముక్కు అదే పనిగా కారుతోంది. వాడి ఒంటి మీద అంత చలిలోనూ చొక్కా తప్ప కింద లాగూ లేదు. ఇక ఇంటిలోపలికి చూస్తే గుమ్మం దగ్గరగా ఉన్న చెక్కబల్లకు ఒక దానికి కాలు లేదు. ఇంతవరకూ దాన్ని నేను గమనించలేదు.

నాక్కాబోయే మావగారు ఎప్పటిలాగే కింద వేసిన గడ్డి మీద కూర్చున్నాడు. చీకటి పడుతోంది.

మరలా నిన్నటిలాగే లోపలే సర్దుకొని పడుకోవాలి కాబోలు... భగవంతుడా! అనుకున్నాను. నేనేదో అనుకున్నాను. ఇంకేదో అవుతోంది. నా కలలన్నీ పగటి కలలవుతున్నాయి. ఛాయ చెప్పిన మాటల ప్రకారం ఈ అమెరికాలో వీరు సెటిల్ అయిన ఫ్యామిలీ. కానీ అదేం లేదు. ఇల్లూ వాకిలీ, పాడీ పంటా ఏమీ లేవు. ఆలోచిస్తున్న కొద్దీ గుండెలు చెదురుతున్నాయి.

నాక్కాబోయే అత్తగారు వంటపని మొదలు పెట్టింది. బుడ్డి దీపం వెలుగులో మరో అరగంటలో వంట పని పూర్తయ్యింది. ఇనప మూకుడులో ఉడకపెట్టిన గింజలూ, పాలూ. అందరితో పాటే నేనూ ఇన్ని గింజలు తిని పాలు తాగాను. ఇక ఈ ఇంట్లో నిద్రపోవాలి. ఎలా సర్దుకోవాలో ఏమో తెలియాలి. ఏవేవో కబుర్లలో పడ్డారు కాసేపు. నాకు కాబోయే మావగారు ముందే ఓ మూల ఇంత ఎండుగడ్డి పరుచుకుని దానిపై కంబళి వేసుకొని నిద్రకు ఉపక్రమించాడు. ఆ గది మధ్యలో ఉన్న లాంతరు వత్తి తగ్గించారు. తగ్గిస్తూనే ఆ ముసలామె "ఇందులో కిరోసిన్ అయిపోయినట్టుంది. రేపు తెచ్చుకోవాలి" అంది.

అబ్రహాం "అవును" అన్నాడు ముక్తసరిగా.

కాసేపటికి అబ్రహాం, మోసెస్ ఆ ముసలాయన పక్కనే ఇంత ఎండుగడ్డి పరుచుకుని పడుకున్నారు. ముసలామెతోపాటు అందరం బయటకు వెళ్లాం. టాయ్‌లెట్‌గా ఆపక్క, ఈపక్క ఉన్న రెల్లు దుబ్బుల ప్రదేశాన్ని ఉపయోగించుకుని లోనకు వచ్చాం. నేను ఎక్కడ పడుకోవాలో తెలియలేదు. దిక్కులు చూస్తూ, పరాకుగా తలెత్తి పైకి చూశాను. ఆ రోజు మరో దృశ్యం కంటపడింది.

పైకప్పు రేకుకి రంధ్రాలున్నాయి కాబోలు కాగితం ముక్కలు నలిపి ఆ రంధ్రాల్లో దూర్చారు. గట్టిగా గాలి వీచినా, వర్షం వచ్చినా అవి ఎంత సేపుంటాయి. ఇవన్నీ వీరికి తెలియవా? లేకపోతే అమాయకత్వమా?

ఛార్లీ, ఆయన భార్య, మరో పిల్లవాడు ఆ గదిలోనే మరో పక్క గడ్డి పరుచుకుంటే, రెండు సంవత్సరాలుండే చంటాడిని తనతోపాటు చెక్క మంచం ఎక్కించింది ముసలామె. సర్దుకొని పడుకుంటూ "ఈ పక్కన నువ్వు పడుకో. సరిపోతుందిలే" అంది.

నిజంగా సరిపోతుందా?

నేను ఇంత గడ్డిని ఓ మూల పరుచుకొని పడుకుంటే! నాకు అలవాటు లేదే! అలవాటు మాట దేవుడెరుగు అసలు స్థలమే లేదే కింద...

సరే నేను ఎలాగో ముడుచుకుని ఆమె పక్కనే ఆ చెక్క మంచం మీదే నిద్రకు ఉపక్రమించాను. ఇలా నిద్ర పడుతుందో లేదో నడుం పక్క, చేతి కింద ఏదో వెచ్చగా తగిలింది. తడిమి చూస్తే ఆ చంటాడు ఉచ్చ పోసేశాడు. నడుము పైభాగం తడిసిపోయింది. చలి, రొచ్చు వాసన. ఇప్పుడేమిటి గతి?

దీపం మిణుకు మిణుకు మంటోంది. ఈ చీకటిలో పొడిబట్ట దొరికే అవకాశం లేదు. నిద్ర రాదు. ఈ బ్రతుకేమిటి? ముందు ముందు ఈ బతుకు ఎలా ఉంటుందో? కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఎంత మరిచిపోదామన్నా గత విషయాలు గుర్తొస్తూనే ఉన్నాయి.

**(ఇంకా వుంది)**



దొంగిలించిన డబ్బునంతా తెచ్చి అక్కడ ఆ బ్యాంకులాకర్లో దాచాడతను. నెంబర్ అడిగితే చెప్పాడు. తెరచి కావాల్సినంత డబ్బు తెచ్చుకో అన్నాడు. తాళాలిచ్చాడు. బ్యాంకువాళ్ళని మేనేజ్ చేసి లాకర్‌రూమ్‌లోనికి ప్రవేశించిందామె. కోట్లాది రూపాయలు కరెన్సీగానూ, బంగారంగానూ, వజ్రాలుగానూ, ఖరీదైన పేపర్లగానూ ఉన్న ఆ రూమ్‌ని చూస్తోంటే మతిపోయిందామెకు. ఏం చెయ్యాలో తెలియని పరిస్థితిలో కూర్చుందక్కడ. తర్వాత ఏం జరిగింది?

**ప్రముఖ రచయిత** ప్రభాకర్‌జైని

సరికొత్త సీరియల్

# లాకర్ నెం. 369

వచ్చేవారమే ప్రారంభం

# ఆరోగ్యాన్ని అందించే ఆహారం











**ఎన్ని సంపదలున్నా సరే ఆరోగ్యం సరిగ్గా లేకుంటే ఏం ప్రయోజనం చెప్పండి.. నేటి కాలంలో ప్రతి ఒక్కరూ ఆరోగ్యంపై శ్రద్ధ చూపిస్తున్నారనేకన్నా ఆ అవసరం ఏర్పడింది అనడమే కరెక్టేమో! ఈ నేపథ్యంలో ఆహారానిదే ముఖ్యపాత్ర. అలాంటి ఆరోగ్యానికి మేలు కలిగించే ఓ పది ఆహారపదార్థాల గురించి తెలుసుకుందాం. ఈ దశాహారాలను మీ రోజువారీ జీవితంలో భాగం చేసుకుంటే చాలావరకు అనారోగ్య సమస్యలు దరిచేరవని నిపుణులు చెబుతున్నారు. అవేంటో మీరూ తెలుసుకుని వాటిని మీరూ మీ మెనూలో చేర్చుకోండి.**

### వెల్లుల్లి

ఉల్లి చేసిన మేలు తల్లి కూడా చేయదంటారు. ఉల్లి, వెల్లుల్లి ఒక జాతికి చెందినవే. వెల్లుల్లిలో ఎన్నో అద్భుత ఔషధ గుణాలున్నాయి. వెల్లుల్లిలో ఉండే సల్ఫర్ కాంపౌండ్లకు వ్యాధులపై పోరాడే మంచి శక్తి ఉంది. ఇవి యాంటీ ఆక్సిడెంట్లుగా పనిచేస్తాయి. వీటిలో ఎక్కువ ప్రయోజనాలు గుండెను కాపాడేందుకు ఉపయోగపడేవే. వారంలో కనీసం ఆరు వెల్లుల్లి రెబ్బలు తినేవారిలో చెడు కొలెస్ట్రాల్ ప్రమాదం చాలావరకూ తగ్గుతుంది. ఉదర సంబంధ వ్యాధులు, ప్రొస్టేట్ కేన్సర్ ముప్పును తగ్గిస్తుంది. ప్రతిరోజూ కనీసం ఒక వెల్లుల్లి రెబ్బ తీసుకోవాలి. వెల్లుల్లిని కత్తిరించి పదినిమిషాల తర్వాత తింటే మరింత మేలు.

### ఆలివ్ ఆయిల్

చెడు కొలెస్ట్రాల్ (ఎల్‌డీఎల్)ను తగ్గించడం, మంచి కొలెస్ట్రాల్ (హెచ్‌డీఎల్)ను పెంచడం ఆలివ్ ఆయిల్‌తో సాధ్యం అవుతుంది. ఆలివ్ ఆయిల్‌లో ఫెనాల్స్ అనే యాంటీ ఆక్సిడెంట్లు ఉంటాయి. ఇవి గుండె ధమని గోడల్లో కొలెస్ట్రాల్ ఏర్పడకుండా నిరోధిస్తాయి. ప్రతిరోజూ ఒక టీ స్పూన్ ఆలివ్ ఆయిల్‌ను భోజనంలో భాగం చేసుకుంటే చాలు. అందులో ఉండే విర్జిన్, ఎక్స్‌ట్రా విర్జిన్, కోల్డ్ ప్రెస్డ్ రకాలు మేలు చేస్తాయి.

### బ్లూ బెర్రీస్

బ్లూబెర్రీస్ (నల్ల ద్రాక్ష మాదిరిగా ఉండే)లో యాంటీ ఆక్సిడెంట్లు ఎక్కువ ఉంటాయి. ఎన్నోరకాల అనారోగ్యాలను నివారించగలవు. 40 రకాల పండ్లు, కూరగాయలతో పోలిస్తే బ్లూ బెర్రీస్‌లో ఎక్కువ వ్యాధుల్ని నివారించే గుణాలున్నాయని పరిశోధనల్లో వెల్లడైంది. గుండెవ్యాధుల నుంచి రక్షించే వీటిని బ్లూ గార్డ్స్‌గా చెబుతారు. కేన్సర్, వయసు పైబడడంవల్ల వచ్చే మతిమరుపు సమస్యలు నివారించే గుణాలు ఈ పండ్లలో ఉన్నాయి. మూత్రనాళ ఇన్ఫెక్షన్ల నివారణలో వీటికివే సాటి. ఇందులో ఉండే ఎపికేటచిన్స్‌వల్ల ఈ ప్రయోజనం కలుగుతుంది. ఇవి మూత్రాశయ గోడలపై బాక్టీరియా తిష్టవేయకుండా నివారిస్తాయి. వారంలో మూడుసార్లు అరకప్పు బ్లూబెర్రీపండ్లు తీసుకోవడం ద్వారా ఈ ప్రయోజనాలు పొందవచ్చు.

### బ్రకోలి

కాలీఫ్లవర్ మాదిరిగా ఉండే ఈ కూరగాయలో కేన్సర్ నిరోధక గుణాలెన్నో ఉన్నాయి. ఇందులో ఉండే సల్ఫోరఫేన్ అనే సల్ఫర్ కాంపౌండ్ల వల్ల ఇది సాధ్యమవుతుంది. బ్రకోలిని ఉడకబెడుతున్నప్పుడు వచ్చే ఘాటైన వాసనలు ఈ కాంపౌండ్లనుండి వచ్చేవే. ఈ సల్ఫర్ కాంపౌండ్లు మన శరీరంలో కేన్సర్ కారకాలను సమర్థంగా నిర్వీర్యం చేసే ఎంజైమ్‌ల ఉత్పత్తిని పెంచుతాయి. బ్రకోలిని ఎక్కువగా తినడంవల్ల రొమ్ము, ఊపిరితిత్తుల కేన్సర్, కడుపు, పెద్దపేగు కేన్సర్ రిస్క్‌లను తగ్గించుకోవచ్చు.

### పెరుగు

పెరుగు ప్రతి ఒక్కరికీ ఎంతో అవసరం. తప్పనిసరిగా రోజులో ఒకసారైనా పెరుగు తీసుకోవాలి. ఇందులో కాల్షియం సమృద్ధిగా ఉంటుంది. ఇందులో ఉండే ప్రొబయోటిక్స్ అనే బాక్టీరియా నిజంగా ఎంతో మేలు చేస్తుంది. పేగుల్లో హానికారక బాక్టీరియా వృద్ధి చెందకుండా ఉండాలంటే పెరుగు తినాలి. ఆహారంలో పెరుగు ఎక్కువ తీసుకుంటే ఇన్ఫ్లమేటరీ బవెల్ వ్యాధి (తిన్నవెంటనే విరోచనమయ్యే గుణం) తగ్గించుకోవచ్చు, అలాగే అల్సర్లు, మూత్రనాళ ఇన్ఫెక్షన్లు, జననేంద్రియ భాగాల్లో వచ్చే ఇన్ఫె

### పనితీరును బట్టే కేలరీలు

ఆరోగ్యంగా ఉండాలంటే ఎవరికి ఎన్ని కేలరీలు అవసరమనే అంశంపై పరిశోధనలు జరిగాయి. కూర్చుని పనిచేసే మగవారికి రోజులో 2,425 కేలరీలు, ఓ మోస్తరుగా కూర్చుని పనిచేసేవారికి 2,875 కేలరీలు, శారీరక కష్టం చేసేవారికి 3,800 కేలరీలు అవసరమని హైదరాబాద్‌కు చెందిన నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ పేర్కొంది. అదేవిధంగా కూర్చుని పనిచేసే మహిళలు రోజులో 1,875 కేలరీలు, ఓ మోస్తరుగా కష్టించేవారు 2,225, అధిక శ్రమచేసే మహిళలు 2,925 కేలరీలు తీసుకోవాలి.



క్షన్లు తగ్గించడంలోనూ పెరుగు పాత్ర ఎంతో కీలకం.

### ఓట్స్

ఇది ఆరోగ్యకరమైన ఆహారం. ఇందులో ఉండే బీటా గ్లూటెన్‌కు చెడు కొలెస్ట్రాల్, రక్తపోటును నివారించే శక్తి ఉంది. ఒకరకమైన కరిగిపోయే ఫైబర్ గుణం ఉన్నదే బీటా గ్లూటెన్. రోజూ ఒక కప్పు ఉడికించిన ఓట్‌మీల్ తినడం వల్ల లభించే బీటా గ్లూటెన్ శరీరంలోని కొలెస్ట్రాల్‌ను ఐదుశాతం మేర తగ్గిస్తుందట. అలాగే హార్ట్ ఎటాక్ ముప్పును 10శాతం తగ్గిస్తుంది. ఓట్స్‌లో పాలీ ఫెనాల్స్‌తోపాటు యాంటీ ఆక్సిడెంట్ల గ్రూపు అవెంత్రమైడ్స్ ఉంటాయి. నైట్రిక్ ఆక్సైడ్ ఉత్పత్తిని పెంచడం ద్వారా అవెంత్రమైడ్స్ రక్తపోటును తగ్గిస్తుంది. రక్తనాళాల్లో అడ్డంకులు తొలగి సాఫీగా రక్త ప్రసరణ జరిగేందుకు ఇది తోడ్పడుతుంది. ఎల్డీఎల్ కొలెస్ట్రాల్‌ను, రక్తంలో చక్కెర స్థాయిని తగ్గించడానికి సాయపడుతుంది. ఇన్సులిన్ రెస్పాన్స్‌ను పెంచుతుంది. కడుపునిండిన భావన కలుగుతుంది. జీర్ణకోశ వ్యవస్థలో మంచి బ్యాక్టీరియా పెరిగేందుకు ఓట్స్‌లో ఉండే బీటా గ్లూటెన్ పనిచేస్తుంది. అధిక బరువున్నవారికి ఇది ఎంతగానో ఉపయోగకరం. ఉదయం ఓట్‌మీల్‌ను బ్రేక్‌ఫాస్ట్‌లో ఓ నెల పాటు తీసుకుని బరువు చెక్ చేసుకుంటే ఫలితం మనకే తెలుస్తుంది.

### అవిసె గింజలు

చాలామంది వీటిని తక్కువగా వాడుతుంటారు. ఫ్లాక్స్ సీడ్స్ (అవిసె) గింజలను రోజూ ఒక టేబుల్ స్పూన్ తీసుకుంటే ఎన్నో ఆరోగ్య ప్రయోజనాలు పొందవచ్చు. వీటిలో ఉండే లింగాన్స్ (భారీ కెమికల్ కాంపౌండ్లు) శరీరంలో ఈస్ట్రోజన్ మాదిరిగా పనిచేస్తాయి. కణాలపై ఉండే ఈస్ట్రోజన్ గ్రాహకాలను బ్లాక్ చేస్తాయి. దాంతో పలు హార్మోన్ సంబంధ కేన్సర్ తీవ్రతను అణచివేయడానికి తోడ్పడుతుంది. వీటిలో ఉండే యాంటీ ఇన్ఫ్లమ్మేటరీ శక్తి ఆస్తమా, మొటిమల బారిన పడకుండా కాపాడుతుంది. కనీసం ఒకటి లేదా రెండు టీ స్పూన్ల అవిసె గింజలు ఆహారంలో భాగంగా తీసుకోవాలి.

### దాల్చిన చెక్క

వ్యాధులను సమర్థంగా నివారించే సుగంధ ద్రవ్యాల్లో దాల్చిన చెక్క కూడా ఒకటి. డయాబెటిస్‌తో బాధపడుతున్న వారికి ఇది ఒక సహజ ఔషధంగా చెబుతారు. రక్తంలో చక్కెరను నియంత్రించే శక్తి దీనికుంది. ఒక టేబుల్ స్పూన్ దాల్చినచెక్క పొడి, ఒక టీ స్పూన్ జాజికాయ పొడి, అర టీ స్పూన్ లవంగాలు, ఒక టీ స్పూన్ యాలకులు, ఒక టీ స్పూన్ మసాలాతో కలిపి చేసే పొడి తీసుకుంటే రక్తం గడ్డ కట్టకుండా నివారిస్తుందట. అలాగే, దాల్చినచెక్కలో యాంటీ బాక్టీరియా, యాంటీ ఇన్ఫ్లమేటరీ గుణాలున్నాయి. 'ఈ-కొలి' వంటి ప్రమాదకరమైన బ్యాక్టీరియాను అణగదొక్కగలదని పరిశోధనల్లో రుజువైంది. ప్రతి రోజూ పావు టీ స్పూన్ మేర ఈ మిశ్రమం తీసుకుంటే ట్రైగ్లిజరైడ్లను తగ్గిస్తుంది. టోటల్ కొలెస్ట్రాల్ సైతం 12 నుంచి 30 శాతం వరకు తగ్గుతుంది.

### గ్రీన్ టీ

గ్రీన్ టీలో యాంటీ ఆక్సిడెంట్లు పుష్కలంగా ఉంటాయి. ఇవి గుండె జబ్బుల నుంచి రక్షణ కల్పిస్తాయి. గుండెకు చేటు చేసే చెడు కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తాయి. జీవక్రియలను మెరుగుపరుస్తాయి. ఫలితంగా శారీరక, మానసిక ఆరోగ్యం సాధ్యమవుతుంది. అలాగే యాంటీ ఆక్సిడెంట్లు హార్ట్ స్ట్రోక్, కేన్సర్ రిస్క్ తగ్గించేందుకు సాయపడతాయి. రక్తనాళాల్లో అడ్డంకులను తొలగించి, వాటి పనితీరును మెరుగుపరుస్తాయి. రోజూ ఒకటి లేదా రెండు కప్పులు గ్రీన్ టీ తీసుకునే వారిలో రక్తనాళాలు కుచించుకుపోవడం 46 శాతం మేరకు తగ్గుముఖం పడుతుందని పరిశోధనల్లో వెల్లడైంది. గ్రీన్ టీలో పోషకాలు కూడా ఉంటాయి. ఇందులోని ఈ.జీ.సీ.జీ శరీరంలో ఫ్రీ రాడికల్స్ ఏర్పడడాన్ని తగ్గించి కణాలు దెబ్బతినకుండా కాపాడుతుంది. ఇంకా గ్రీన్ టీలో మినరల్స్ సైతం స్వల్ప పరిమాణంలో ఉంటాయి. గ్రీన్ టీ తాగే మహిళల్లో 22 శాతం మేర బ్రెస్ట్ కేన్సర్ ముప్పు తగ్గుతుందని ఓ పరిశోధనలో వెల్లడైంది.

### బీన్స్

బీన్స్‌లో గుండెకు మేలు చేసే ప్రయోజనాలు ఎన్నో ఉన్నాయి. వీటిలో ఉండే సాల్యూబుల్ ఫైబర్ కొలెస్ట్రాల్‌ను కరిగిపోయేలా చేస్తుంది. దీంతో ఆ కొలెస్ట్రాల్ రక్తనాళాల గోడలపై పేరుకునేలోపే వాటిని శరీరం బయటకు పంపిచేస్తుంది. అందుకే గుండె జబ్బులు, రక్తపోటు సమస్యలున్నవారు పీచు పదార్థాలుండే ఆహారం అధికంగా తీసుకోవాలి. సాల్యూబుల్ ఫైబర్ అధికంగా ఉండే బీన్స్ తీసుకుంటే రక్తంలో కొలెస్ట్రాల్ 15 శాతం తగ్గుతున్నట్టు ఎన్నో అధ్యయనాల్లో వెల్లడైంది. యాంటీ ఆక్సిడెంట్లు సమృద్ధిగా ఉన్న ఆహారాల్లో బీన్స్ కూడా ఒకటి. రోజులో ఒక కప్పు బీన్స్ తీసుకుంటే మంచి ఫలితాలు ఉంటాయి. బీన్స్‌లో 2 నుంచి 3 శాతం మాత్రమే కొవ్వు ఉంటుంది. కొలెస్ట్రాల్ ఉండదు. మాంసాహారం తీసుకోనివారు తినాల్సిన చక్కని ప్రత్యామ్నాయం ఇది. బ్లడ్ షుగర్ అదుపులో ఉంచేందుకు బీన్స్ ఉపయోగపడతాయి.

– విజేత దహగాం

## పండ్లు ఎప్పుడు తినాలి?

ఎప్పుడూ ఖాళీ కడుపుతో ఉన్నప్పుడే పండ్లు తినడం మంచిదని కొందరు వైద్య నిపుణుల సూచన. ఆహారంతో కడుపు నింపిన తర్వాతకంటే ఖాళీ కడుపుతో పండ్లు తినడంవల్లే ఎక్కువ ఫలితాలు పొందవచ్చు. శరీరంలోంచి మలినాలు తొలగించే కార్యక్రమంలో పండ్లు కీలకపాత్ర పోషిస్తాయి. ఉదాహరణకు ఏదైనా ఆహారం తీసుకుని, తర్వాత పండు తిన్నారనుకుందాం. తిన్నపండు నేరుగా కడుపులోకి అక్కడినుంచి పేగుల్లోకి వెళుతుంది. కానీ, పండు తినడానికి ముందు తీసుకున్న ఆహారం పండును పేగుల్లోకి వెళ్ళకుండా అడ్డుకుంటుంది. ఇక జీర్ణరసాల విడుదలతో ఆహారం, పండు అన్నీ కలసి యాసిడ్స్‌గా తర్వాత అది గ్యాస్‌గా మారుతుంది. పండ్లను ఖాళీ కడుపుతో ఉన్నప్పుడు తీసుకోవడంవల్ల కేశాల రంగు వెలిసిపోదు. జుట్టురాలడం తగ్గుతుంది. కళ్ళచుట్టూ నల్లటి చారికలు, ఒత్తిడి ఉండదని వైద్యులు అంటున్నారు.
















**నాలుగురోడ్ల కూడలివద్ద వచ్చి ఆగాను. ఎటువైపు వెళ్ళాలనే సందిగ్ధంలో పడ్డాను. అటూ ఇటూ చూశాను. రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. ఆటోకానీ రిక్షాకానీ కనబడలేదు. ఎందువల్లనో రైల్వేస్టేషన్ ఆవరణలో కూడా ఆటో కనబడలేదు. ఏం చేయాలని ఆలోచిస్తూ ఒక నిమిషం అలాగే నిలబడ్డాను. పంతులుగారి మేడవద్దకు వెళ్ళాలి.**

వాచీ చూశాను. సమయం తొమ్మిది గంటలు కావస్తోంది. సూర్యోదయమై రెండు మూడు గంటలు గడిచిపోయినా ఇంకా పొగమంచులో కూరుకుపోయి ఉంది ఊరు. పొగమంచునిచీల్చి సూర్యుడు బయటికి వచ్చేంతవరకు ఆగితే ఆలస్య మైపోతుంది. సాయంత్రం బండికే తిరిగి వెళ్ళిపోవాలి. ఆలోగా పంతులుగారి మేడ వద్దకు వెళ్ళాలి. నాగలక్ష్మీగారిని కలవాలి.

ఆమెను కలవటం కోసమే ఈ ఊరు వచ్చాను.

ఇరవై సంవత్సరాల క్రితం ఒకసారి ఈ ఊరు వచ్చాను. అప్పుడు ఈ రోడ్లు లేవు. ఈ కూడలి నుంచి కుడిచేతివైపు వెళ్ళే ఇరుకు రహదారి మీదుగా నడిచి పంతులుగారి మేడ చేరుకున్నట్లు గుర్తు.

ఆటో కోసం ఎదురు చూడకుండా కుడిచేతి వైపు తిరిగి అడుగులు వేశాను. నాలుగడుగులు వేయగానే తన ఇంటి ముందు చలిమంట కాస్తూ కూర్చుని ఒకతను కనిపించాడు.

"పంతులుగారి మేడకి దారి..." అడిగాను.

"ఎక్కడికి?" అతడు అడిగాడు.

"అదేనండీ. పంతులుగారి మేడకి" అతనికి అర్థం కాలేదనుకుని మళ్ళీ అన్నాను.

బిక్క ముఖం వేశాడు అతడు "అది ఈ ఊళ్ళోనే ఉందా?...వినలేదే"

"పోనీలెండి. ఆటో ఎక్కడ దొరుకుతుందో..."

"ఈరోజు ఆటో దొరకటమే! ఈ రోజు బంద్"

"చచ్చానురా దేవుడా" అని మనసులో అనుకున్నాను "బందా? బంద్ ఎందుకండీ?"

"ఎందుకని అడిగితే ఏం చెప్పను! బంద్‌కు ఏవైనా పెద్ద కారణాలు ఉండాలా చెప్పండి. మీకు ఈ ఊరు గురించి తెలియదేమో! మూడు బంద్‌లు ఆరు హరళ్ళుగా ఎదిగే ఊరండి. ఇది"

"అయినా"

"అయినా ఏముంది? రెండు భిన్న సామాజిక వర్గాలకు చెందిన ఇద్దరు మిత్రులు కలిశారు. తమాషాగా మాటలు మొదలుపెట్టారు. వాళ్ళకు తెలియకుండానే మాటల యుద్ధం మొదలైంది. అలా అలా..."

చల్లగా వీచింది గాలి. ఆ చలికి నా రక్తం గడ్డ కడుతున్నట్లు తోచింది. సగటుమనిషి జీవిత ప్రవాహాన్ని గడ్డ కట్టేలా చేసే బంద్‌ల చలి విరిగేది ఎప్పుడని ఆలోచిస్తూ చలిమంటకి దగ్గరగా జరిగి నిలబడ్డాను.

"పంతులుగారి మేడ అంటే ఏ ప్రాంతం?" ఒక

నిమిషం పోయాక అతడు అడిగాడు.

"రామయ్య పేట"

"ఓ, అగ్రహారమా" అతడు అన్నాడు. "దారి ఇదే. ఒక నాలుగు కిలోమీటర్లు వెళ్ళాలి"

నా గుండెల్లో రాయి పడింది. నాలుగు కిలోమీటర్లు నడవాలా?

ఇరవైయేళ్ళ క్రితం వచ్చినప్పుడు సులువుగా నడిచేశాను. అప్పుడు ఈ రోడ్డు లేదు. ఆటోలు లేవు. పైగా అప్పుడు నలభైయేళ్ళ వాణ్ణి. ఇప్పుడు పదవీవిరమణ చేసినవాణ్ణి. ఆరోగ్య సమస్యల గుప్పెట్లో రోజులు గడిపేవాణ్ణి.

నేను అలాగే నిలబడిపోయాను. అది గమనించిన అతడు మళ్ళీ అన్నాడు. "ఈ రోజు ఆటో గురించి ఆగితే సమయం వృథా చేయటమే".

కాసేపు అలాగే నిలబడ్డాను. ఆ తరువాత ముందుకు సాగాను. ఎలాగైనా నాగలక్ష్మిగారిని చూడాలి. అందుకోసమే కదా బయలుదేరి వచ్చాను.

రోడ్డుకు ఇరువైపులా చిన్న చిన్న మంటలు పెట్టుకుని మంటచుట్టూ నిలబడి ఆనందిస్తున్నారు జనం.

ఎంతైనా మంట పెట్టటంలోని ఆనందం జనానికి మంట ఆర్పటంలో లేదుగా! ఊరంతా మంటలోనే ఉన్నట్లు తోచింది నాకు.

నాగలక్ష్మిగారు నా బంధువుకాదు, మిత్రురాలు కూడా కాదు. మా కర్మాగారంలో పనిచేసిన ఒక పెద్దాఫీసర్ గారి భార్య. కర్మాగారమంటే అలాంటి లాంటి కర్మాగారం కాదు. రెండువేల మంది ఉద్యోగులు పనిచేసే ఒక ప్రభుత్వ రంగ సంస్థ అది. ఉత్తర భారత ప్రాంతంలో ఉన్న ఆ సంస్థలో కుల మతాలకు అతీతంగా అన్ని ప్రాంతాలవారు ఉద్యోగం చేసేవారు. వివిధ ప్రాంతీయ భాషలు మాట్లాడేవాళ్ళు, వివిధ ఆచార వ్యవహారాలు పాటించేవాళ్ళు నివసించే ఆ కర్మాగారం తాలూకు క్వార్టర్స్ భారతదేశానికి చిన్న ప్రతీకలా ఉండేది.

మంచి ఉద్యోగం దొరికిందని ఉన్న ఊరు ఉద్యోగం విడిచిపెట్టి ఆ కర్మాగారంలో చేరిన నాకు నెలరోజుల్లోనే పెద్ద సమస్య ఎదురైంది. తండ్రి గారికి ఆబ్దికం పెట్టవలసి వచ్చింది. అప్పటికి ఎక్కువమంది ఉద్యోగులతో పరిచయం కాలేదు. ఏం చేయాలో తోచక సతమతమవుతుంటే పక్క క్వార్టర్స్ లోని బీహారీవాడు అన్నాడు.

"ఎందుకు భయ్యా, ఆలోచించి బుర్ర పాడు చేసుకుంటావు? మీవాడున్నాడుగా, అదే నాగరాజు, ఆయన్ని కలుసుకో". కొన్ని సైగలు మరికొన్ని హిందీ మాటలు కలిపి అతడు చెప్పిన సారాంశం అది.

నాగరాజుగారి పేరు విని ఉన్నాను. కర్మాగారంలోని పెద్ద ఆఫీసర్లలో ఆయన ఒకరు.

ఆయన క్వార్టర్ కనుక్కోవటం పెద్ద కష్టం కాలేదు.

వెళ్ళినప్పుడు ఆయన ఇంట్లోనే ఉన్నారు. యజ్ఞోపవీతం తయారు చేస్తున్నాడు. నుదుటిమీద నామాలతో, తెల తెల్లటి పట్టుపంచెలో అతడు నాకు శ్రీహరిలాగే కనబడ్డాడు. ఊరు పేరు అడిగారు. ఏ విభాగంలో పని చేస్తున్నానో అడిగి తెలుసుకున్నారు. తను తయారుచేస్తున్న యజ్ఞోపవీతానికి ముడివేసి కుర్చీ మీదకివచ్చి కూర్చుని తన భార్యని కేకేశారు.

"ఏమోయ్, ఎవరు వచ్చారో చూడు"

"మడిలో ఉన్నానండి" లోపలినుంచి వినబడింది ఒక ఆడగొంతు. ఆమే నాగలక్ష్మిగారని తరువాత తెలుసుకున్నాను.

అగ్రహారంలోని ఒక పురోహితుడి ఇల్లులా కనబడింది ఆ ఇల్లు గదిలో ఒకవైపు దర్భ కట్టలు,

**ఎప్పుడో వంద సంవత్సరాల క్రితం పుట్టాల్సిన కుటుంబం. శుద్ధ ఛాందసవాదం. వాళ్ళింటికెళితే రెండు గ్లాసుల పద్ధతి అమలు చేసేవారు. మడీ తడీ పద్ధతులు చాలా ఎక్కువ. ఆ జీవన విధానానికి అలవాటు పడిపోయారు. ఆ కుటుంబాన్ని చూస్తే ఆశ్చర్యం కలిగేది అతనికి. చాలా సంవత్సరాలు గడచిపోయిన తర్వాత ఆ ఇంటావిడను చూడటానికి వెళ్ళాడతను. ఆమె ఎప్పటిలాగే ఉందా? లేక మార్పు వచ్చిందా?**

పాలికలు ఇతర పూజా సామాగ్రి ఉన్నాయి.

"కాఫీ తీసుకోండి" ఒక పదహారేళ్ళ అమ్మాయి కాఫీ గ్లాసుతో వచ్చింది.

"మా అమ్మాయండి" నాగరాజుగారు అన్నారు. "పదో తరగతి"

"మీరు" కాఫీ గ్లాసు అందుకుంటూ అడిగాను.

"మా ఇంట్లో ఎవరూ కాఫీ, టీ వగైరాలు ముట్టం. మేం పూర్తిగా సనాతనులం. అయినా మీలాంటి వాళ్ళు వస్తూ ఉంటారు కదండీ, వాళ్ళకోసం..."

అర్థమైంది.

అరగంట దాకా కూర్చున్నట్టు ఉన్నాను. బయలుదేరుతూ ఉంటే అతడు అన్నాడు . "మీరేం వర్రీ కాకండి" పదిగంటలకల్లా మీ క్వార్టర్లో ఉంటాను భోక్తలతో!"

ఆశ్చర్యంతో చిత్తైపోయాను నేను. ఆయన ఉద్యోగం ఏమిటీ, ఈ పనులు ఏమిటీ?

"అంతేనండి" తరువాత పరిచయమైన ఒక తెలుగు మిత్రుడు అన్నాడు. "క్వార్టర్లో ఎవరికి అవసరం వచ్చినా ఇలాంటివి ఆయనే చేస్తాడు. తు.చ. తప్పకుండా ఆచార సంప్రదాయాలు పాటించే వ్యక్తి. అసలు పెద్ద ఆఫీసర్ అని మనకు అనిపించదు. "రోడ్డువారగా ఉన్న టీ బడ్డీ నుంచి టీ అందుకుని అన్నాడు అతడు. "ఇదిగో మనం ఇక్కడ నిలబడి టీ తాగటం ఆయన చూస్తే మన పని అయిపోయినట్లే. క్లాస్ పీకడమే కాదు, మడీ దడీలేకుండా ఇలా తయారైతే ఎలా అని కోప్పడతాడు" అంటూ ఒక చుక్క టీ చప్పరించి కొనసాగించాడు "అన్నట్టు మీకు తెలియదేమో ఇలాంటి సేవలకోసమే ఆయన్ని అప్పటి ఎం.డి. గారు ఇక్కడికి తీసుకొచ్చారు. మనిషి శారీరక మానసిక అవసరాలతో పాటు మతపరమైన ఆధ్యాత్మికమైన అవసరాలు కూడా తీర్చటం తమ బాధ్యతగా భావించింది యాజమాన్యం. ఇతడు ఆ తరువాత చదివి పెద్ద ఆఫీసర్ అయిపోయాడనుకోండి. అయినా మంచివాడు."

కానీ మరో మిత్రుడికి నాగరాజుగారు అంటే ఒళ్ళు మంట. "ఉత్త ఛాందసుడు. అతని పెళ్ళాం కూడా అంతే. షూ వేసుకుని వెళ్ళినా, షూ విప్పి కాలు కడుక్కునే లోపలికి వెళ్ళాలి. క్వార్టర్స్ బయట కుళాయి పెట్టించాడండి దాని కోసం. ఇంకా ఆవి

## కవిత–కథ

అక్కడేదో శుభకార్యం
ముందుగా కవి వొచ్చాడు
వస్తూనే
కనురెప్పల, వేలి కొసల
కదలికతో నట్టువాంగం ఆరంభించాడు
దాంతో తోరణాలు రంగ వల్లులు వర్ణాల కేతనాలు
వివిధ భంగిమలుగా
నర్తనం మొదలెట్టాయి
కవి ఆగమనం
ఉత్త సన్నివేశాన్ని, ఉత్సవంగా మార్చింది



అంతా అతని కళ్లతో ఆ అందాల్ని చూసి
ఆస్వాదించ సాగారు
తర్వాతెప్పుడో
వంట సామాగ్రి దిగింది
గ్యాసు పొయ్యితోపాటు
సాపాటు సరంజామాతో
కథకుడూ వచ్చాడు
వంటలయ్యాక
జనానికి వడ్డించి ఆఖరిగా తనూ కూర్చున్నాడు
బంతిలో
....చివరగా
వచ్చిన వారందరికీ
వన్నెల విసనకర్రల్ని పంచారు
.... పంచింది కవి
భుక్తాయాసంతో ఉన్న జనానికి
విసనకర్రల గాలి హాయినిచ్చింది




—ఎస్.హనుమంతరావు
సెల్:88978 15656

## అజ్ఞాతంలో అవికాగోర్?

*'**చి**న్నారి పెళ్ళికూతురు' సీరియల్, 'ఉయ్యాల జంపాల' సినిమా గుర్తున్నవారికి అందులో నటించిన అవికా గుర్తుండే ఉంటుంది. అవికా గత కొంత కాలంగా వెండితెర మీద కనిపించడం లేదు. దానికి కారణాలు ఎవరికి తోచిన రీతిలో వారు చెప్పారు. అసలు కారణం అవికా తల్లిదండ్రులట! తల్లిదండ్రుల ప్రవర్తన నచ్చక అవిక ఎవరికీ కనిపించకుండా అజ్ఞాతంలోకి వెళ్ళిపోయిందట! అవికా డబ్బు తప్ప ఆమె గురించి వారికి పట్టదట! అంతేకాకుండా సీరియళ్ళ ,సినిమాల ద్వారా అవికా సంపాదించిన సొమ్మంతా ఇష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టేశారట కూడా! అప్పుడంటే అవిక మైనర్ కావడంతో వారిని ఎదిరించలేక పోయిందట! ఇప్పుడు మేజర్ కావడంతో వారి నుంచి దూరంగా వెళ్ళిందట! అవికా అంత లావు కావడానికి కూడా వారే కారణమట! లావుగా ఉంటే పెద్దదానిగా కనిపిస్తావని ఆమె తల్లిదండ్రులు అనేవారట! మొత్తానికి అవికా జాడ మాత్రం ఎవరూ కనిపెట్టలేకపోతున్నారట! అవిక అదృశ్యం వెనుక ఎవరైనా ఉన్నారా? అన్న అనుమానాన్ని కూడా కొందరు వ్యక్తం చేస్తున్నారు.*



డైతే ఆ మడీ తడీ చెప్పక్కర్లేదు. మన కులం కాని వాళ్ళు, మన మతం కానివాళ్ళు పంతులుగారింటికి వెళ్తే వాళ్ళ కోసం ప్రత్యేక గ్లాసులు ఉంచారావిడ, కాఫీ ఇవ్వటం కోసం. వాళ్ళు ఇంటి బయటకి వచ్చాక వాళ్ళు కూర్చున్న కుర్చీలమీద నేలమీద కూడా పసుపు నీళ్ళు జల్లుతారండీ ఆవిడ. మన జి.ఎం. గారు వెళ్ళినా అంతేనట.

"ఎక్కడ నుంచి పట్టుకొచ్చారండీ వీళ్ళను"

"మా జిల్లానే. ఊరు పేరు గుర్తు రావటంలేదు గానీ, పంతులుగారి మేడ అంటే జిల్లాలో అందరికీ తెలుసట. ఆ జిల్లాలో ఎక్కడికైనా వెళ్ళి పంతులుగారి మేడకి దారి ఎటు అని అడిగితే చిన్న పిల్లాడు కూడా దారి చూపిస్తాడట"

పంతులుగారి మేడ! మా జిల్లాలోనే ఉంది. ఛాందస బ్రాహ్మణ భావాలుగలవారి మేడ అది.

"వంద సంవత్సరాలక్రితం ఉండవలసిన వాళ్ళు వీళ్ళు"

అది నిజమేననిపించింది నాకు.

ఉదయకిరణాలు మెలమెల్లగా వెచ్చదనం పుంజుకున్నట్టు, మా మైత్రి కూడా పెరిగింది మెల్లమెల్లగా. నాగలక్ష్మిగారు తరచూ నోములూ వ్రతాలూ చేసేవారు. గ్రామ కుంకుమ పూజ పదహారు ఫలాల నోము ఇలా ఎన్నో నోములు నోచేవారు. మా ఆవిణ్ణి పేరంటానికి పిలిచేవారు. నేను కూడా మా ఆవిడతోపాటు కాలక్షేపంకోసం వాళ్ళ క్వార్టర్‌కి వెళ్ళేవాణ్ణి.

ఒకసారి నేను వెళ్ళినప్పుడు అక్కడ మా జి.ఎం. గారున్నారు.

"మళ్ళీ వస్తానండి" అని మమ్మల్నిచూసి ఆయన వెంటనే లేచి వెళ్ళిపోయాడు.

"సుందరీ" అంటూ కూతురిని పిలిచి "అతడు తాగిన కాఫీగ్లాసు తీసి బయటపెట్టు. మన గ్లాసులతో కలవనివ్వకు" అన్నారు.

షాక్ తిన్నాను నేను. ఇదేమిటి? ఎప్పుడో శతాబ్దాల క్రితం అలనాటి వాతావరణాన్ని బట్టి ఎవరో పాటించిన పద్ధతులు ఇప్పుడు పాటించడమేమిటి?

అప్పట్లో కొందరు కొన్ని కులాల వాళ్ళకి శుచి శుభ్రం తక్కువ అని బహుశా అలాంటి పద్ధతి పాటించి ఉండవచ్చు. అది కేవలం ఆరోగ్య పరిరక్షణ కోసం పాటించి ఉండవచ్చు. ఆచారాల సారాంశం గ్రహించకుండా అలాంటివాటిని ఈ రోజుల్లో పాటించడం, తమ ఆచారాలే గొప్పవని అనుకోవటం మూర్ఖత్వం కదా. అదేమాట అడిగాను ఆమెను. అలనాడు కొందరిని అంటరానివాళ్ళుగా ఉంచడానికి కారణం కులం కాదని 'పర్సనల్ హైజీన్' అని వాదించాను. కాని ఆచారాల పట్ల అతి మూర్ఖాభిమానంగల ఆమెకి నా మాటలు దున్నపోతుమీద పడిన వానే కదా!

అయినా నాగరాజుగారి ఇంటికి వెళ్ళేవాణ్ణి. అయిదారేళ్ళు గడిచాయి.

నెలరోజులు సెలవుపెట్టి ఊరు వెళ్ళి రాగానే వినబడింది ఆ మాట. నాగరాజుగారు క్వార్టర్‌లోనే ఉరి వేసుకొని ఆత్మహత్య చేసుకున్నారట! నమ్మలేక పోయాను. వెంటనే ఆ క్వార్టర్ దగ్గరకు పరుగెత్తాను. క్వార్టర్‌కి తాళం వేసి ఉంది. నాగలక్ష్మి గారు తన ఊరు వెళ్ళిపోయిందట! మరి వాళ్ళ అమ్మాయి! ఆ అమ్మాయే నాగరాజుగారి ఆత్మహత్యకి కారణమని తరువాత తెలిసింది. కాలేజీలో చదివే ఆ పిల్ల మా కంపెనీ క్వార్టర్లోనే ఉన్న ఒకణ్ణి ప్రేమించిందట. వాడితో పారిపోయిందట! వాడు నాగలక్ష్మిగారి దృష్టిలో అంటరానివాడు!

కాలమూ వయసూ ఎవరిగురించీ ఆగవుగా! కర్మాగారంలో యంత్రాల్లా నిర్విరామంగా తిరిగి పోయింది కాలం. పూర్తి సామర్థ్యంతో తిరగలేని యంత్రాలను 'స్క్రాప్' చేసినట్టు పదవీ విరమణ పేరుతో నన్ను కూడా 'స్క్రాప్' చేశారు.

మూటాముల్లె సర్దుకుని ఊరికి తిరుగుప్రయాణమయ్యాను. అప్పుడు కనబడ్డారు నాగలక్ష్మిగారు, ఒక రైల్వే ప్లాట్‌ఫాం మీద. నేనే ఆవిణ్ణి పలకరించాను.

పదవీ విరమణ చేశానని చెప్పగానే "అప్పుడే ముసలివారైపోయారా?" అని నవ్వుతూ అడిగారు ఆవిడ. శరీరం కొంత సడలిపోయినా ఆ కళ్ళల్లో వెలుగూ, ముఖంమీద మెరుపూ అస్సలు తగ్గలేదు.

"ఇప్పుడు మీరు ఎక్కడ ఉంటున్నారు?" అడిగాను.

"మా ఊరులోనే, మా ఇంట్లోనే.. పంతులుగారి మేడ మీకు తెలుసుగా. రండి ఒకసారి, ఇప్పుడు ఖాళీయేగా" అన్నారు. ట్రైన్ కదిలిపోయింది.

హఠాత్తుగా ఒక క్రికెట్‌బంతి వచ్చి తగిలింది నా నెత్తికి. తుళ్ళి పడ్డాను. రోడ్డుమీద క్రికెట్ ఆడుకుంటున్నారు పిల్లలు. అటూ ఇటూ చూశాను. అంతవరకు పొగమంచు గుప్పెట్లో ఇరుక్కుపోయిన ప్రపంచం తప్పించుకుని కళ్ళు తెరిచి చూస్తోంది. దారి బాగానే కనబడుతోంది.

రోడ్డువారగా కనబడింది ఒక మర్రిచెట్టు. గుర్తు వచ్చింది. ఆ మర్రిచెట్టు శాఖల కిందనే అగ్రహారం. ఇరవై యేళ్ళ క్రితం వచ్చినప్పుడు కనబడింది పంతులుగారి మేడ!

గేటుతీసి లోపలకి వెళ్ళాను. విశాలమైన ప్రాంగణం. గేటు నుంచి ఇంటికి వెళ్ళే కాలి నడకకి ఇరువైపులా పెద్ద పెద్ద పూలమొక్కలు వాటికి అవతల పెద్ద పెద్ద వృక్షాలు. ఇరవై యేళ్ళ క్రితం వచ్చినప్పుడు సూర్యకిరణాలు పడకుండా దిట్టంగా అడవిలా ఉండేవి చుట్టూ. కొన్ని వృక్షాలు ఇప్పుడు నేలమీదకి ఒరిగిపోయినట్లు తోచింది. సూర్యకిరణాలు పడుతున్నాయి అక్కడ. ఖాళీగా ఉన్నచోట్ల కొత్త

మొక్కలు లేస్తున్నాయి.

తలుపు తట్టాను. తలుపు సగంతెరచి ముఖం బయటపెట్టిన నాగలక్ష్మిగారి కళ్ళల్లో ఆశ్చర్యం! ఆనందం!

"మీరా! రండి. వచ్చి కూర్చోండి" ఆమె అంది.

"ఇదిగో వచ్చేస్తున్నాను. మడిలో ఉన్నాను." అంటూ లోపలికి వెళ్ళిపోయింది. తలుపు తోసుకుని లోపలకి వెళ్ళి కూర్చున్నాను. పాత మేడ. శతాబ్దాల క్రితం నిర్మించిన మేడ. గోడలకి వేసిన రంగు వెలిసిపోయినా, గోడమీద అక్కడక్కడ పగుళ్ళు కనబడినా, పెచ్చులు ఊడినా భవంతి గట్టిగానే ఉన్నట్టు తోచింది. లోపల నుంచి విష్ణు సహస్రనామ స్తోత్రం వినబడింది. ఎక్కడ నుంచో 'రాక్ బాండ్' పాటలు కూడా.

"ఎలా ఉన్నారండి అందరూ?" ఒక ట్రేలో నీళ్ళతో, కాఫీ కప్పుతో వచ్చిన నాగలక్ష్మి గారు అడిగారు. "ఈ బందు రోజు ఎలా వచ్చారండి?"

"మిమ్మల్ని కలవాలని చాలా రోజులనుంచి అనుకుంటున్నానండి" అన్నాను.

"నేనూ మా ఆవిడ మీ గురించే అనుకుంటూ ఉంటామండి."

"అది నా అదృష్టం." మాటలు ఎలా మొదలు పెట్టాలో తెలియక ఒక నిమిషం మౌనంగా ఉండిపోయాను. ఆ తరువాత కాఫీ గ్లాసు అందుకుని అడిగాను. "మీరెలా ఉన్నారు? ఇంత పెద్ద ఇంట్లో మీతో పాటు ఎవరుంటున్నారు?"

"ఎవరూ ఉండటం లేదు" అని ఒక నిమిషం ఆగాక ఆమే అన్నారు "మా అమ్మాయితో ఉంటున్నాను".

ఆశ్చర్యంతో నా పెదవి పెగలలేదు. నా ఆశ్చర్యం గమనించినందువల్ల కాబోలు ఆమె మళ్ళీ అంది. "ఇది మా పూర్వీకులు కట్టించిన భవంతి. ఈ భవంతిపై నాకు ఎంత హక్కుందో దానికీ దాని పిల్లలకు కూడా అంతే హక్కుంది." "మరి మీ అల్లుడు"

"చూశారా, మీరే అన్నారు, నా అల్లుడు అని. మీ మాటతో తెలిసిపోతుంది కదా అతనికీ ఈ ఇంటికీ ఉన్న సంబంధం"

ఏం చెప్పాలో తోచక అలాగే కూర్చున్నాను. గుప్పుమని మాంసంకూర వంట వాసన వచ్చింది. యాంత్రికంగా ముక్కు మూసుకున్నాను.

"మా అమ్మాయి ఈరోజు మాంసం వండుతోంది కాబోలు" యథాలాపంగా అంది ఆమె.

"మీరు ఈ కంపు ఎలా సర్దుకుంటున్నారండీ?"

"అయినవాళ్ళ కంపు ఎప్పుడూ ఇంపుగానే ఉంటుంది. ఇతర కులస్థులూ మతాల వాళ్ళూ కూడా మనవాళ్ళే అనుకున్నప్పుడు మనకు ఏ ఇబ్బందీ ఉండదు"

"మరి మీరు కూడా"

"తినను. నాకు కావలసిన పప్పూ కూర నేను వండుకుంటాను. దానికీ దాని కుటుంబానికీ కావలసింది అది వండుకుంటుంది. ఈ ఇంట్లో నాకెంత హక్కుందో దానికీ అంత హక్కుందిగా."

"మీరు చాలా మారిపోయారు."

"నిజమే. కొంత మార్పు వచ్చింది నా ఆలోచనలోనేగానీ ఆ మార్పు నాలో కాదు, ఇతరులపట్ల నా దృక్పథంలో వచ్చింది. ఇప్పుడు నా మనసు ఆలోచన సంకుచితం కాదు. ఒకప్పుడు నా చుట్టూ ఒక వలయం ఏర్పరచుకుని ఉండేదాన్ని. ఆ వలయానికి అవతల వైపు చూసేదాన్ని కాదు. ఇప్పుడు నేను మనిషిని గౌరవిస్తున్నాను. కులాన్ని, మతాన్ని కాదు. ఈ భవంతిలో నా బ్రతుకు నేను బ్రతుకుతున్నాను. నా వంట నేను చేసుకుంటున్నాను. నా పూజలూ భజనలూ మడీ తడీ అంతా పాటిస్తాను. మా అమ్మాయి విషయంలోగానీ తిండి విషయంలోగానీ వేలు పెట్టను. దానికి ఇష్టం వచ్చినట్టు ఎవరినీ నొప్పించకుండా బ్రతికే హక్కు దానికీ ఉందని గుర్తిస్తున్నాను. హాయిగా కలిసి బ్రతుకుతున్నాం" ఆవేశపడకుండా చెప్పింది ఆమె.

"అయినా మీరు ఒకటి ఆలోచించండి. పుట్టిన చంటిపిల్లకి తిండి విషయాల్లోగానీ, మత విషయాల్లోగానీ అవగాహన ఉంటుందా? తన తల్లి పెట్టిందే తింటుంది. వాటి పట్ల ఇష్టం పెంచుకుంటుంది. తల్లి గుడికి తీసుకెళితే గుడికి వెళ్తుంది. మసీదుకు తీసుకెళితే మసీదు, చర్చికి తీసుకెళితే చర్చికీ వెళ్తుంది, అదే అలవాటు అవుతుంది. ఈ వాస్తవం ఇప్పుడు తెలుసుకున్నాను నేను"

ఆశ్చర్యంతో నోటమాట రాలేదు నాకు. ఎంత ఎదిగిపోయారు ఆవిడ!

"మరి ఈ మడీ తడీ అంటారా? అలవాటైపోయింది అంతే. మనిషి అలవాట్లకు బానిస కదా! ఆ రోజుల్లో అంటరానితనం ఆచరించడానికి కారణం కులం కాదు పరిశుభ్రత అని కూడా ఇప్పుడు నాకు తెలుసు. అందుకే..."

"అమ్మమ్మా" అని అరుస్తూ అయిదారుగురు పిల్లలు పరిగెత్తుకొచ్చారు. "ఈ రోజు క్లాస్ చెప్తవా" అడిగారు వాళ్ళు.

"చూశారా, వీళ్ళు నా పిల్లలు. ఊళ్ళో పిల్లలు. వాళ్ళకు రోజూ పాఠాలు చెబుతాను. బడిలో చెప్పని పాఠాలు చెబుతాను. ఏ ఒక్క కులం గురించి కాని మతం గురించి కాని చెప్పను. అవన్నీ పుట్టినప్పుడు సంక్రమించలేదనీ మనం తీసుకున్నవేననీ నేర్పిస్తున్నాను. మనిషికి పుట్టుకతో వచ్చేది మానవత్వం ఒకటే. మనిషి పెంచి పోషించవలసింది కూడా ఆ మానవత్వాన్ని మాత్రమే!"

నేను బయలుదేరుతుంటే ఆమె అంది. "మీరు గమనించారో లేదో, ఈ ఇల్లు ఇప్పుడు పంతులు గారి మేడ కాదు. అలా చెబితే ఇప్పుడు ఎవరికీ తెలియదు. నేనే పేరు మార్చాను. ఇది ఇప్పుడు భారతసదన్ అందరి సదన్. పిల్లలకు నేను నేర్పేది కూడా అదే!"

**సెల్:99490 75859**

## కుక్కపిల్ల పేరులోనూ సెంటిమెంటే!

సెంటిమెంట్ పిచ్చి తారాస్థాయికి చేరుకుందనడానికి బాలీవుడ్ హీరోయిన్ శ్రద్ధాకపూర్ నిలువెత్తు నిదర్శనం. ఎలాగంటారా....? శ్రద్ధాకపూర్ ఇంట్లో కుటుంబ సభ్యులందరి పేర్లూ 'ఎస్' అనే అక్షరంతోనే మొదలవుతాయి. ఇటీవలే శ్రద్ధ ఓ కుక్కపిల్లను పెంచుకుంటోంది. దానికి నామకరణం చేయాలి కదా! అందుకే దాని పేరు కూడా మొదలు 'ఎస్' తో ప్రారంభం అయ్యేటట్లు పెట్టిందట! శ్రద్ధా చివరికి తన సెంటిమెంటును కుక్కపిల్లకు కూడా అంటకట్టిందని బాలీవుడ్ జనాలు అంటున్నారు.



# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

26

-కంఠంనేని స్వప్న



**చలికాలం...**

**విపరీతంగా మంచు కురుస్తోంది.**

**చెట్లు, రోడ్లు, బిల్డింగులు అన్నీ మంచుతో కప్పబడిపోయి తెల్లగా కనబడుతోంది ఊరు.**

**క్రిస్‌మస్ డెకరేషన్ల కోసం పెట్టిన స్టార్లు, లైట్లతో మెరిసిపోతోంది.**

**ఒక పక్కగా స్నో బ్లోయర్ రోడ్డు మీద పేరుకుపోయిన మంచుని క్లియర్ చేసుకుంటూ వెళ్తోంది. చిన్న ట్రక్‌లా ఉందది. దాన్ని నడుపుతున్నతను కార్‌లో వెళ్తున్న నైరా తండ్రికి చేయి వేవ్ చేశాడు.**

క్రిస్‌మస్ స్పిరిట్!

అందరూ క్రిస్‌మస్ రోజుల్లో చాలా సంతోషంగా, స్నేహపూర్వకంగా ఉంటారు. ఏదో తెలియని ఉత్సాహం కనబడుతుంది ప్రతివాళ్ళలో.

ఆలోచిస్తూ ఆఫీస్ ముందున్న పార్కింగ్ లాట్‌లో కార్ పార్క్ చేశాడు నైరా తండ్రి.

### జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్నపిల్లలను కాపాడతాడు. ఆఫీసుపని మీద యూఎస్ వెళ్ళిన కావ్యకు, నైరాకి సంబంధించిన ఆధారాలు దొరుకుతాయి. వాటిని శ్రీకాంత్‌కి పంపుతుంది. నైరా ఆస్తులకి బెనిఫీషియరీగా ఉన్న శ్రీనివాస్‌ని వెతుకుతూ వెళతాడు శ్రీకాంత్. అతడింట్లో శ్రీకాంత్‌కి నైరా తప్పిపోయిన రోజు వేసుకున్న స్లీప్‌వేర్ కనబడుతుంది. దాంతో అతన్ని ఇంటరాగేట్ చేస్తాడు. అసలేం జరిగిందో చెప్పటం ప్రారంభిస్తాడు శ్రీనివాస్.

ఆ తర్వాత...

దూరంగా శ్రీనివాస్ కొనుక్కున్న సెకండ్ హాండ్ కార్ కనబడుతోంది.

"ఒక్కడే ఉన్నట్లున్నాడు పాపం.. పనైపోతే తనతో ఇంటికొచ్చి వీకెండ్ అక్కడే ఉండమనాలి" అనుకుంటూ లోపలికి అడుగుపెట్టాడు.

మెట్లెక్కి శ్రీనివాస్ క్యూబ్ ఉండే ఫ్లోర్‌కి వెళ్ళాడు.

మెల్లగా నడుస్తూ వెళ్ళాడు.

దూరంగా శ్రీనివాస్ వెనక్కివాలి కూర్చుని, మరో

కుర్చీలో కాళ్ళు పెట్టుకుని కంప్యూటర్ వైపు చూడటం కనబడుతోంది. అతనిపక్కనే మెక్‌డొనాల్డ్స్ నుంచి తెచ్చుకున్న కవర్ ఉండ చుట్టుకుని కనబడుతోంది. రెండు ఖాళీ కాఫీగ్లాసులు, సగం ఖాళీ చేసిన కోక్ బాటిల్ కనబడుతున్నాయి.

ఏం చూస్తున్నాడబ్బా అంత దీక్షగా?

వెళ్ళి వెనక్కి నిలబడ్డాడు.

శ్రీనివాస్ అతన్నింకా గమనించలేదు.

ఒక నిమిషం కంప్యూటర్ వైపు చూసిన అతను ఉలికిపడ్డాడు.

"ఏం చేస్తున్నావు?" అరిచినట్లే అన్నాడు.

శ్రీనివాస్‌కి గుండాగిపోయినంత పనయింది.

వెనక్కి తిరిగి చూశాడు.

"ఎప్పుడొచ్చారు?" పాలిపోయిన మొహంతో అడిగాడు. అతని గొంతు వణుకుతోంది.

తను చేస్తున్న పని వల్ల ఎవరికీ నష్టం రాదని, తనకొచ్చే దాంట్లో సగం వాటా నైరా తండ్రికి ఇస్తానని ఒప్పించటానికి ప్రయత్నించాడు.

అతని మొహం ఎర్రగా మారింది.

"పిచ్చిపిచ్చి వేషాలు వేయకు. ఇది ఇండియా అనుకున్నావా? ఒక్క ఫోన్ చేశానంటే జీవితాంతం జైల్లో పడుంటావు".

దగ్గరుండి అన్ని ట్రాన్సాక్షన్లు రివర్స్ చేయించాడు.

మళ్ళీ శ్రీనివాస్ అకౌంట్ బాలన్స్ మొత్తం తరిగిపోయింది.

సెల్‌ఫోన్‌లకు ట్రాన్సాక్షన్ డీటెయిల్స్ పంపే కోడ్ ఏక్టివేట్ చేయించాడు.



సర్వర్ పాస్‌వర్డ్ మార్చి శ్రీనివాస్‌ని బయటకు పదమన్నాడు.

***

ఇంటికొచ్చి పడుకున్నాడన్న మాటే కానీ శ్రీనివాస్‌కి నిద్ర రావట్లేదు.

అతని నెక్స్ట్ స్టెప్ ఏమిటి?

తనని ఉద్యోగం నుంచి తీయిస్తాడా?

కొండనాలుకకి మందేస్తే ఉన్న నాలుక ఊడినట్లు ఏదో నాలుగు డబ్బులొస్తాయని ఆశపడ్డాడు కానీ మొదటికే మోసం రాదు కదా! ఉద్యోగం ఊడితే చిప్ప పట్టుకోవాలి. అందులోనూ ఇటువంటి నేరాలకి మళ్ళీ ఎప్పుడూ అమెరికాకి రాకుండా ఇమ్మిగ్రేషన్ వాళ్ళు తనను బాన్ చేసే అవకాశముంది.

ఏదైతే అదే అవుతుంది.

మర్నాడు పొద్దునే వెళ్ళి అతని కాళ్ళు పట్టుకోదల్చుకున్నాడు.

పొద్దున్నే తలుపుతట్టిన శ్రీనివాస్‌ని చూసి ఆశ్చర్యపోయింది నైరా తల్లి. నైరా హాల్‌లో ఆడుకుంటోంది.

మామూలుగానే ఆహ్వానించటం చూసి ఇంట్లో ఏమీ చెప్పలేదని అర్థమైంది శ్రీనివాస్‌కి.

కాసేపటికి నైరా తండ్రి వచ్చాడు.

శ్రీనివాస్‌ని మామూలుగానే పలకరించాడు.

తర్వాత ఒక్కణ్ణీ కూర్చోబెట్టుకుని బుద్ధులు చెప్పాడు.

"డబ్బు వ్యామోహం మంచిదికాదనీ, ఒకవేళ ఉన్నా కష్టపడి సంపాదించాలే కానీ అడ్డదారులు తొక్కకూడదనీ అన్నాడు. "ఒకేసారి అంత డబ్బు చూసి నీకు అటువంటి ఆలోచన వచ్చి ఉంటుంది. ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చేయకు. నీకు అన్నయ్య లాంటివాణ్ణి, నీ మంచి కోరి చెప్తున్నా."

"అసలు నేనీ సంగతి పైవాళ్ళకి రిపోర్ట్

**అక్షయ్ హాల్లో కూర్చుని టెన్షన్‌గా ఎదురు చూస్తున్నాడు. కాలింగ్‌బెల్ మోగింది. తలుపు తెరిచిన అక్షయ్‌కి ఎదురుగా నవ్వుతూ నిలబడిన నైరా కనిపించింది. అక్కీమామా అంటూ అతణ్ణి చుట్టేసింది. నోటమాట రాలేదు అక్షయ్‌కి. గట్టిగా గుండెలకు హత్తుకున్నాడు నైరాని. ముద్దులు కురిపించాడు. నైరా నిజంగానే వచ్చేసిందా? లేక ఇదంతా కలా?**

చేయాలి. కానీ తెలీక చేశావనే గుడ్డి నమ్మకంతో రిపోర్ట్ చేయలేదు. నన్ను నేను క్షమించుకోలేని పెద్ద తప్పు చేస్తున్నాను".

"ఇంకెప్పుడూ ఇలా జరగదన్నా!" నమ్మకంగా చెప్పాడు శ్రీనివాస్.

గండం గడిచింది.

ఊపిరి పీల్చుకుని ఇంటికొచ్చి పడ్డాడు.

కుత కుత ఉడికిపోతోందతనికి లోలోపల.

కడుపు నిండినవాడు ఎన్నయినా నీతులు చెప్తాడు.

నోటివరకూ వచ్చిన దాన్ని లాగేశాడు.

ఒకటా, రెండా? వంద కోట్లు... ఎన్ని జన్మలెత్తితే అంత సంపాదించగలను నేను?

ఇంతకింతా ప్రతీకారం తీర్చుకోవాలి.

ఇలా ఆలోచిస్తున్న రోజుల్లోనే ఒక రోజు అతనికి అవకాశం వచ్చింది.

***

వీకెండ్ కావటంతో నైరా వాళ్ళింట్లో ఉన్నాడు శ్రీనివాస్.

ల్యాప్‌టాప్ పెట్టుకుని ఏదో పని చేసుకుంటున్నాడు ఆమె తండ్రి.

నైరాతో ఆడుతూ టీవీ చూస్తున్నాడు శ్రీనివాస్.

అటూ ఇటూ పరిగెడుతూ, దూకుతూ ఆడుకుంటోంది నైరా.

కిచెన్ కౌంటర్ మీద నుంచి దూకబోతూ బొక్కబోర్లా పడింది.

రక్తం కారుతోందామెకి.

ఎక్కడి పనులు అక్కడే వదిలేసి ఇల్లు చూసుకోమని శ్రీనివాస్‌కి అప్పజెప్పి డాక్టర్ దగ్గరకు పరిగెత్తారు ఆమె తల్లిదండ్రులు.

అటూ ఇటూ చూస్తున్న శ్రీనివాస్‌కి లాక్ చేయని ల్యాప్‌టాప్ కనబడింది.

నైరా తండ్రికి సంబంధించిన ఆన్‌లైన్ అకౌంట్లు ఓపెన్‌గా కనబడుతున్నాయి.

కూతురికి దెబ్బ తగిలేసరికి అన్నీ వదిలేసి పరిగెత్తినట్లున్నారు.

ముందుగా ప్రొఫైల్‌లోకి వెళ్ళి ఫోన్ నంబర్ మార్చి తన నంబర్ పెట్టుకున్నాడు. ఏవైనా మెసేజెస్ వచ్చినా తనకే వస్తాయి.

తర్వాత తనని బెనిఫీషియరీగా ఆడ్ చేసుకున్నాడు. సైనవుట్ చేసి వాళ్ళకోసం వెయిట్ చేస్తూ

కూర్చున్నాడు.

రెండు గంటల తర్వాత నైరాని తీసుకుని ఆమె తల్లిదండ్రులు ఇంటికి చేరుకున్నారు. చిన్నదెబ్బే నన్నాడట డాక్టర్. భయం లేదన్నాడట. కొద్దిగా రిలాక్స్‌డ్‌గా ఉన్నారు.

ఇక వెళ్తానని బయల్దేరాడు శ్రీనివాస్.

***

తను చేయాలనుకున్నది త్వరగా చేయాలి.

లేదంటే ఈలోగా వాళ్ళు తను చేసిన పని తెలుసుకునే ప్రమాదం ఉంది. ఇదివరకొకసారి తనను క్షమించి వదిలేసినా ఈసారి వదిలిపెట్ట డతను.

మర్నాడు ఫోన్ చేసి తన బర్త్‌డే అని, డిన్నర్‌కి తప్పకుండా తనింటికి రమ్మని ఆహ్వానించాడు.

తిరిగి ఇంటికి వెళ్ళే దారిలో వాళ్ళకు యాక్సి డెంట్ జరిగేలా పథకం వేశాడు. అందుకోసం మెక్సికో నుంచి వచ్చిన ఇల్లీగల్ ఇమ్మిగ్రెంట్ ఒకతన్ని వాడుకున్నాడు.

డిన్నర్ ముగించి ఇంటికి వెళ్తున్న దారిలో మీదకు దూసుకొస్తున్న ట్రక్‌ని చూసి నైరా తండ్రి గభాల్న స్టీరింగ్ పక్కకు తిప్పాడు.

స్టీప్ కర్వ్ అది. రోడ్డు పక్కనే రాళ్ళతో కూడిన లోయలాంటి ప్రదేశం...దారంతా అలాగే ఉంటుంది.



## క్వీన్‌ని వదలనంటున్నాడు

*క్వీన్ అంటే రాణి కాదు... బాలీవుడ్ హీరోయిన్ కంగనా రనౌత్. ఇంతకీ అసలు విషయం ఏమి టంటే....కంగనాను ఒక నిర్మాత 'నిన్ను వదలనంటూ' బెదిరిస్తున్నాడు. ఇదంతా ఆమె మీద ప్రేమతో కాదట! కోపంతో! కంగనా క్రిష్ దర్శకత్వంలో 'మణికర్ణిక' అనే సినిమా చేస్తున్న సంగతి తెలిసిందే! ఈ సినిమాకన్నా ముందు క్వీన్ మరొక సినిమా చేస్తానని కమిట్ అయింది. ఆ నిర్మాత అంతా సిద్ధం చేసుకున్న తరువాత ఆ సినిమా దర్శకనిర్మాతలకు హ్యాండ్ ఇచ్చి క్రిష్ సినిమా వైపు మొగ్గు చూపింది. ఇప్పుడు అదే ఆమె మెడకు చుట్టుకుంది. తమకు సినిమా చేస్తానని చెప్పి కంగనా తమని మోసం చేసిందనీ, దీని మీద ఆమెకు న్యాయపరంగా నోటీసులు ఇస్తామని ఆ నిర్మాత ఆమెకు వార్నింగ్ ఇస్తున్నాడు.*

తొందరగా చేరుకోవచ్చని సాధారణంగా ఆ దారి వాడుతుంటారు.

కార్ కిందకి దొర్లింది. పల్టీలు కొట్టి లోయలోకి పడింది.

వాళ్ళిద్దరూ అక్కడికక్కడే చనిపో యారు.

అయితే ఇక్కడ శ్రీనివాస్ ఊహించ నిదొక్కటే!

నైరా రాకపోవటం!

ఆమెకి జ్వరంగా ఉండడంతో నానీని దగ్గరుంచి వచ్చారు వాళ్ళు.

తనను తాను ఎంత బెనిఫిషియ రీగా లిస్ట్ చేసుకున్నప్పటికీ రక్త సంబం ధీకులకు ఆస్తులు వెళ్ళి పోయే ఛాన్స్ ఉంది.

నైరాని ఏం చేయాలని ఆలోచిస్తుం డగా ఆమె ఇండియా వెళ్ళిపోయిందని తెలిసిందతనికి.

ఉద్యోగానికి రిజైన్ చేసి ఇండియా వచ్చేశాడు.

ప్రొఫెషనల్‌ని హైర్ చేసి నైరాని తీసుకొచ్చాడు.

***

ఈడ్చికొట్టాడు శ్రీకాంత్‌కి సహ యంగా వచ్చిన ఆ ప్రాంతపు ఎస్సై.

తలెగరేసి తీక్షణంగా చూస్తున్నాడు శ్రీనివాస్. అంతకుముందు వరకూ చూపించిన అతి వినయం మచ్చుకైనా కనిపించటం లేదు.

"నిన్ను నమ్మి దగ్గరకు తీసి, సహాయం చేసిన వాళ్ళను మోసం చేస్తావా?" అడిగాడు శ్రీకాంత్.

"నమ్మినవాళ్ళని చేసేదాన్నే కదమ్మా మోసం అనేది?" వెటకారంగా ఉంది శ్రీనివాస్ మాట.

"నైరాని ఏం చేశావు?" అడిగాడు శ్రీకాంత్.

గట్టిగా నవ్వాడు శ్రీనివాస్.

***

"దాని అదృష్టం బాగుందమ్మా!"

"కిడ్నాప్ చేసుకొచ్చిన వాడి దగ్గర నుంచి నన్ను చూడగానే 'అంకుల్' అంటూ వచ్చి వాటేసు కుంది. ఒకరోజు వరకూ చంపటానికి చేతులు రాలేదు".

"మర్నాటికి జయలక్ష్మి నా ఇంటికొచ్చింది".

"ఆమె నా మరదలు... కాబోయే భార్య. ఆమె అంటే నాకు చెప్పలేనంత ఇష్టం. ఏ పనైనా చేస్తాను కానీ ఆమె మాటకాదని అనలేను. ఆ బలహీనత వల్లే మీకు ఇప్పుడు దొరికి పోయాను".

"నైరాని ఏమీ చేయొద్దంది. మనకి డబ్బులు వద్దంది. ఆ పిల్లని చూసి ముచ్చటపడింది. పెంచు కుంటానంది. కాదనలేకపోయాను. ఇచ్చేశాను".

పళ్ళు రాలేలా, మొహం అదిరేలా కొట్టాడు శ్రీకాంత్.

"పెంచుకోవటానికి ఇవ్వటం ఏంట్రా? కుక్క పిల్లో, పిల్లిపిల్లో అనుకున్నావా?"

పెరట్లో మాటలు వినిపిస్తున్నాయి.

శ్రీకాంత్ నమ్మలేనట్లుగా చూస్తున్నాడు.

నైరా, ఒకమ్మాయి చేయి పట్టుకుని మాటలు చెప్తూ వస్తోంది.

ఆమెకి తను కిడ్నాప్ అయ్యాననీ, వాళ్ళ చెరలో ఉన్నాననీ తెలుస్తున్నట్లు లేదు. వాళ్ళకు అలవాటు పడిపోయినట్లుంది. దీన్నే స్టాక్ హోమ్ సిండ్రోమ్ అంటారు.

"పారిపో!" గట్టిగా అరుస్తున్నాడు శ్రీనివాస్.

జయలక్ష్మి నైరాని వదిలి అతని దగ్గరకు పరి

గెత్తుకొచ్చింది.

"మా బావని ఎందుకు కొడుతున్నారు?" కోపంగా అడుగుతోంది.

అసలామెకి పిచ్చో, వెర్రో, తాము చేసింది క్రైమ్ అని తెలుస్తుందో, లేదో వాళ్ళకు అర్థం కావటం లేదు.

నైరాని గట్టిగా పట్టుకున్నాడొక కానిస్టేబుల్.

***

నైరాని శ్రీకాంత్ అక్షయ్ ఇంటికి తీసుకురావటం, ఆమె బెల్ కొట్టటం ఎదురుగా నిలబడ్డ నైరాని చూసి అక్షయ్ ఆనందంతో నోట మాట లేకుండా నిలబడి పోవటం, "అక్కీ మామా!" అని అరిచి నైరా అతని మెడకి చుట్టుకుపోవటం... తర్వాత వర సగా రెండు మూడు రోజుల పాటు టీవీ ఛానల్స్‌లో చూపిస్తూనే ఉన్నారు.

నైరా దొరికిన సందర్భంగా ఫ్రెండ్స్ అందరినీ డిన్నర్‌కి పిలిచాడు అక్షయ్. ఆ రోజే కావ్య ఇండియా తిరిగొచ్చింది.

నైరా దొరకటం, అదీ తనిచ్చిన లీడ్ కారణంగా అవటం, అక్షయ్‌ని మళ్ళీ సంతోషంగా చూస్తానని పించటం, ఆమెకి చెప్పలేనంత సంతోషంగా ఉంది.

అందరూ రెస్టారెంట్‌కి చేరుకుంటున్నారు.

సీమ హడావుడే ఎక్కువగా ఉంది.

అందరినీ ఆమె రిసీవ్ చేసుకుంటోంది.

అందరి కళ్ళు ఆమె మీదే ఉన్నాయి. డార్క్ రెడ్ చుడీదార్‌లో మరింత తెల్లగా మెరిసి పోతోందామె.

కావ్య వస్తూనే సీమను చూసి మొహం చిట్లించింది.

"అబ్బా... మళ్ళీ మొదలు.." అనిపించిందామెకు.

వెళ్ళి నైరాని పలకరించింది.

"హాయ్" అంది నైరా.

టాబ్‌లో ఏదో ఆడుకుంటోందామె.

అక్కడికి కాస్త దూరంలోనే అక్షయ్ కనబడుతున్నాడు.

నైరా కిడ్నాప్ టెన్షన్ వల్ల సన్నబడ్డట్లున్నాడు. ఇంకా అందంగా అనిపిస్తున్నాడు. కావ్య వైపు చూసి చేయి ఊపాడు. రెండు కళ్ళు మూసి తెరిచి నవ్వాడు.

దగ్గరకొచ్చి "థాంక్యూ కావ్యా!" అన్నాడు.

ఆమెకి ఏమనాలో అర్థం కాలేదు.

డిన్నర్ పూర్తయింది. గడిచిన మూడు నెలల గురించే మాట్లాడుకున్నారంతా! నైరా సేఫ్‌గా తిరిగొచ్చినందుకు అందరికీ సంతోషంగా ఉంది.

రోహిణి అక్షయ్‌ని పక్కకు పిలవటం కనబడింది కావ్యకి.

ఎందుకు పక్కకు పిలిచి మాట్లాడుతోంది?

స్త్రీ సహజమైన కుతూహలం కొద్దీ, ఏదో పనున్నట్లుగా వెళ్ళి వినసాగింది కావ్య.

"అక్షయ్, కావ్య ఇచ్చిన లీడ్ వల్లే కదా ఇవాళ నైరాని క్షేమంగా చూడగలుగుతున్నాం" అడుగుతోంది రోహిణి.

"అబ్బా... రోహిణి ఎంతమంచిదో... బంగారు కొండ.." మెటికలు విరిచింది కావ్య.

"అఫ్‌కోర్స్" అన్నాడు అక్షయ్.

"తనకి నువ్వంటే చచ్చేంత ప్రేమ అని తెలుసా?" అడిగింది రోహిణి.

ఒక నిమిషం మాటలు వినబడ లేదు.

కావ్యకి అతనేం చెప్తాడోనని ఉత్కంఠగా ఉంది.

"తెలుసు" అన్నాడతను.

"నీకు డైరెక్ట్‌గా ఈ జన్మలో ఆ మాట చెప్పలేదు. అందుకే ఆమె తరపున నేను మాట్లాడు తున్నాను. కావ్య మీద నీ అభిప్రాయం ఏమిటి?" అడుగుతోంది రోహిణి.

టెన్షన్‌గా ఉంది కావ్యకు ఏం చెప్తాడోనని!

"కావ్య మంచి అమ్మాయి. నా అభిప్రాయం అదే రోహిణీ! తన లైఫ్ బాగుండాలని కోరుకునే వాళ్ళలో నేను మొదట ఉంటాను. అయితే నీ ప్రశ్న నాకర్థం కాలేదనుకోకు. నా సోల్‌మేట్ నాకెప్పుడో దొరికింది. మరే అమ్మాయీ నన్ను కదల్చలేదు. సారీ రోహిణీ, నా వైపు నుంచి నేను కావ్యకి అటువంటి అభిప్రాయం కలిగించి ఉంటే...!" అక్షయ్ చెప్పటం వినబడుతోంది.

కావ్య రెస్టారెంట్ బయటికి వచ్చేసింది.

హర్ష, సీమ పిలుస్తుంటే మర్యాదకైనా మాట్లాడాలనిపించలేదామెకి. చెప్పకుండా ఇంటిదారి పట్టింది.

అంతా శూన్యంగా అనిపిస్తోంది.

బాధ, కన్నీళ్ళు ఏమీ రావటం లేదు.

అంతా ఖాళీ ఖాళీగా అనిపిస్తోంది.

ఇక జన్మలో తను సంతోషంగా ఉండలేదు.

ఒకే ఒక్క వ్యక్తిని ఇష్టపడింది. అతనికి తనంటే ఇష్టం లేదు. వేరే ఎవరో సోల్‌మేట్ అట. ఇంకెవరు? సీమ... తనకి తెలీదా?

తను ఆమె అంత అందంగా ఉండి ఉంటే తనంటే ఇష్టం కలిగేది. అందులో ఆమె సాధించినది కానీ, తను సాధించలేకపోయింది కానీ ఏముంది? అదృష్టవశాత్తూ అలా పుట్టింది. అందులో ఆమె ఘనత ఏముంది?

ఆమె సాధించింది ఏముండటం ఏమిటి? తన పిచ్చికానీ.. అక్షయ్‌ని సాధించలేదూ ఆమె?

ఇంటికి వెళ్ళి మాట్లాడకుండా పడుకుంది.

అర్థరాత్రెప్పుడో మెలకువొచ్చింది ఆమెకు.

సీమ, అక్షయ్ సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ ఉండి ఉంటారు.

ఉక్రోషంగా అనిపించింది. పదే పదే అనిపిస్తోంది ఆమెకు ఇక జన్మలో తమ సంతోషంగా ఉండలేనని.



## దానికి టైం లేదట!

ఈ మాట అన్నది రత్తాలు...అదే నండి 'రాయ్ లక్ష్మీ'. రత్తాలు సాంగ్‌తో ఒక్కసారిగా ఫామ్‌లోకి వచ్చిన రాయ్ లక్ష్మీకి వరుస అవకాశాలు తలుపు తడుతున్నాయట! మూడు పదుల వయస్సులో కూడా సినిమా ఛాన్స్‌లు క్యూ కడుతుండటంతో పెళ్ళి మాటను ప్రస్తుతానికి వాయిదా వేసిందట రాయ్ లక్ష్మీ. పెళ్ళి చేసుకునేటంత సమయం తనదగ్గర లేదనీ, పదే పదే ఈ మాటను తన దగ్గర దయచేసి తీసుకురాకండి అంటూ ఇటీవల ఓ ఇంటర్వ్యూలో విజ్ఞప్తి చేసింది రాయ్ లక్ష్మీ.

అప్పుడు తట్టిందామెకి.

"సంతోషంగా ఉండాలని రూలేముంది?"

జంతువులు, పక్షులు అన్నీ సంతోషంగా ఉన్నాయా? పుట్టాయి కాబట్టి బ్రతుకుతున్నాయి. తనూ అంతే!

ఇంక ఆఫీస్‌కి మాత్రం తను వెళ్ళలేదు.

సీమ, అక్షయ్‌ల ఇకఇకలు, పకపకలు తను భరించలేదు.

రాజేష్ గాడిని తట్టుకునే ఓపికకూడా ఇక తనకు లేదు.

వెంటనే ఆఫీస్ కంప్యూటర్‌లో లాగిన్ అయి

రెజిగ్నేషన్ ఈ-మెయిల్ పంపింది.

***

ఆఫీస్‌లో శరవేగంగా మార్పులు చోటు చేసుకున్నాయి.

ఇంపార్టెంట్ మీటింగ్స్‌కి ప్రతిసారీ ఎగ్గొడుతున్నాడనీ, ఫిమేల్ ఎంప్లాయీస్ పట్ల అనుచితంగా ప్రవర్తిస్తున్నాడనీ, పర్‌ఫార్మెన్స్ సరిగ్గా లేదనీ రాజేష్‌ని కంపెనీ ఫైర్ చేసింది.

ఆర్గనైజేషన్ ఛేంజెస్ జరిగాక యు.ఎస్. మానేజర్లకి టీమ్‌మీద పట్టుదొరకగానే తీసుకున్న మొదటి నిర్ణయమది.

అక్షయ్‌కీ, బ్రహ్మీకీ ప్రమోషన్లు లభించాయి.

రాజేష్ స్థానంలో బ్రహ్మీనీ, ఆర్కిటెక్ట్‌గా అక్షయ్‌నీ ప్రమోట్ చేశారు.

***

కావ్య ఇంట్లో పొద్దుటి నుంచీ గొడవగా ఉంది.

ఆమెని చూడటానికి ఎవరో పెళ్ళివాళ్ళు వస్తారట. ఆన్‌లైన్ మాట్రిమోనియల్ ద్వారా వచ్చిన సంబంధమట.

"రానీ... వచ్చిన పెళ్ళివాళ్ళనే బెదరగొడదాం" నిర్ణయించుకుంది.

***

సాయంత్రం వాళ్ళొచ్చే టైమ్‌కి తలనిండా నూనె రాసుకుని కూర్చుంది.

వాళ్ళమ్మ సణుగుతూ జడ వేసి, బుట్టలు పెట్టింది చెవులకి.

నూనె రాసి లాగి వేసిన జడ, చామనచాయ మొహం మీద బంగారపు చెవిపోగులు ఇత్తడి వాటిలా మెరిసిపోతున్నాయి.

పసుపు రంగుకి, గులాబీ అంచున్న చీర కట్టుకుంది.

మొహానికి కొంచెం నూనె రాసుకుంది.

కాటుక రోజూ కంటే దట్టంగా పెట్టుకుంది.

తనను తను అద్దంలో చూసుకుంది.

అచ్చు పనమ్మాయిలాగా ఉంది. ఇందుకే అక్షయ్‌కి తను నచ్చలేదు.

నిట్టూర్చింది.

***




"నేను చస్తే ఇంట్లో ఉండను, ఆ టైమ్‌కి" తెగేసి చెప్పింది కావ్య.

"పిచ్చివేషాలు వేయకు. ఉద్యోగం కూడా లేదు. ఖాళీగా ఉండి ఏం చేస్తావు?"

"ఇంకోసారి లేదనకండి. వేరే ఉద్యోగం తెచ్చుకుంటాను. నేను మాత్రం పెళ్ళిచూపులు అవీ అంటే ఇంట్లో నుంచి వెళ్ళిపోతాను."

"వెళ్ళు" అనేసింది ఆమె తల్లి.

ఎక్కడికెళ్ళాలో అర్థం కాలేదు కావ్యకి. ఉద్యోగం కూడా లేదు హాస్టల్‌లో ఉండటానికి. రోహిణిని కలిస్తే అక్షయ్, సీమల గురించి వినాల్సి వస్తుంది.

ఎవరూ లేని చోటికి మాయమయిపోవాలనిపిస్తోంది ఆమెకి.

ఫోన్ ఆఫ్ చేసింది.

ఈ-మెయిల్ ఓపెన్ చేయటం లేదు. సీమ, అక్షయ్‌ల పెళ్ళి అని ఏ ఇన్విటేషనో, ఫోటోనో చూడాల్సి వస్తుందేమోనని భయం వేస్తోందామెకి.

హాల్లో కూర్చున్నారంతా.

కావ్య మొహం ముటముటలాడుతోంది.

తలెత్తి చూడటం లేదు.

ఆమె తరపున అన్ని జవాబులూ తల్లే చెప్పి కవర్ చేసుకొస్తోంది.

"ఇద్దరూ మాట్లాడుకోండి" సడన్‌గా అందరూ పక్క రూమ్‌లోకి వెళ్ళిపోయారు.

ఎవరినో తీసుకొచ్చి కూర్చోబెట్టి మాట్లాడుకోమంటారు. మళ్ళీ బోడి ప్రైవసీ. అంతా పక్క రూమ్‌లోకి వెళ్ళారు ఇప్పటికిప్పుడు తామేదో స్వీట్ నథింగ్స్ మాట్లాడుకోబోయినట్టు... ఛీ వెధవ బతుకు.

అతనేమీ మాట్లాడటం లేదు. సిగ్గేమో వెధవకి.

తనే మొదలెట్టింది కావ్య.

"చూడు... నాకు పెళ్ళి ఇష్టం లేదు. డబ్బుకో, దేనికో ఆశపడి చేసుకోవాలని అనుకుంటున్నావేమో! నీకు మా వాళ్ళ సంగతి తెలీదు. వాళ్ళ దగ్గర పైసా లేదు. నా ఉద్యోగం గురించి నీకేమైనా ఆశ చూపించారేమో తెలీదు. ఉద్యోగం మానేశాను. మళ్ళీ చేయదల్చుకోలేదు. నాకు పనులు రావు. వచ్చినా చేయను. చచ్చేంత కోపం. నన్ను చేసుకుంటే మట్టికొట్టుకు పోతావు".

"ఇంత చెప్పాక కూడా ఇంకెవరూ దొరక్క నన్ను చేసుకోటానికి ఒప్పుకున్నావంటే నిన్ను కత్తితో పొడిచేస్తాను. లేదా నేనే ఆత్మహత్య చేసుకుంటాను".

"గట్టిగా లాగి జడేసినట్టున్నారు. అసలే పెద్ద కళ్ళు.. బయటికి పొడుచుకొచ్చినట్టున్నాయి. ఆ చెవుల కున్న బుట్టలు ఊగుతూ, నువ్వు పిచ్చిపిచ్చిగా మాట్లాడుతుంటే చూడటానికి భలే తమాషాగా ఉన్నావు" అన్నాడతను.

ఎక్కడో విన్న గొంతు...

టక్కున తలెత్తి చూసింది కావ్య.

కాలుమీద కాలేసుకుని దర్జాగా కూర్చున్నాడు అక్షయ్. నవ్వుతున్నాడతను.

సంతోషం మొహమంతా పరుచుకుంది కావ్యకు.

"నీ ఉద్యోగం ఇంకా పోలేదు. రాజేష్‌ని తీసేశారు. బ్రహ్మీ అతని ప్లేస్‌లో వచ్చాడు. రెజిగ్నేషన్ ఆయన దగ్గరుంది. నీకోసం హోల్డ్ చేశాడు. ఆలోచించుకో... నన్ను చేసుకోదల్చుకోకపోతే ఉద్యోగంలో చేరు" చెప్తున్నాడు అక్షయ్.

పక్క రూమ్ తలుపు తెరుచుకుంది. ఒకొక్కళ్ళూ బయటికొస్తున్నారు.

"మరి నీ సోల్‌మేట్?" అడిగింది కావ్య.

"ఉత్తిదే. ఆరోజు రోహిణీ, నేనూ మాట్లాడుకోవటం నువ్వు వింటున్నావని తెలుసు. అందుకే సరదాగా... నవ్వుతున్నాడతను.

సీమ వచ్చి హగ్ చేసుకుని కావ్యతో అంది "కంగ్రాట్స్!" నైరా వచ్చి చేయి పట్టుకుని "అత్తా" అంది. కావ్య సంతోషంతో భోరుమంది.

సీమ హర్షతో అంది.

"ఆఖరికి వీళ్ళ కథ కూడా కంచికొచ్చింది. నీకు మెసేజెస్ పంపేది ఎవరో ఎప్పుడు కనుక్కుంటావు బాబూ!"

"నాకు రెండో మెసేజ్ వచ్చినప్పుడే ఆ మెసేజెస్ పంపేది నువ్వని తెలుసు సీమా! ఎన్నాళ్ళు కంటిన్యూ చేస్తావో చూద్దామని నేను కూడా తెలీనట్టు నటించాను" చెప్పాడు హర్ష.

"అందరూ చక్కగా జంటలు ఏర్పరచుకున్నారు. కానీ ఈ సందట్లోపడి ప్రాజెక్ట్‌లు లేట్ చేయరు కదా!" అనుమానంగా అన్నాడు బ్రహ్మీ.

'అబ్బా! మీకు ప్రమోషన్ వచ్చిందనే విషయం మర్చిపోతున్నారు. ఇంకా ప్రాజెక్ట్ మేనేజర్ బుద్ధులు చూపించటం ఆపండి సర్!" గుర్తు చేసింది రోహిణి.

"అన్నట్టు ఇప్పుడు మీరు రిసోర్స్ మేనేజర్ కదా! నాకు కూడా సరిపడే వాడిని ఒకడిని రిక్రూట్ చేసి నన్నూ ఒకింటిదాన్ని చేయండి".

"రిసోర్స్ మేనేజర్ అంటే ఒక జోక్ గుర్తొస్తోంది" మొదలెట్టింది రోహిణి.

"మళ్ళీ నా మీద మొదలెట్టావూ.." అంటూ బ్రహ్మీ గట్టిగా చెవులు మూసుకున్నాడు.

**(అయిపోయింది)** 

# సయాటికా నుంచి శాశ్వత విముక్తి పొందవచ్చు

నేటి జీవన విధానంలో ఆహారలోపాలు, అస్తవ్యస్థమైన దినచర్యలు, ఆందోళన, మానసిక ఒత్తిడి వంటి సమస్యలు అనేకఅనారోగ్యాలకు కారణం అవుతు న్నాయి. వీటిలో అతి ముఖ్యమైనది నడుం నొప్పి (సయాటికా).అయితే శారీరకంగా, మానసికంగా ఎన్నో ఇబ్బందులకు గురిచేసే ఈ సయాటికానొప్పి నుంచి విముక్తి కలగాలంటే హోమియోవైద్యమే సరైనదని అంటున్నారు ప్రముఖ హోమియోవైద్యులు డాక్టర్ మురళీ అంకిరెడ్డి.

నడుం వెనుకభాగం నుంచి, కాలు వెనుకభాగానికి, అక్కడి నుండి మడమ వరకు వచ్చే ఈనొప్పిని సయాటికా నొప్పి అంటారు. సాధారణంగా వెన్ను పూసలు,డిస్కులమధ్య నరంనలిగి పోవడం, నొక్కుకు పోవడంవల్ల ఈ నొప్పివస్తుంది. ఈ నొప్పినినిర్లక్ష్యం చేస్తే నొప్పితో పాటు నడకలో ఇబ్బంది, కాళ్లల్లో తిమ్మిర్లు రావచ్చు. ఎక్కువ శాతం ఈ నొప్పి ఏదో ఒక కాలుకే పరిమితమవుతుంది. కొన్నిసార్లు రెండు కాళ్ళలోనూ రావచ్చు. **కారణాలు:** 1.సయాటికానొప్పికి ముఖ్య కారణం నడుం భాగంలోని పూసలు, డిస్కుల మధ్య సయాటికా నరం ఒరుసుకుపోవడం, నలిగి పోవడం, చాలావరకు నడుంభాగంలో డిస్కుపక్కకు ఒరిగి పోవడం వల్ల ఈ సమస్య వస్తుంది. దీనిని డిస్క్ హెర్నియేషన్ అంటారు. సయాటికాకు 90 % ఈ డిస్క్ హెర్నియేషన్ కారణం. 2.వెన్నుపూసలు అరిగి పోవడం, పూసలు ఒకదానిపై ఒకటి ఎగబాకిన ప్పుడు, డిస్క్ పక్కకు ఒరిగినప్పుడు నడుంభాగంలో స్పైనల్‌కెనాల్ ద్వారం మూసుకుపోతుంది. దీనిని స్పైనల్‌కెనాల్ స్టీలోసిస్ అంటారు. ఈద్వారం మూసుకుపోవడం తోవెన్నుపాముపై ఒత్తిడిపెరిగి, వెన్నుపాము నుంచి వచ్చే నరాలపై తీవ్రమైనఒత్తిడి పెరుగుతుంది.తద్వారా ఈ సయాటికా నొప్పి వస్తుంది. 3. సయాటికా నరం 'పిరిఫారిమిస్' అనే కండరం (నడుం, పిరుదుల మధ్య ఉంటుంది) గుండా పోతుంది. కొన్నిసార్లు ఈ కండరం దెబ్బలవల్ల గానీ, ఇతర కారణాల వల్ల గానీ చిన్నదిగా అయినప్పుడు నరంపై ఒత్తిడి పెరిగి సయాటికా నొప్పి వస్తుంది. 4. సయాటికా నొప్పి గర్భవతుల్లో ఎక్కువగా వచ్చే అవకాశం ఉంటుంది. గర్భాశయం లోని శిశువు వల్ల వెన్నుపాముపై ఒత్తిడి పెరుగుతుంది. ఎక్కువగా కూర్చున్నప్పుడు కూడా వెన్నుపాము పై ఒత్తిడి పెరుగు తుంది. తద్వారా కాళ్లలో నొప్పిరావడం, తిమ్మిర్లు రావడం జరుగుతుంది. 5. కొన్నిసార్లు నడుంభాగం లోని పూసల మధ్య కణుతులు ఏర్పడటం వల్ల వెన్నుపాముపై, నరాలపై ఒత్తిడి పెరిగి సయాటికా నొప్పి వస్తుంది.**నిర్ధారణ:**1. సాధారణ రోగిచెప్పే నొప్పి లక్షణాల ను బట్టి సయాటికా నొప్పిని నిర్ధారించవచ్చు. రోగిని వెల్ల కిలా పడుకోబెట్టి కాలును లేపమన్నప్పుడు ఆ రోగి తనకాలును 45 డిగ్రీలకన్నా తక్కువ ఎత్తు లేపితే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుందని అర్థం చేసుకోవాలి. 2.ఎం.ఆర్.ఐ.లాంబార్ స్పైన్(ఎం.ఆర్.ఐ నడుంభాగంలోని వెన్నుపూస)చేసినట్లయితే డిస్కులు ఎలా ఉన్నాయి. నరాలపై ఒత్తిడి ఏ మేరకు ఉంది అనే విషయం తెలుస్తుంది. **నొప్పి లక్షణాలు:** 1. నొప్పి మొదట నడుం నుండి కాలు వెనుకభాగంలోకి వస్తుంది. తర్వాత కాలు వెనుక నుండి తొడల ద్వారా కాలు మడమల వరకు వస్తుంది. 2. కాళ్లల్లో మంటతో కూడిన నొప్పిరావచ్చు. 3. కూర్చున్నప్పుడు, ఎక్కువ సేపు నిల్చున్నప్పుడు నొప్పితీవ్రత పెరుగుతుంది. 4. కాళ్లలో నొప్పితో పాటు తిమ్మిర్లు వచ్చే అవకాశం ఉంటుంది. **జాగ్రత్తలు:**1. ఒకే భంగిమలో చాలాసేపు కూర్చోవద్దు. మంచి ఆధారం ఉన్న కుర్చీలోనే కూర్చోవాలి. 2. సామర్థ్యానికి మించి బరువులు మోయకూడదు. 3. ముందుకు వంగి ఎక్కువ సేపు పని చేయకూడదు. 4. ప్రయాణాలు తక్కువగా చేయాలి. గతుకుల రోడ్లపై ప్రయాణాలు చేయకూడదు. 5.వెనుక జేబులో బరువైన పర్సులు పెట్టుకోకూడదు. కింద కూర్చోవడం మానేయాలి. 6. ప్రతిరోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి. **హోమియోవైద్యం:** ఈ వైద్య విధానం లో రోగికి సంబంధించిన మానసిక లక్షణాలన నుసరించి జీనోమ్ థెరపీ ఇవ్వడం జరుగుతుంది. దీనిద్వారారోగికి సయాటికా నుంచి శాశ్వత పరిష్కారం లభిస్తుంది. సయాటికా నొప్పి నుంచి విముక్తి పొందటా నికి ఈ మందులు ఎంతగానో ఉపకరిస్తాయి. కుడి కాలు సయాటికా అయితే, మెగ్నీషియం పాస్, హైపరికమ్, లైకోపోడియం, వలేరియాన మందులు ఉపయోగించ వచ్చు. ఎడమకాలు సయాటికా అయితే, హైపరికమ్, కాలికార్బ్, కాస్టికమ్, రస్టాక్స్, లెకసిస్, సిమిసిఫ్యూగ మందులు ఉపయోగించవచ్చు.




**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



www.starhomeopathy.com తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ © 90300 64224


# సంతానలేమిని జయించవచ్చు

**ప్రస్తుత తరుణంలో యువత, యువ దంపతులు ఉద్యోగ రీత్యా ఎదుర్కొంటున్న మానసికఒత్తిళ్లవలన హార్మోన్లమార్పు లతో, సహజంగా కలగాల్సిన సంతాన ప్రక్రియ నేడు సంక్షోభంలో పడింది. దంపతుల్లో ఒకరికి లేదా ఇద్దరికి లోపం ఉన్నాసంతానలేమికి కారణం కావచ్చు, అయినా ఇప్పుడు సంతానలేమికి ఆందోళన చెందాల్సిన అవసరం లేదంటున్నారు ప్రముఖ ఫర్టిలిటీ స్పెషలిస్టు డాక్టర్ సి.జ్యోతి. ఆధునిక విధానాల వల్ల సంతానలేమికి దూరం కావచ్చని చెబుతున్నారు.**

సంతానలేమిసమస్యకు 30% స్త్రీలసమస్యలు ప్రధాన కారకాలుగా పరిశోధనలుతెలియజేస్తున్నాయి. సాధార ణంగా అండాశయంలో అండం ఏర్పడి అండవాహిక ద్వారా గర్భాశయంలో చేరి శుక్రకణంతో సంయోగం చెంది పిండంగా మారుతుంది. ఏదైనా శస్త్రచికిత్స ఫలితంగా... అంటే ఆపెండిక్స్‌ఆపరేషన్‌ఓవరిన్‌కు గాయ మైనా లేదా ఏదైనా వైరల్ బ్యాక్టీరియల్, లైంగిక సంబంధి తవ్యాధుల వలన అండవాహికలు దెబ్బతింటే పిల్లలు కలుగకపోవచ్చు. స్త్రీలలో సంతానోత్పత్తి పైన మన జీవన విధానం, వృత్తి, వయసు, ఆహారపు అలవాట్లు ప్రభావం ఉంటుంది. శాస్త్రీయ అధ్యయనాల ప్రకారం 35సంరాలు పైబడిన స్త్రీలలో సంతానోత్పత్తి అవకాశాలు తక్కువ. లెడ్ వంటి రసాయనాలు విడుదలయ్యే కార్మాగారాలలో పని చేసే వారిలో డీడీటీ వంటి క్రిమిసంహారకాలు వాడిన ఆహారాన్ని తీసుకోవడం వలన, ఎక్సరే, రేడియేషన్‌లకు గురయ్యే వారిలో అండాశయానికి సంబంధించిన వ్యాధులు కలుగుతాయి. ఫలితంగా సంతానం కలగదు.

**ప్రధాన కారణాలు:** మహిళలలో సంతానలేమికి అనేక కారణాలున్నాయి. వాటిలో ప్రధానమైనది, హార్మోనుల సమస్య. హార్మోనులు అండం అభివృద్ధి విడుదలను ప్రభావితం చేస్తాయి. శరీరంలోని చిన్న మెదడు మరియు కీలకమైన పిట్యుటరీ గ్రంథుల్లో లోపాల కారణంగా అండం అభివృద్ధికి, ఎదుగుదలకు అవసరమైన ఫాలిక్యులర్ స్టిమ్యులేటింగ్ హార్మోన్ (ఎఫ్.ఎస్.హెచ్.), ల్యూటినైజింగ్ హార్మోన్ (ఎల్.హెచ్.)ల ఉత్పత్తి తగ్గి సంతానో త్పత్తికి ఆటంకం కలుగుతుంది. అధిక మానసిక శ్రమ, తక్కువ శారీరక శ్రమ కలిగిన యుక్తవయసు, మధ్య వయసు మహిళల్లో పి.సి.ఓ.డి. (పాలిసిస్టిక్ ఓవరియన్ డిసీస్)వలన కూడా సంతానలేమి ఏర్పడవచ్చు. ఇందులో ఎఫ్.ఎస్.హెచ్. హార్మోన్ల ఉత్పత్తి తగ్గి,ఈస్ట్రోజన్, టెస్టోస్టిరాన్ హార్మోనుల విడుదల మోతా దు అధికమై అండోత్పత్తి జరగదు. అందుకే ఈ వ్యాధి ఉన్న మహిళలకు సంతానం కలుగదు. కొంతమంది మహిళలలో సాధారణ మెనోపాజ్ వయసు కన్నా ముందే రుతుచక్రం నిలిచిపోతుంది. దానిని ప్రీమెచ్యూర్ మెనోపాజ్ అంటారు. ఈ పరిస్థితి క్రీడాకారిణి లలో, జన్యుపరంగానూ కొద్దిమందిమహిళలో సంతానలేమికి కారణంఅవుతాయి. 30-40% ఎండో మెట్రియోసిస్‌తో నూ, ఫాలిప్స్ మరియు ఫైబ్రాయిడ్ యుట్రస్ లతో బాధ పడే మహిళల్లో సంతానోత్పత్తి జరగదు. థైరాయిడ్, ఫిట్స్, మధుమేహం వంటి వ్యాధులతో పాటు తక్కువ బరువు,అధికబరువు, మానసికఒత్తిడి, ఆందోళనలు సంతానలేమిలో ప్రధాన భూమికను పోషిస్తున్నాయి.

**నిర్ధారణ పరీక్షలు:** అల్ట్రాసోనోగ్రఫీ, లాప్రోస్కోపి, హిస్టిరో సాల్ఫింజుగ్రఫీ, హార్మోనుల నిర్ధారణ పరీక్షలు, ఇంకా ఎల్.హెచ్,ఎఫ్.ఎస్.హెచ్.,ప్రొజెస్టిరాన్.

**ఆధునికపరిష్కా రాలు:** అండాశయ సమస్యలు, వీర్యకణాల సమస్యలను తొలగించడానికి పలురకాల మందులు అందుబాటులో ఉన్నాయి. కాకపోతే ఒక దశవరకే ఈ మందులతో ఫలితం ఉంటుంది. ఒకవేళ సమస్య అప్పటికే తీవ్రమైతేఏమాత్రం ఉపయోగం ఉండదు. అయితే ఆధునిక విధానాలు కొన్ని అసాధ్యాల్ని సుసాధ్యం చేస్తున్నాయి. ఐ.వి.ఎఫ్, ఇంట్రాయుటరీన్ ఇన్‌సెమినేషన్ వంటి విధానా లతో సంతానం కలిగించే అవకాశాలు ఉన్నాయి. అలాగే టీసా టెక్నిక్ అండ్ ఇక్సీ విధానం ద్వారా సంతానం పొంద వచ్చు. ఆధునికవిధానాల్లో అండాలను లేదా శుక్ర కణాలను తీసి భవిష్యత్ అవసరాల కోసం ప్రయోగశాలలో అతి శీతలంగా (క్రైరో ప్రిజర్వేషన్) భద్ర పరిచి ఉంచడం సాధ్య మవుతుంది. ఈక్రమంలో ప్రయోగశాలలో ఫలదీకరణ చెందిన సూక్ష్మపిండాలను గర్భాశయం లో ప్రవేశపెడతారు. మిగిలిన అదనపు పిండా లను అతి శీతలం లో ఉంచి,వాటినే ఆ తర్వాత వాడతారు. అవసరాన్ని బట్టి అండాలనుగానీ, శుక్రకణాలను గానీ దాతల నుంచి స్వీకరించి వాడటం కూడా జరుగుతుంది. వీటితో పాటు పిండాన్ని మరో స్త్రీ గర్భాశయంలో పెంచే సరోగసీ విధానం కూడా అందుబాటులోకి వచ్చింది. అందుకే సంతానం కలగడం లేదని ఇప్పుడు బాధపడా ల్సిన అవసరమే లేదు. దీనికి సరైన మార్గం ఫర్టీ9హాస్పిటల్...మీశ్రేయస్సుకొరకు మీ అందుబాటు లోకి వచ్చింది.


**- డా॥ సి.జ్యోతి ఫర్టిలిటీ స్పెషలిస్ట్**
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**



ADVT



©90300 15588 సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । వరంగల్ www.ferty9.com




మే 31 నుంచి
జూన్ 6 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

విద్య, పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. 1, 2 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో పాల్గొంటారు. 3, 4, 5 తేదీల్లో సమావేశాలు వేడుకల్లో పాల్గొంటారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. భాగస్వామికి సంబంధించిన కీలక సమాచారం అందుకుంటారు. 6న పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాల్లో నిదానం అవసరం. విలువైన పత్రాలు అందుకుంటారు.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం నిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి ముందడుగు వేయాలి. ఖర్చులు అధికం. చిన్నారులు ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 3, 4, 5 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. విందు, వినోదాల కోసం ఖర్చు చేస్తారు. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం. 6న స్పెక్యులేషన్లలో నిదానం పాటించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, ప్రేమానుబంధాలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 1, 2 తేదీల్లో కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. బదిలీ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. 3, 4, 5 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాలపై శ్రద్ధ చూపిస్తారు. 6న ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, విద్యావిషయాలు, సమావేశాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ప్రయాణాలకు అనుకూలం. 3, 4, 5 తేదీల్లో వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. ఇంటికి అవసరమైన వస్తువులు కొనుగోలు చేస్తారు. బదిలీలకు అనుకూలం. మార్పులు, చేర్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 6న విద్యార్థులకు శుభప్రదం. చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, బదిలీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. వేడుకల్లో పాల్గొంటారు. 1, 2 తేదీల్లో పెట్టుబడుల్లో నష్టం సంభవం. ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 3, 4, 5 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. చర్చలు, ప్రయాణాలకు అనుకూలం. విద్యా సంస్థలతో పనులు పూర్తవుతాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 6న రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఇంటర్వ్యూలు, ఆర్థిక విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ప్రముఖులను కలుసుకుంటారు. వాయిదా పడుతున్న పనులు పూర్తి చేస్తారు. 1, 2 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. కొత్త పనుల ప్రారంభానికి తగిన సమయం కాదు. 3, 4, 5 తేదీల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. ఆర్థిక విషయాల్లో పెద్దలు తోడ్పడతారు. ఉద్యోగ, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 6న ఉద్యోగ వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. వాగ్వివాదాలకు దూరంగా ఉండాలి.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

విద్య, పెట్టుబడులు, ప్రయాణాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 1, 2 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 3, 4, 5 తేదీల్లో సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. సంకల్పం నెరవేరుతుంది. 6న ఆర్థిక వ్యవహారాల్లో ప్రోత్సాహకరం. విద్య, ప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

ఆర్థిక వ్యవహారాలు, వేడుకలు, క్రయవిక్రయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థికంగా ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. 3, 4, 5 తేదీల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. రాజకీయ, సినీరంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలు ఊరటనిస్తాయి. 6న సంస్మరణల్లో పాల్గొంటారు. రుణ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 1, 2 తేదీల్లో గౌరవ, మర్యాదలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 3, 4, 5 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్నేహానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 6న బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రత్యర్థులపై ఒక కన్నేసి ఉంచండి.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

ఇంటర్వ్యూలు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో సంకల్పసిద్ధి కోసం అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది. వృత్తిపరమైన ప్రయాణాలు ఫలిస్తాయి. 3, 4, 5 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 6న వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

చిన్నారులు, పొదుపు పథకాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువులు కోల్పోయే ప్రమాదం ఉంది. 3, 4, 5 తేదీల్లో సాంకేతిక విద్యకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. విద్యార్థులకు శుభప్రదం. 6న చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

ఇల్లు, విద్య, వేడుకలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం బదిలీలు, ఇల్లు మార్పునకు అనుకూలం. 1, 2 తేదీల్లో వేడుకల్లో శ్రమాధిక్యం, ఊహించని ఖర్చులు వచ్చే అవకాశం ఉంది. భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 3, 4, 5 తేదీల్లో వేడుకలు, ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో మీ వైఖరి సమీక్షించుకుంటారు. సంస్మరణల్లో పాల్గొంటారు. 6న సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లలో కొంత అసౌకర్యం కలుగుతుంది.

నవ్య



## సల్మాన్‌కి మాయరోగం!

ఇదేదో ఆయన్ని తిట్టినట్టు కాదు. నిజంగానే తను ఓ అనారోగ్య సమస్యతో బాధపడుతున్నట్టు సల్మాన్ స్వయంగా చెప్పాడు. అది నరాల అస్వస్థతకు సంబంధించిన సమస్య అనీ, ఏ మాత్రం తేడా చేసినా తలలో నరాలు ఉబ్బి తీవ్రమైన తలనొప్పి వస్తుందని తెలిపాడు. ఈ మాయదారి రోగంతో సినిమాలు చేయడం కష్టం అనిపించినా, అభిమానులు చూపించే అభిమానం ముందు ఈ సమస్య చిన్నగా అనిపించి మౌనంగానే ఆ బాధ అనుభవిస్తున్నానని అన్నాడు. ఈ నొప్పి నివారణకు ఆపరేషన్ ఒక్కటే మార్గమని అమెరికా డాక్టర్లు చెప్పారనీ, కాకపోతే ఎనిమిది నెలలు హాస్పిటల్‌లో ఉండాల్సి వస్తుందని అన్నారనీ, ప్రస్తుత పరిస్థితిలో అంత కాలం ఆసుపత్రిలో ఉండడం కుదరదు కనుక ఆపరేషన్ వాయిదా వేసుకున్నాననీ వివరించాడు.






## మాజీ భార్యకు ఖరీదైన గిఫ్ట్

భార్య సుజానె నుంచి విడిపోయినా కూడా హృతిక్ ఆమెను తరచూ ఏదో విధంగా కలుస్తూనే ఉన్నాడు. పిల్లల కోసం ఆమెతో కలిసి ఔటింగ్స్‌కి వెళ్ళడం, పార్టీలు చేసుకోవడం చేస్తూనే ఉన్నాడు. ఇవన్నీ చూసి హృతిక్ సుజానెకు మళ్ళీ దగ్గరవుతున్నాడని బాలీవుడ్ జనాలు అన్నా, ఆ మాటలను హృతిక్ కొట్టిపారేశాడు. పిల్లల కోసమే తనతో మాట్లాడుతున్నాను తప్ప తిరిగి కలిసే ఉద్దేశం లేదని చెప్పుకొచ్చాడు. అయితే ఇప్పుడు మాజీ భార్యకి 25 కోట్లతో ఖరీదైన అపార్ట్‌మెంట్ కొనిచ్చాడు. ఈ ఫ్లాట్ కూడా పిల్లల కోసమేనా? అని బాలీవుడ్ జనాలు ప్రశ్నిస్తున్నారు. ఈ ఫ్లాట్ కూడా హృతిక్ ఉంటున్న ఇంటికి అతి సమీపంలోనే ఉండడం అందరికీ ఆశ్చర్యం కలిగిస్తోంది. వీరిద్దరూ తిరిగి కలవబోతున్నారన్న రూమర్లకు సుజానె గట్టిగానే బదులిస్తోంది. తామిద్దరం తిరిగి కలవడం జీవితంలో జరగదని స్పష్టం చేసింది. మేం ఇప్పటికి మంచి స్నేహితులం మాత్రమే అంటోంది. అంటే స్నేహితురాలికి అంత ఖరీదైన గిఫ్టు ఎవరైనా ఇస్తారా? అన్న ప్రశ్నకు మాత్రం సుజానె జవాబు ఇవ్వడం లేదట!



## బాలీవుడ్‌లో నయా కాంబినేషన్!

ఈ కాంబినేషన్ ఎవరిదో కాదు. అమీర్‌ఖాన్, అమితాబ్ బచ్చన్‌ది! అమీర్ 'దంగల్' తరువాతి సినిమాను అమితాబ్‌తో చేయబోతున్నాడు. మొదటిసారి అమీర్ ఖాన్ బిగ్‌బీ కాంబినేషన్‌లో వస్తున్న ఈ సినిమాపై బాలీవుడ్‌లో ఇప్పటికే అంచనాలు పెరిగిపోయాయి. ఈ సినిమా షూటింగ్‌కి సంబంధించి అన్ని పనులూ పూర్తయ్యాయట! ఈ సినిమాను వచ్చే సంవత్సరం విడుదల చేయడానికి దర్శకనిర్మాతలు ప్లాన్ చేశారట! ఈ సినిమాలో కత్రినా, ఫాతిమా సనా షేక్ నటిస్తున్నారట! అమితాబ్‌తో చేయడం సంతోషాన్ని కలిగిస్తోందని, అదే సమయంలో కొద్దిగా కంగారుగా కూడా ఉందని అంటున్నాడు అమీర్‌ఖాన్. తన సినిమా 'దంగల్' చైనాలో సరికొత్త రికార్డులు సృష్టించడం ఆనందంగా ఉందని చెప్పుకొచ్చాడు.

## 'బాహుబలి 2'వి ఒక వసూళ్ళేనా?

1500 కోట్లు సాధించిన తొలి భారతీయ సినిమాగా 'బాహుబలి 2'ని అందరూ ఆకాశానికి ఎత్తేస్తుంటే ఒకే ఒక్క వ్యక్తి మాత్రం ఆ వసూళ్ళు ఒక వసూళ్ళేనా? అని ప్రశ్నిస్తున్నాడు. ఇంతకీ ఆ వ్యక్తి ఎవరంటే.... 2001లో 'గద్దర్ ఏక్ ప్రేమ్ కథా' అన్న సినిమాకు దర్శకత్వం వహించిన అనిల్ శర్మ. అప్పట్లో అంటే పదహారు సంవత్సరాల క్రితమే ఈ సినిమా 265 కోట్లు వసూలు చేసి రికార్డు సృష్టించింది. ఈ సినిమా సమయంలో థియేటర్లలో టిక్కెట్ ధర 25 రూపాయలు. ఇప్పుడు ఆ రేట్లు వందశాతం అంతకు మించి పెరిగాయి. 25 రూపాయల టిక్కెట్ ఉన్న సమయంలోనే తన సినిమా 265 కోట్లు సాధించిందనీ, ఇప్పుడు ఆ మొత్తం ఐదు వేల కోట్లతో సమానమన్నది ఆయన వాదన. ఇప్పుడు 'బాహుబలి 2' కూడా ఐదు వేల కోట్లు వసూలు చేస్తేనే తన సినిమా కన్నా గొప్ప సినిమా అవుతుందన్నది ఈయనగారి థియరీ! ఈ లెక్కన చూసుకుంటే వసూళ్ళల్లో రికార్డులు తిరగరాశామని చెప్పుకుంటున్న చాలా సినిమాల వసూళ్ళు అసలు సోదిలోకే రావేమో! ఏమైనా అనిల్ శర్మ లాజిక్‌తో చాలామంది ఏకీభవిస్తున్నారట!



## వాస్తు మీద పడ్డ ఫ్లాప్ డైరెక్టర్!



ఒకప్పుడు వరుస హిట్లతో జోష్ మీదుండే శీనువైట్ల మూడు ఫ్లాప్‌లతో డీలా పడిపోయాడు. చిన్న హీరో కూడా ఆయనతో సినిమా చేయడానికి సాహసించడం లేదట! స్టార్ డైరెక్టర్‌గా పేరు తెచ్చుకున్న శీనువైట్ల ప్రస్తుత పరిస్థితికి కారణం ఆయన కొత్త ఇల్లట! పాత ఇంటిలోంచి కొత్త ఇంటికి వచ్చిన తరువాతే ఫ్లాపులు వరుస కట్టాయట! ఈ విషయం శీనువైట్లకి ఎవరో చెప్పడంతో ఆఘమేఘాల మీద తన పాత ఇంట్లోకి షిఫ్టు అయిపోయాడట శీనువైట్ల. ప్రస్తుతం ఓ మంచి పవర్‌ఫుల్ కథతో హీరోలను కలవాలన్న పట్టుదలతో ఉన్నాడట ఆయన! ఓ కథ కూడా రెడీ చేసుకున్నాడట!



ఇంటర్వ్యూ

# నేను మంచి విలన్ని!

## -ఆశిష్ విద్యార్థి

**పెద్ద పెద్ద గూండాలే అతడిని చూసి భయపడుతుంటారు. తెర మీద అతని నటన పనిగట్టుకుని మరీ విలనిజం పండిస్తున్నట్టు ఉండదు. సహజంగా మన పక్కనే ఓ విలన్ ఉన్నాడన్న అభిప్రాయాన్ని కలిగిస్తుంది. ఆ విలన్ మన ఇంట్లోనో లేదా మనకు బాగా తెలిసిన వ్యక్తో అనిపిస్తాడు. ఇదంతా తెరమీద తప్ప నిజ జీవితంలో కాదు. ఆ వ్యక్తి మరెవరో కాదు. ఉత్తర, దక్షిణాది సినీ రంగాలలో విలనిజాన్ని పండించడంలో దిట్ట అనిపించుకున్న ఆశిష్ విద్యార్థి. తెరమీద విలన్‌గా కనిపిస్తూ చెడ్డవాడిగా అనిపించినా, నిజజీవితంలో తను చాలా మంచివాడినని అంటున్నాడు. తెర మీద విలనిజం అనే అందమైన ప్రయాణం సాగిస్తున్న ఆశిష్ విద్యార్థితో....**

**మిమ్మల్ని మంచి విలన్ అన్నప్పుడు ఎలా ఫీలవుతారు?**

ఆనందంగానే అనిపిస్తుంది. హీరో అయినా, విలన్ అయినా నటించాల్సిందే కదా! విలన్‌గా చేసినా నేను చేసినది నచ్చితేనే బాగా నటించాడు అంటారు. సో...నేను మంచి విలన్‌నే! కాకపోతే తెరమీద మాత్రమే విలన్‌ని. నిజజీవితంలో మంచి వ్యక్తిని. నన్ను విలన్‌గా నిలబెట్టింది నాలోని పవరే! అది అధికారానికో, డబ్బుకో సంబంధించిన పవర్ కాదు. ఖలేజాకు సంబంధించిన పవర్. నన్ను సవాల్ చేసే పాత్ర రావాలి. అందులో నెగ్గాలి అన్న పంతం కలిగింది. ఆ పంతమే నాకు పెద్ద పవర్. ఆ పవర్‌తోనే ఇక్కడ విలన్‌గా పేరు తెచ్చుకోగలిగాను. ఇంతమంది అభిమానులను సంపాదించుకున్నాను.

**నటన వారసత్వంగా అబ్బినట్టుంది?**

నిజమే. అమ్మ కథక్ డ్యాన్సర్, నాన్న థియేటర్ ఆర్టిస్ట్. దాంతో చిన్నతనం నుంచే నటన అంటే మక్కువ కలిగింది. నేను పుట్టిందీ, పెరిగిందీ, చదివింది అంతా ఢిల్లీలోనే. డిగ్రీ పూర్తి కాగానే ముంబయి చేరుకుని నటనలో శిక్షణ తీసుకున్నాను. బాలీవుడ్‌లో చాలా సినిమాలే చేశాను.

**ఉత్తరాది నుంచి దక్షిణాదికి ఎలా సాగింది మీ ప్రయాణం?**

బాలీవుడ్‌లో చాలా సినిమాలు చేశాను. అయినా ఏదో అసంతృప్తిగానే ఉండేది. నేను చేయదగ్గ పాత్రలు రావడం లేదనే బాధ ఉండేది. ఎందుకో అక్కడ ఊపిరి ఆడక ఉక్కిరి బిక్కిరి అయ్యేవాడిని. ఈ మాత్రం దానికా ఢిల్లీ వదిలి ముంబయి వచ్చింది అనే బాధ ప్రతి క్షణం వేధించేది. నా బాధనంతా బాలీవుడ్‌లో ఓ సీనియర్ నటుడికి చెప్పుకున్నాను. తొలుత నా మాటలను తేలిగ్గా తీసుకున్నా నా తపన గ్రహించి ఆయన నాకు చక్కటి సలహా ఇచ్చాడు. దక్షిణాదికి వెళ్ళు నీకు అక్కడ కావలసిన పాత్రలు దొరుకుతాయి. ఇంకా మంచి మంచి పాత్రలు చేయాలనే నీ ఆకలి తీరుతుంది అని సలహా ఇవ్వడంతో ముంబయి వదిలి దక్షిణాదికి వచ్చాను.

**దక్షిణాదిలో మీ సినీ ప్రయాణం గురించి?**

చెన్నైకి రాగానే మూడు ప్రొడక్షన్ హౌస్‌లను కలిశాను. తప్పకుండా అవకాశం ఇస్తామని ప్రామిస్ చేశారు. కానీ రెండు మూడు నెలలదాకా వారినుంచి ఎలాంటి పిలుపు రాలేదు. అలాంటి సమయంలో నాకు ఒక అవకాశం వచ్చింది. చిన్న బ్యానర్, పరిమిత బడ్జెట్‌తో సినిమా చేస్తున్నామన్నారు. నా స్థాయికి (అప్పటికే బాలీవుడ్‌లో నాకు మంచి పారితోషికం లభించేది) ఇవ్వలేకపోయినా, సినిమా పూర్తయి మంచి విజయం సాధిస్తే తప్పకుండా ఇస్తామని ప్రామిస్ చేశారు. అప్పుడు నేను డబ్బుల గురించి ఆలోచించలేదు. దక్షిణాది వారికి నేను పరిచయం కావడమే ముఖ్యం అనుకుని ఆ సినిమా చేశాను. ఆ సినిమా అనుకున్న దానికన్నా మంచి విజయం సాధించింది. తరువాత ఆ సినిమా దర్శకనిర్మాతలు నాకు ఇస్తామన్న దానికన్నా ఎక్కువే ఇచ్చారు. నా మొదటి సినిమానే మంచి విజయం సాధించడంతో విలన్‌గా నాకు మంచి పేరూ, గుర్తింపూ వచ్చాయి. ఇక ఆ తరువాత వెనుతిరిగి చూసుకోలేదు. అన్నీ ఒకదానితో మరొకటి పొంతనలేని పాత్రలే లభించాయి. ఓ సినిమాలో క్రూరమైన విలన్‌గా కనిపిస్తే, మరో సినిమాలో పోలీస్ విలన్‌గా, మరో సినిమాలో మంచి పోలీస్ అధికారిగా ఇలా రకరకాల పాత్రలు చేస్తూనే ఉన్నాను. నాకు

ఎలాంటి పాత్రలు కావాలనుకున్నానో సరిగ్గా అలాంటి పాత్రలే ఇక్కడ నన్ను పలకరించాయి.

**మీ కుటుంబం గురించి...**

నా భార్యా కొడుకూ ముంబాయిలో ఉంటారు. నా భార్య హౌస్ వైఫ్.

**ఫ్యామిలీని మిస్ అవుతున్నానన్న బాధ లేదా?**

ఎందుకు లేదు? తప్పకుండా ఉంటుంది. కాకపోతే నేను సంపాదించేది అంతా నా కుటుంబం కోసమే కదా! ఒక్కోసారి నా మీద నాకే కోపం వస్తూ ఉంటుంది. నాకే ఇలా ఉంటే, నా భార్యా పిల్లలకి ఇంక ఎలా ఉంటుందో ఊహించుకోగలను. అందుకే సందర్భం వచ్చినప్పుడల్లా నా భార్యకి నేను సారీ చెబుతూనే ఉంటా. బాలీవుడ్‌లో చాలామంది నన్ను ఎప్పుడూ ఒక ప్రశ్న అడుగుతుంటారు. ఇంటికి దూరంగా ఎక్కడో సినిమాలు చేయడం ఎందుకు? ఆ సినిమాలేవో ఇక్కడే చేసుకోవచ్చు కదా? అని. ఏ పని చేసినా మానసిక సంతృప్తి ముఖ్యం అని నమ్మే వ్యక్తిని నేను. ఆ సంతృప్తి, ఆత్మానందం నాకు ఉత్తరాది కన్నా దక్షిణాదిలోనే ఎక్కువ లభిస్తున్నాయి. ఎవరేమనుకున్నా నా కుటుంబం నన్ను అర్థం చేసుకుంది. అదిచాలు నాకు.

**ఉత్తరాదిలా ఇక్కడ కూడా సినిమాలు చేయలేను అన్న సందర్భం ఎదురైందా?**

ఒకటి రెండుసార్లు అలా అనిపించింది. చెప్పే కథ ఒకలా ఉండేది. షూటింగ్ మరోలా ఉండేది. దాంతో కొంత షూటింగ్ అయిన తరువాత ఒకటి రెండు సినిమాల నుంచి తప్పుకున్నాను. వాళ్ళు ఇచ్చింది తిరిగి ఇచ్చేశాను. ఎంత విలన్ వేషాలేసినా, నాకూ ఓ మనసుంటుంది. కదా? దాన్ని చంపుకుని ఏ పాత్ర పడితే అది చేయలేను.

**మీలో కామెడీ విలన్ ఉన్నాడంటారు. ఎంత వరకు నిజం?**

'గుడుంబా శంకర్', 'పోకిరి'లాంటి వాటితోపాటు మరికొన్ని సినిమాల్లో కామెడీ విలన్ పాత్రలు చేశాను. సీరియస్‌గా నేను చెప్పే డైలాగులకి థియేటర్‌లో ప్రేక్షకులు బాగా ఎంజాయ్ చేసేవారు. ఆ పాత్రలు చేసేటప్పుడు నేను కూడా ఎంజాయ్ చేసేవాడిని. అదంతా నా గొప్పతనం కాదు, దర్శకుల గొప్పతనం.

**మరి సీరియస్ పాత్రలు చేసే సమయంలో మీ మానసిక స్థితి ఎలా ఉంటుంది?**

ఓ సినిమా ఒప్పుకున్నప్పుడే అందులో నా పాత్రకు మానసికంగా సిద్ధమైపోతాను. అలాగే నటిస్తాను. కాకపోతే సీరియస్ క్యారెక్టర్లు చేసేటపుడు దాని ప్రభావం షూటింగ్ తరువాత కూడా కొన్ని రోజులు అలాగే ఉంటుంది. మరో సినిమా ఒప్పుకోగానే ఆ పాత్రలోకి పరకాయ ప్రవేశం చేస్తాను.

**ఇక్కడ భాష ఇబ్బంది పెట్టిన సందర్భం?**

మొదట్లో ఇబ్బంది పడిన మాట వాస్తవమే. ఇప్పుడు ఆ ఇబ్బంది లేదు. బాగా అర్థమవుతుంది. డబ్బింగ్ చెప్పుకునే స్థాయికి చేరుకున్నాను.

**ఇప్పటి వరకూ మీకు బాగా సంతృప్తి కలిగించిన సినిమా లేదా పాత్ర?**

తెలుగులో చేసిన 'మిణుగురులు' సినిమా. ఆ సినిమాలో నా నటనకు నంది అవార్డు కూడా వచ్చింది. కాకపోతే ఆ సినిమా ప్రేక్షకుల్లోకి అంతగా వెళ్ళలేదు. దాంతో ఆ సినిమా గురించి పెద్దగా ఎవరికీ తెలియదు. నేనుచేసిన అన్ని సినిమాలకన్నా భిన్నమైన సినిమా అది. పూర్తి సంతృప్తి కలిగించింది. ఆ సినిమా నాకు అవార్డు తెచ్చిపెట్టిందని ఈ మాట చెప్పడం లేదు. నిజంగానే మంచి సినిమా అది. అలాగే బెంగాలీలో చేసిన 'తీన్‌కహాన్' (Teenkahon ) సినిమా. ఆ సినిమాలో నా నటనకు మంచి రెస్పాన్స్ వచ్చింది. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా సినిమాలు నాకు పేరూ, గుర్తింపూ తెచ్చిపెట్టాయి.





## నాకేం తక్కువ?

*'గౌరీ...ఇది ఆట కాదు జీవితం....ఏదైనా సరే నాకు ఓడిపోవడం అంటే ఇష్టం ఉండదు. అలాంటిది నన్ను ఓడించాలని చూస్తావా? నాకేం తక్కువ? కొంచెం కలర్ తక్కువ. పవర్ ఉంటే అన్నీ కొట్టుకుపోతాయి. అది నాకు ఉంది కదా?' 'గుడుంబా శంకర్' సినిమాలో కుమారస్వామి నాయుడు అదే అశిష్ విద్యార్థి డైలాగ్ ఇది. అశిష్ ఈ డైలాగును ఎంత సీరియస్‌గా చెప్పినా థియేటర్‌లో నవ్వులు పూయించింది. ఇలాంటి డైలాగులు అశిష్ సినీ జీవితంలో ఎన్నో ఉన్నాయి. వాటిల్లో ఇది మచ్చుకు మాత్రమే!*

**ఇటీవలి కాలంలో సినిమాల్లో మీ విలనిజం తగ్గినట్టుంది?**

అదేం లేదు. ఈ పాత్ర అశిష్ మాత్రమే చేయగలడు అనుకున్న వారు నా దగ్గరకి వస్తున్నారు. వారి నమ్మకం వమ్ముకాకుండా చేస్తున్నాను. ఒకప్పుడు ప్రత్యేకించి విలన్లు ఉండేవారు. ఇప్పుడు కొందరు హీరోలు కూడా విలన్ క్యారెక్టర్లు చేస్తున్నారు. ఇక్కడ వారిపేర్లు అనవసరం. అంతే కాకుండా కొత్త కొత్త వారు చాలామంది వస్తున్నారు. పోటీ ఎక్కువ ఉన్నప్పుడు సహజంగానే అవకాశాలు తగ్గుతాయి. అంతే తప్ప నా డిమాండ్ నాకు ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది.

**తిరిగి బాలీవుడ్‌కి వెళ్ళే ఉద్దేశం ఉందా?**

దక్షిణాదిన ఎంత బిజీగా ఉన్నా అప్పుడప్పుడు బాలీవుడ్‌లోనూ సినిమాలు చేస్తున్నాను. పూర్తిగా అక్కడ సినిమాలు మానేసింది లేదు. ఇప్పుడు కూడా మంచి అవకాశం అనుకుంటే తప్పకుండా ఒప్పుకుంటున్నాను.

**క్యారెక్టర్ ఆర్టిస్ట్‌గా చేసే ఉద్దేశం ఉందా?**

నేను కేవలం విలన్‌గానే కాకుండా కొన్ని సినిమాల్లో తండ్రి, అన్న లాంటి పాత్రలు చేశాను. కాకపోతే విలన్‌గా ఎక్కువ సినిమాలు చేయడంతో నా మీద విలన్ ఆర్టిస్ట్ అన్న ముద్ర పడింది.

**మిమ్మల్ని హీరోగా పెట్టి సినిమా తీస్తానంటే....**

విని నవ్వుకోవడానికి బాగుంటుంది కానీ, వాస్తవంలో అంత బాగుండదు. ఓ ఇరవై సంవత్సరాల క్రితం అయితే ఓకే అనేసేవాడినే! ఇప్పుడు అలాంటి వేషాలు వేస్తే నవ్వుతారు. ప్రస్తుతానికి నన్ను విలన్‌గానే ఉండనివ్వండి.

—చిన్ని



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 35

**ఒకసారి మురికివాడ ప్రాంత పర్యటనకు వెళ్ళాను. సుమారు నాలుగువందలమంది చుట్టూ చేరారు. ఒకామె వచ్చి నాకు నలుగురు పిల్లలు ఎలా బతకాలి అంటూ నన్ను బాగా ఉతికేసింది. ఎలా ఎదుర్కోవాలా అని ఆలోచించి ఒకేఒక్క ప్రశ్న అడిగాను. సమాధానం చెప్పలేక ఆమె మెల్లిగా అక్కడి నుండి జారుకుంది. శాసనసభ్యునిగా ఉండగా ఇలాంటి అనుభవాలు కూడా నాకు ఎదురయ్యాయి.**

వారి కోవలోకి ఎస్వీ కృష్ణారెడ్డిగారు వస్తారు. ఎస్వీ కృష్ణారెడ్డిగారి గురించి ఎప్పుడో చెప్పాలి. కానీ నేను మర్చిపోయా. ఈ మధ్య కాస్త మతిమరుపు వస్తోంది లెండి. ఆయన కూడా చాలా సౌమ్యులు. రెడ్డిగారి మనసుకు తగ్గట్టే కథలుకూడా చాలా కొత్తగా ఉండేవి. వాటిలోనే మంచి మంచి వేషాలు ఇచ్చే వారు. అందులో ఒక సినిమా 'వినోదం'. ఒక సినిమాలో డబుల్ యాక్షన్ చేయడం మామూలే.

## నా భార్యా పిల్లలు గుర్తొచ్చేవారు

నా రాజకీయ ప్రస్థానం గురించి చెప్పాను కదా.. ఇక సినిమా విషయానికి వస్తే నా కెరీర్‌లో దర్శకుల్లో నేను గుర్తుంచుకోవాల్సిన వాళ్లలో కోదండరామిరెడ్డిగారు, ఎస్వీ కృష్ణారెడ్డిగారు కూడా ఉన్నారు. కోదండరామిరెడ్డిగారు చాలా సౌమ్యులు. నేను పరిశ్రమకు వచ్చిన కొత్తలో నన్ను చాలా బాగా ఎంకరేజ్ చేశారు. నేను చేస్తున్న పాత్రల్ని చూసి 'బాగా చేస్తున్నావయ్యా.. నీకు మంచి ఫ్యూచర్ ఉంది' అనేవారు. ఆయన అలా అంటుంటే నాకు కాస్త ఊపు వచ్చినట్టు అనిపించేది. వాళ్లబ్బాయి వైభవ్ తమిళంలోనూ మంచి పిక్చర్లలో నటించారు. అతని సినిమాల్లో నేను నటించా. వైభవ్ కనిపించినప్పుడల్లా 'అంకుల్.. మా నాన్నగారికి మీరంటే చాలా ఇష్టం. మీరు ఎక్కడ కనిపించినా చాలా మంచి నటుడు అని అంటారు' అని చెప్తుంటాడు. అప్పట్లో కోదండరామిరెడ్డిగారి తర్వాత రవిరాజా పినిశెట్టిగారు నన్ను చాలా ఎంకరేజ్ చేశారు. రెండు, మూడు సినిమాల్లో గుర్తుండి పోయే పాత్రలు ఇచ్చారు. కొత్తవాళ్లను ఎంకరేజ్ చేయడంలో ఆయన ఎప్పుడూ ముందుండేవారు.



అయితే ఒక మనిషి భ్రమపడి రెండు రకాలుగా చేయడం అనేది కొత్త థాట్. 'వినోదం'లో అలాంటి థాట్ అప్లయ్ చేశారు రెడ్డిగారు. ఆయనతో ఎన్ని సినిమాలు చేసినప్పటికీ 'వినోదం' నాకు చాలా ఇష్టమైన చిత్రం.

### నిందలు తప్పవు!

మన దగ్గర ఏ ఇద్దరు కలిసినా మాట్లాడు కునేది సినిమా గురించే. అంతటి ప్రధానమైన వినోద సాధనం సినిమా. అయితే ఇన్నికోట్ల మంది ప్రజలకు వినోదం పంచే సినిమా వాళ్ల గురించి చాలా మంది చెడుగా అనుకుంటుంటారు. ఏ రంగంలో అయినా బ్యాడ్ ఫెలోస్ కొంతమంది ఉంటారు. కానీ వాళ్ల పర్సంటేజ్ చాలా తక్కువన్న విషయం గుర్తించాలి. చేసే వృత్తి వల్లనో, ఇంటికి దూరంగా ఉండాల్సి రావడం వల్లనో, ఇంకోటో, మరోటో.. ఏదైనా కొన్ని అలవాట్లు సినిమా వారికి అలవడటం కాస్త సహజం. అలా నాకు కూడా ఒక అలవాటు వచ్చింది.

నేను బూమ్‌లో ఉండి రోజుకి నాలుగు షిఫ్టులు, మూడు షిఫ్టులు చేసేవాణ్ణి. ఇప్పుడున్న ఫెసిలిటీస్ అప్పట్లో ఏమీ ఉండేవి కావు. చెట్లకింద మేకప్ వేసుకునేవాళ్లం. ఇప్పటిలాగా కారవాన్‌లు లేవు. ఫారిన్ వెళ్లడాలు వంటివి లేవు. టీవీలు లేవు. ఇంటర్నెట్‌లు లేవు. ఛానళ్లు లేవు. ఇన్ని పత్రికలు లేవు. ఎక్కడపడితే అక్కడ సినిమా వాళ్లు ప్రేక్షకులకు కనిపించేవారు కాదు. లైవ్ టెలికాస్ట్

అనే పదానికే అర్థం తెలియదు. అంతెందుకు సెల్‌ఫోన్లు కూడా లేవు. చిరంజీవిగారు, బాలకృష్ణగారు, వెంకటేశ్‌గారు, నాగార్జునగారు, కృష్ణగారు, శోభన్‌బాబుగారి సినిమాలు ఔట్‌డోర్‌లో జరిగేవి కావు. వాళ్ల సినిమాలు ఔట్‌డోర్‌లో చేయడమంటే సాహసంతో కూడిన పనే. అందుకే ఎక్కువగా సెట్స్‌లోనే షూటింగ్స్ జరిగేవి. అయితే రేలంగి నరసింహారావుగారి సినిమాలు, జంధ్యాల గారి సినిమాలు, రాజేంద్రప్రసాద్, నరేశ్ సినిమాలను విశాఖపట్టణం, రాజమండ్రిలో తీసేవారు. భారీ బడ్జెట్ చిత్రాలతోపాటు ఈ సినిమాల్లోనూ నేను కేరక్టర్లు చేసేవాణ్ణి. ఔట్‌డోర్‌కి వెళ్తే ఒకరకంగా ఇంట్లో వాళ్లతో కనెక్షన్ కట్ అయినట్లే అనిపించేది. ఎందుకంటే అప్పట్లో టెలిఫోన్ ఫెసిలిటీ కూడా ఉండేది కాదు. నేను ఇండస్ట్రీకి వచ్చిన కొన్నేళ్లకు నో డిలే సర్వీస్ అని ఒకటి వచ్చింది. అంటే ముందు మనం నెంబర్ ఇస్తే వాళ్లు కనెక్ట్ చేసేవారు. ఆ తర్వాత ఎస్టీడీ వచ్చింది. ఈ సర్వీసుల ద్వారా ఫోన్ చేసినా, బిల్లు చూసుకుంటూ మాట్లాడుకునేవాళ్లం. అప్పట్లో వినోదానికి కూడా పెద్దగా ఏమీ ఉండేవి కావు. స్నేహితులు ఎవరైనా ఉంటారా అంటే ఉండరు. బజారులో తిరుగుదామా అంటే జనాలు మీదపడిపోయేవారు. అందువల్ల ఎక్కువగా రూము ల్లోనే ఉండాల్సి వచ్చేది. పైగా నడి వయస్కుణ్ణి. ఆ వయసులో జీవితంలో శారీరకమైన ఇబ్బందులు కొన్ని ఉంటాయి. సాయంత్రం అయ్యేసరికి పిల్లలు గుర్తొచ్చేవారు. భార్య గుర్తుకొచ్చేది. పిల్లలు ఏం చదువుతున్నారు? ఏంటి? ఎలా ఉన్నారు? వంటివి తెలిసేది కాదు. ఆ ఆలోచనలతో నిద్రపట్టేది కాదు. అలాంటి సమయంలో నాకు మద్యం అలవాటైంది. రెండు పెగ్గులు తాగితే నిద్రపడుతుందని ఒకాయన అన్నారు. దాంతో మొదలుపెట్టా. రోజూ షూటింగ్ నుంచి వచ్చాక రెండు పెగ్గులు తాగేవాణ్ణి. రెండు మెతుకులు తిని పడుకునేవాణ్ణి. రాను రాను జీవితం చాలా బిజీ అయిపోయింది. రోజుకు మూడు షిఫ్టులు కూడా చేసేవాణ్ణి. షూటింగ్ పూర్తి చేసుకుని రాత్రి రూమ్‌కి వెళ్లేపాటికి ఒకటిన్నర, రెండు అయ్యేది. రాత్రి ఎనిమిది గంటలకు బోయ్ రూమ్‌లో భోజనం క్యారేజీ పెట్టేవాడు. చల్లగా అయిపోయేది. రాత్రి రెండు గంటలకు రూమ్‌కు వెళ్లి స్నానం చేసి తిందామంటే నచ్చేదికాదు. అప్పుడు రెండు, మూడు పెగ్గులు తాగేవాణ్ణి. మిగిలిన కూరల జోలికి వెళ్లకుండా పెరుగన్నం మాత్రం తినేవాణ్ణి. అది కూడా పులిసిపోయి నురగలు కక్కుతూ ఉండేది. అయినా రెండు, మూడు ముద్దలు అలాగే తిని పడుకునేవాణ్ణి. కడుపులోకి వెళ్లింది పేగుల్లో ఒక రౌండ్ కూడా తిరిగేది కాదు. తెల్లారుజామునే బోయ్ వచ్చి రూమ్ బెల్ కొట్టి 'గుడ్ మార్నింగ్ సార్ అనేవాడు.

'ఆ గుడ్.. మార్నింగ్' అనగానే వాసనకొట్టేది. దానికి తోడు కళ్ళు ఉబ్బి కనిపించేవి. ఇలాగ ఉండేది పరిస్థితి. ఇంతుంటే అంత చెప్పుకునేవారు. 'కోటగాడు తెల్లార్లూ తాగుతాడ్రా నాయనా... వాసనేసేస్తోంది పొద్దున్నే' అనే మాట సర్వత్రా వినిపించేది. 'బాగా తాగుతాడు కోట శ్రీనివాసరావు' అనేది ఇండస్ట్రీలో అందరి నోటా వినిపించేది. ఇలాంటి గాసిప్పులు చెప్పుకునేవారు చాలా మంది ఉంటారులెండి. అలాంటి వాళ్ల నోళ్లలో పడ్డాను.



**పరభాషా నటులంటే కోట శ్రీనివాసరావుకి పడదనే నింద ఒకటి ఉంది. కానీ ఆయన ఉద్దేశం వేరు. ఇతర ప్రాంతాల నుంచి నటుల్ని తీసుకొచ్చి వందరోజులు, 120 రోజులు ఉపాధి కల్పిస్తారు. అదేదో మనవాళ్ళకే ఇస్తే బాగుంటుందికదా, చిన్నవాళ్ళు కూడా రెండుపూటలా భోజనం చేస్తారుకదా, టాలెంట్ ఉన్నవారి సంగతి సరే, సినిమాని నమ్ముకుని వచ్చినవారు కూడా బతకాలి కదా...? అని ప్రశ్నిస్తారు కోట.**

ఇక ప్రచారానికి కొదవేం ఉంది. ఆ నోటా ఈ నోటా చేరి కొంతమంది హీరోలవద్దకు కూడా విషయం వెళ్లింది. 'ఏమయ్యా కోటా.. ఏంటిది?' అని అడిగారు. నా సంగతంతా చెప్పా. 'ఏం చేద్దాం మండీ.. టీవీలు చూద్దామంటే అందులో ముప్పావు గంటే తెలుగు ప్రోగ్రామ్‌లు వస్తున్నాయి. అందులో అరగంట పందుల పెంపకం చూపిస్తున్నారు. పది నిమిషాలే వార్తలు వస్తున్నాయి' అని చెప్పా. 'అయితే నిగ్రహంగా ఉండేవారు లేరా?' అన్నారు. 'ఎందుకు ఉండరులెండి. ఉంటారు. మనిషి బలహీనుడు, అయినా నేను తీసుకునే రెండు, మూడు పెగ్గులవల్ల ఎవరికి ఏం ఇబ్బంది కలుగుతోంది' అని అడిగా. నా మాటల్లో నిజాయతీ నచ్చి వాళ్లు ఏమీ అనలేకపోయేవారు.

ఇది జరిగిన కొన్నాళ్లకి ఔట్‌డోర్‌లో ఉన్నాం. మా టీమ్‌కి నైట్ షూటింగ్ ఉంటే, పగలు మిగిలిన వాళ్లందరితో కూర్చుని రూమ్‌లో తాగేవాడిని. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ పగలు రిలాక్స్ అవుదామని కూర్చున్నామనుకోండి... హోటల్లో బాయ్స్ చూసేవారు. ఎవరైనా వచ్చి 'ఏం చేస్తున్నాడయ్యా కోట' అని అడిగితే, 'లోపల మందు కొడుతున్నారయ్యా' అని చెప్పేవారు. ఇదొక స్పెషల్ టాక్ అయింది. కొందరు ముఖంమీదే మందలిస్తే, మరికొందరు కామెడీ కూడా చేసేవారు. అయితే నేను వాటిని పట్టించుకునేవాణ్ణి కాదు. ఒకవేళ వాళ్లు అనుకున్నట్టు నేను గనుక విపరీతంగా ప్రవర్తించి ఉంటే నా పరిస్థితి ఇలా ఎందుకు ఉండేది? 73 ఏళ్ల వయసులో నేను ఎలా నటించగలిగేవాణ్ణి? పరిశ్రమ నన్ను ఎందుకు భరించేది? మరోవైపు కుటుంబపరంగా నేను తిన్న దెబ్బలు మీకు తెలుసు. ఇంట్లో ఇబ్బందులు, పాప యాక్సిడెంట్, రీసెంట్‌గా చెట్టంత కొడుకును పోగొట్టుకోవడం....చెప్పుడు మాటలు విన్నవాళ్లు ఏదో అనుకోవడం తప్పు అని నేను అనను. కాకపోతే ఇన్నాళ్లూ నా మీద ఉన్న మంచి చెప్పాను కదా, నామీద ఉన్న చెడును కూడా మీతో పంచుకోవాలనిపించి పంచుకుంటున్నాను.

### నాలుగువేళ్లూ నోట్లోకి వెళ్లాలి!

పరభాషా నటులంటే కోట శ్రీనివాసరావుగారికి పడదు అని ఓ నింద ఉంది. నాకు నటులమీద కోపం కాదండి. ఎవరినైనా నటులను పట్టుకురండి. నసీరుద్దీన్‌షా, నానా పటేకర్, అమితాబ్‌గారిని తీసుకురండి. వాళ్లదగ్గర నేను నౌకరు వేషం వేయడానికి కూడా సిద్ధమే. కానీ ముంబై నుంచి, కలకత్తానుంచి, ఢిల్లీ నుంచి చాలా మందిని తీసుకొస్తారు. అయితే వాళ్లు ఎలా చేస్తారు? వాళ్లకి ఎంత వరకు క్వాలిఫికేషన్ ఉందో మన ప్రజలకు తెలుసు.. అందరికీ తెలుసు. అలాంటప్పుడు వాళ్లను తీసుకువచ్చి ఎందుకు మనం డబ్బులివ్వాలి?

మామూలుగా తెలుగువారికి ఇచ్చేదానికన్నా మూడురెట్లు వాళ్లకు ఎక్కువిస్తారు. పెద్ద హోటల్స్‌లో బస ఏర్పాటు చేస్తారు. ఇప్పుడు నన్ను ఎవరైనా బుక్ చేసుకున్నారనుకోండి, నా టిఫిన్, భోజనం నేను తీసుకెళ్తా. అది మొదటినుంచీ అలవాటు. చక్కగా చేసి పెడతాం. క్రమశిక్షణ ఉన్నవాళ్లం.

ఒక ఎగ్జాంపుల్ చెప్తానండీ... ఒక అరవ డైరెక్టర్‌ని పట్టుకొచ్చారనుకోండి.. ఎందుకు తీసుకొస్తారు? ఆయన దగ్గరున్న విజ్ఞానం చూసి తీసుకొస్తారు. అలాంటప్పుడు ఆయన ఒక్కడినే తీసుకురమ్మనండి. పోనీ భాష రాకపోతే ఇంకో అసిస్టెంట్‌ను తీసుకురమ్మనమని చెప్పండి. అలా కాకుండా ఆయన టీమ్ మొత్తం ఇక్కడికివస్తే మన దగ్గర పదిమందికి తిండి పోవడం లేదా? మరి మనవాళ్లు ఇంకెవరిని నమ్ముకుని ఇక్కడ బతకాలి? పొరుగూరునుంచి కెమెరామేన్ వచ్చాడనుకోండి.. ఆయన అసిస్టెంట్లు, ఆయన లైట్ మెన్లు, అందరూ ఓ 15 – 20 మంది దిగుతారు. మనవాళ్లు 30 – 40 కోట్లుపెట్టి సినిమా తీస్తుంటారు. అవేమో 100 రోజులు, 120 రోజులు షూటింగ్‌లు జరుగుతుంటాయి. మరి వీళ్లందరికీ అన్నిరోజులు మనం పని కల్పించినట్టేగా! అందరికీ అన్ని రోజులు భోజనం పెడుతున్నామంటే తెలుగువారు ఎంతమంది అన్ని రోజులు భోజనం లేకుండా ఉంటున్నారనీ? ఇప్పుడు మనం తమిళ సినిమా చేయడానికి వెళ్తే అంత మందితో కలిసి వెళ్లం కదా.. వాళ్లు చెప్పినట్లు మనం చేస్తున్నాం కదా. ఏం మనవాళ్లు చేతగానివాళ్లా.. 24 క్రాఫ్టులు యూనియన్‌లు అని పెట్టారు.. అవన్నీ ఎందుకు ఉన్నట్టు? ఊరికే డబ్బులు వసూలు చేయడం.. ఎవరైనా డబ్బులు ఎగ్గొడితే డబ్బులు ఇప్పిస్తామని చెప్పడానికా.. నిజంగా డబ్బులు ఇప్పించినా ఊరికే ఎవరూ ఇప్పించరే.. వాళ్లకూ పది పర్సెంట్ వస్తుంది. బిల్డింగ్‌లు కట్టడం, కూర్చోవడం వంటివి కాదు కదా చేయాల్సింది.. యూనియన్లు పెట్టి సభ్యులకు వృత్తిపరంగా ఎలాంటి సహాయం చేస్తున్నారు? అనేది కదా ముఖ్యం. కనీసం నెలకు సగం రోజులు పని ఇప్పించండి.. ఇప్పుడు రోజుకు 1500 రూపాయలు తీసుకునేవాడుంటే, సగం రోజులు పనిదొరికినా వాడి సంసారానికి పనికొస్తుంది కదా. నాలుగుగోడల మధ్య వాడి సంసారం పెట్టుకుని గుట్టుగా కాపురం చేసుకుంటాడు. కాస్త నీట్‌గా ఉంటారు. అలా కాకుండాపోవడంతో కృష్ణానగర్‌లో పడి ఎంతమంది పాడై పోతున్నారు. ఇల్లు గడవాలి, ఇంట్లో అడుగుపెడితే నానారకాల ఖర్చులు, అవసరాలు, ఇలాంటి పరిస్థితుల్లోనే కదా మనిషి బలహీనతలకు లొంగేది.

అందుకని ఉభయ తెలుగురాష్ట్రాల ముఖ్యమంత్రులకు నా మనవి ఏంటంటే, మనం తెలుగువాళ్లం. ఎన్ని రాష్ట్రాల్లో ఉన్నా, తెలుగు మన మాతృభాష. మన అమ్మభాషమీద మనకు అభిమానం ఉండాలి. ఇప్పుడు 20–30 కోట్లు పెట్టి సినిమాలు తీస్తున్నారు. వాళ్లని ఆగమన్నా ఆగరు. కనీసం 7–8 కోట్లలో సినిమాలు తీసేవారున్నారు. ఈ బడ్జెట్‌తో సినిమాలు చేసేవారిని బీ క్లాస్ అనుకోండి. సెకండరీ గ్రేడ్ అనుకోండి. ఆ సినిమాలకు పన్నురాయితీగానీ, నంది అవార్డులకు ఎలిజిబిలిటీ, గవర్నమెంట్ తరపున ఉన్నవన్నీ ఫ్రీగా ఇవ్వాలి. పొరుగున తమిళం పేరు పెట్టుకుంటే వాళ్లకు ట్యాక్స్ లేదు. ఆ మాత్రం మనం చేయలేమా? అలా చేస్తే చిన్న సినిమాలు బావుంటాయి. చిన్నవాళ్లు భోజనం చేస్తారు. టాలెంట్ ఉన్న వాళ్లు ఎలాగూ పైకి వస్తారు. కానీ సినిమాని నమ్ముకుని వచ్చినవాడు కూడా బతకాలి కదా.

**(ముగింపు వచ్చేవారమే)**

**–డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**

## సుధామ పదగారడి-316

**సెల్: 98492 97958**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | 1 | ❖ | 2 | 3 | | ❖ | 4 | ❖ |
| 5 | | | ❖ | | ❖ | 6 | | |
| ❖ | | ❖ | 7 | | 8 | 8 ❖ | | ❖ |
| 9 | | 10 | | ❖ | 11 | 12 | | 13 |
| | 1❖ | | ❖ | 14 | ❖ | | ❖ | |
| ❖ | 15 | 15❖ | 16 | | | ❖ | 17 | ❖ |
| 18 | | | ❖ | | ❖ | 19 | | |
| ❖ | | ❖ | 20 | | ❖ | | | ❖ |
| 21 | | | ❖ | | ❖ | 22 | | |

**ఆధారాలు**

**అడ్డం**

2. ఇది లేనివాడిని ఊరినుంచి తరిమివేయాలి అని సామెత (3)
5. మిఠాయిని ఇందులో చుట్టి ఇచ్చేవారు మునుపు (3)
6. చులకన (3)
7. హిట్లర్, ముస్సోలిని అంటే గుర్తుకొచ్చే మాట (3)
9. మదించిన ఏనుగు (4)
11. లలితా శివజ్యోతివారి తొలి ఈస్టమన్ కలర్ సినిమా (4)
16. సొమ్ము (3)
18. ఆ పువ్వు కాదు నీటిని వేడిచేస్తే వెలువడేది (3)
19. నీరు (3)
20. పిత్తసంబంధి వ్యవహారం (3)
21. పూలచెండు. స్త్రీకి విశేషణం! (3)
22. సూర్యుడు (3)

**నిలువు**

1. కొమ్ములు విసురుతూ మీదకొచ్చే ఎద్దు (4)
3. త్రాగేది ఏదైనా సరే! (3)
4. బ్రతికుంటే ఇది తిని బతకొచ్చని సామెత (4)
7. నిక్కము (2)
8. లత తిరిగింది (2)
9. ముస్లింల పవిత్రస్థలి (2)
10. పొగరు (2)
12. బట్ట (2)
13. అస్త్రం కాదు మరొకటి, యుద్ధవిద్యలోదే (2)
14. కలసికట్టుతనం (5)
15. సూర్యుని రూపం అనే! (4)
17. జాబిల్లి (4)

### పదగారడి-315 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1మ | ల్ల | 2పు | వ్వు | లు | | 3బా | హి | 4రం |
| జ | | లో | | | 5ఉ | హు | | జా |
| గ | | మా | | 6వ | | బ | | న |
| | 7మో | వి | 8పం | ఢ్లు | | 9లి | 10పి | |
| 11పా | గా | | జ | | 12బొం | | 13క | త్తి |
| | 14య | 15గ | రం | | 16కు | 17సు | ము | |
| 18ఉ | | ళం | | 19ము | | బా | | 20కు |
| డ | | 21తి | హ | మ | | షి | | మా |
| 22పె | డ | క | | 23రో | హి | ణి | కా | ర్తె |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**



కుర్రకారు అందాల తార ఆలియా భట్! తెర మీద అందమైన చిరునవ్వుతో నాజూకైన రూపంతో ప్రేక్షకులను కట్టిపడేసే ఆలియా హీరో సిద్ధార్థ్ రిలేషన్‌షిప్‌కి కట్టుబడిపోయింది. ఇంతకాలం వారిద్దరి సంబంధం గురించి నోరు మెదపని ఆలియా నోరు విప్పింది. అయితే తమ ఇద్దరి అనుబంధం శారీరకమైనది కాదనీ, అంతకు మించినది అంటున్న ఆలియాతో.....

# మా రిలేషన్‌షిప్ నిజమే!

## -ఆలియాభట్

**సిద్ధార్థ్ తల్లిదండ్రుల్ని కలిశారట కదా? ఎందుకు?**

గత కొన్ని సంవత్సరాలుగా మేం ఇద్దరం కలిసి నటిస్తున్నాం, నటిస్తాం కూడా! కో స్టార్ తల్లిదండ్రులను కలిస్తే తప్పేంటి? అయినా సిద్ధార్థ్ తన పేరెంట్స్‌తో కలిసి కరణ్ పార్టీకి వచ్చాడు. ఆ పార్టీకి నేను కూడా వెళ్ళాను. పార్టీలో కనిపిస్తే మాట్లాడాను, అంతే!

**మీ రిలేషన్ షిప్ గురించి మాట్లాడ్డానికే వారిని కలిశారట కదా?**

మా రిలేషన్ షిప్ గురించి కొంత చెప్పాలి. మా ఇద్దరి మధ్య రిలేషన్ షిప్ ఉన్న మాట వాస్తవమే! కానీ అది శారీరకమైంది కాదు. అంతకుమించిన అనుబంధం. తెర మీద మా ఇద్దరి కెమిస్ట్రీ బాగున్నంత మాత్రాన మా మధ్య ఏదో బంధం ఉందనడం ఎంత వరకు సబబు?

**ఏ బంధం లేకుండానే నైట్ పార్టీలకు కలిసి వెడుతున్నారా?**

సినిమాల్లో కలిసి నటిస్తున్నాం కనుక కొన్ని పార్టీలకు కలిసి వెళ్ళవలసివస్తుంది. పార్టీలకు వెళ్ళడం అనేది నా వ్యక్తిగతం. నా ఖాళీ సమయంలో వాటికి వెడతాను. నా ఖాళీ సమయాన్ని ఎలా గడుపుతాను? ఎక్కడికి? ఎవరితో వెడతాను? అన్న విషయంలో అందరికీ వివరణ ఇవ్వవలసిన అవసరం లేదు. ఇదే విషయాన్ని ఎన్నిసార్లు చెప్పాలి?

**మీ ఫాదర్ మీతో సినిమా చేయనంటున్నారు?**

నాతో చేయడానికి సరైన కథ దొరకక ఆయన ఆ మాట చెప్పి ఉంటారు. ఏదో ఒక రోజున ఆయన నాతో తప్పకుండా సినిమా చేస్తారు. అప్పటికి నాలో ఇంకా పరిణతి వస్తుంది. నేను స్టార్‌ని కనుక నాతో సినిమా చేయలేనని ఆయన ఆట పట్టిస్తుంటారు అంతే! తప్పకుండా మా ఇద్దరి కాంబినేషన్‌లో ఓ సినిమా వస్తుంది..

**మల్టీస్టార్ సినిమాల్లో చేయకపోవడానికి కారణం?**

ఇద్దరు ముగ్గురు హీరోలూ, హీరోయిన్లూ ఉండే సినిమాల్లో చేయడం మొదటి నుంచీ నాకు ఇష్టం లేదు. అందుకే అలాంటి సినిమాలకు నో చెప్పేస్తాను.

**రెమ్యునరేషన్ పెంచారట కదా?**

మనీ మేటర్స్‌లో నేను చాలా పూర్! ఆ విషయాలన్నీ మా ఫాదర్, మా అంకుల్ చూసుకుంటారు. నాకు ఎంత ఇస్తారు? ఎంత ఇస్తున్నారన్నది కూడా నాకు తెలియదు. ఇక అలాంటప్పుడు నేను నా రెమ్యునరేషన్‌ను ఎలా పెంచుతాను? ఇలాంటి వార్తలు వింటూంటే తెగ నవ్వు వస్తుంది.

**తెలుగులో చేయబోతున్నారట కదా?**

రెండు మూడు ఆఫర్లు ఉన్నాయి. ప్రభాస్, మహేష్ బాబు పక్కన నటించే అవకాశం వచ్చింది. వాళ్ళిద్దరితో చేయడానికి ఎలాంటి అభ్యంతరం లేదు. ఏ మాత్రం అవకాశం ఉన్నా ఆ ఛాన్స్‌ను వదులుకోను.

**సినిమాలకి కొంత కాలం విరామం ఇవ్వాలని ఉంది అన్నారు కదా? ఎక్కడికైనా ప్లాన్ చేశారా?**

నిజమే! కొన్ని వారాల పాటు రెస్ట్ తీసుకోవాలి. వీలైతే ఏదైనా పర్వత ప్రాంతానికి వెళ్ళాలని ఉంది. నన్ను గుర్తుపట్టని ప్రాంతానికి వెళ్ళాలి. అక్కడ ఓ వారం పదిరోజులు గడిపి వచ్చిన తరువాత అమ్మ దగ్గర వంట నేర్చుకోవాలి. యాక్టింగ్‌లో పడి కుకింగ్ పూర్తిగా మరిచిపోయాను.

**ఆలియా బాగా వంట చేస్తుంది అంటారు కదా?**

అది ఒకప్పుడు. అమ్మతో కలిసి కిచెన్‌లో రకరకాల ప్రయోగాలు చేసేదాన్ని. అమ్మ పక్కనుంటేనే గరిట పట్టుకునేదాన్ని. సొంతంగా ప్రయోగాలు చేసింది తక్కువ. ఇప్పుడు వంట నేర్చుకుని స్వంతంగా మా ఫాదర్‌కి వండి పెట్టాలని అనుకుంటున్నాను.

**ప్రతి చిన్న విషయానికీ ఆలియా ఏడ్చేస్తుంది అంటారు నిజమేనా?**

నిజమే! కాకపోతే అన్ని సందర్భాల్లోనూ ఏడుపు రాదు. బాగా అలసిపోయినప్పుడు బాగా ఆకలి వేస్తుంది. ఆ సమయంలో ఏదో ఒకటి తినాల్సిందే! లేకపోతే ఆటోమేటిక్‌గా కన్నీళ్ళు వచ్చేస్తాయి. అది చూసే ఆలియా చిన్నపిల్లలా ఏడుస్తుంది అంటారు.

–కె.రామకృష్ణ

